'హాసం'

హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం

## ఇవీ సంగతులు

44







**ముఖచిత్రం**

'సింహాద్రి'తో

రమ్యకృష్ణ

'సెంటర్ స్ప్రెడ్'లో

'సింహాద్రి'

సినిమా పాటల పుస్తకం

కలర్‌లో






విద్య అనేది రెండు రకాలు.

ఒక విషయానికి సంబంధించిన పరిజ్ఞానాన్ని తెలిసివుండటం. లేదా ఆ విషయానికి సంబంధించిన సమాచారం ఎక్కడుంటుందో ఎరిగి వుండటం. ఈ రెండూ విద్యలే. ఈ రెండిటిలో నిష్ణాతుడు 'హాసం' రాజాగారు. ఒక పత్రిక పేరుతో పాపులర్ అయిన వ్యక్తి నాకు తెలిసి రాజాగారు ఒక్కరే.

మల్టీమీడియా, ఇంటర్‌నెట్, టీ.వి., సినిమా యిన్ని మాధ్యమాలు దాడి చేస్తున్నప్పటికీ, ఒక పత్రికకు గాని, ఒక పుస్తకానికి గాని క్రమంగా పాఠకులు కరువౌతున్న ఈ కాలంలో ప్రారంభించిన అనతి కాలంలోనే రెట్టింపు సర్క్యులేషన్ 'హాసం' సాధించడం వెనుక రాజాగారి కృషి ఎంత వుందో ఆయన్ని తెలిసిన అందరికీ తెలుసు. ఒక సినిమా పాటలపుస్తకం ప్రింట్ చేస్తున్నప్పుడు ఒక అక్షరమో, ఒక పదమో సందేహాస్పదంగా అనిపిస్తే ఆ పాట రాసిన రచయితను ఎక్కడవున్నా (హైదరాబాద్‌లో గాని, రాజమండ్రి, వైజాగ్, మద్రాస్ గాని...నాకు అనుభవం) పట్టుకుని దాన్ని నివృత్తి చేసుకుని ప్రచురణకు వెళ్తారు రాజాగారు. క్లాసిక్స్ రీటోల్డ్, నవ్వుటద్దాలు, ప్రముఖ రచయితల కథలు, నాటికలు, ఆడియోరివ్యూలు, సంగీత ప్రముఖులతో ఇంటర్వ్యూలలో చర్చించబడే విలువైన సమాచారం - ఇవన్నీ నాకు వ్యక్తిగతంగా ఉపకరించే అంశాలు. రాజాగారి సద్విమర్శలు కూడా నన్ను ఒళ్లు దగ్గర పెట్టుకుని పాటలు రాసేలా చేస్తుంటాయి. ఈ మధ్యనే పాత క్యాసెట్స్ రివ్యూలో టంగుటూరి సూర్యకుమారి గురించి చదివి కాసెట్ కొని, విని ఎన్నో విషయాలు తెలుసుకున్నాను. క్రికెట్‌లో సచిన్ టెండూల్కర్‌కు 'unique'(ఏకైక) అనే పదం ఎంత నప్పుతుందో, 'హాసం' కు కూడా ఆ పదం అంతే నప్పుతుంది. హాసాన్ని అందరమూ చదువుదాం. అందరి చేతా చదివిద్దాం. వినోదంతో బాటు విజ్ఞానాన్ని పొందుదాం. బుద్ధికి పదును పెట్టుకుందాం.

అశేషమంది 'హాసం' అభిమానుల్లో ఒకణ్ణి

**-చంద్రబోస్(గీత రచయిత)**

జులై 1-15 సంచికలో 30వ పేజిలో 'సంగీత రహస్యాలు' కింద 'ఆర్కే' అని వుండడంతో- ఆ మేటరు నా పరంగా వుంది. అది సంగీత దర్శకుడు రాజేశ్వరరావు గారు చెప్పినది.

**-ఆర్కే, హైదరాబాద్.**

16-30 జూన్ సంచికలో "సీతయ్య" ఆడియో రివ్యూ చాలా బాగుంది. రాగాల వివరణను తెలియచేస్తూ గతంలోని పాటలను స్మరణకు రప్పిస్తూ మీరు చేసిన రివ్యూ, సంగీత ప్రియులకు ముఖ్యంగా వర్ధమాన గాయనీగాయకులకు వారిలోని సంగీత కళను మెరుగు పరచుకొనుటకు దోహదపడుతుంది. పాటలు విన్న తరువాత "సమయానికి తగు సేవలు" పాట చివరిలో ఆనందబాష్పాలే అనే శబ్ద ఉచ్చారణలో సరియైన జాగ్రత్త తీసుకుంటే ఇంకా బాగుండేది.

**-కె.వి.చార్యులు, బెంగుళూరు.**

ఈ వుత్తరంతో ఒక రూ 2000/- జీవిత చందా పంపిస్తున్నాను. 'హాసం' హాస్య సంగీత పత్రిక ప్రచురణలో మీ కృషి అద్వితీయం, శ్లాఘనీయం. ఒక ప్రత్యేక సినీ నిఘంటువులా హాసాన్ని తీర్చగల మిమ్మల్ని స్నేహితుడు అని చెప్పుకోవటానికి గర్వపడుతున్నాను.

**-కె.సుబ్బిరెడ్డి, హైదరాబాద్.**

ఆచార్య తిరుమల గారి పాండితీ వైభవాన్ని కీర్తించటం ఎవరి తరం? పదునాలుగు భువనాలను శ్రీ కృష్ణుడు తన ఉదరంలో దాచుకున్నట్లు సమస్త శాస్త్ర సాహిత్య సారమంతా తన కుక్షిలో నిక్షిప్తం చేసుకుని కొంచెం కొంచెం కొంచెం రుచి చూపిస్తున్నారు కవి కౌస్తుభ బిరుదాంకితులు. 'హాసం' కొనగానే మొదట తిరుమల గారి వ్యాసం చదువుతాను.(నా సీరియల్ వస్తున్నా సరే!) జులై ప్రథమార్ధ సంచికలోని వ్యాసం 'నభూతో నభవిష్యతి'... అన్నట్లు..ఇది కూడా ఏదైనా శ్లోకం లోని భాగమా? ఇక వేటూరి పండితుల వారి పలుకులను వర్ణించటం నా బోంట్లకు సాధ్యమా? మహదేవన్‌గారి మీద వారు విరచించిన వ్యాసం శిరస్సు మీద అలంకరించుకోతగ్గది. ఆదివిష్ణు గారు మన వెనుక నక్కి చక్కిలిగింతలు పెడుతున్నారు. ఓహో హాసమా! పండితులపాళీలను పరిగెత్తిస్తున్నావే! ఏమని పొగడుదు నిను....

**-ఇలపావులూరి మురళీమోహనరావు, హైదరాబాద్.**

మీ(మా)'హాసం' పత్రిక గత 6 సంచికలనుండి రెగ్యులర్‌గా చదువుచున్నాను. మొదట ఈ పత్రిక చూసినప్పుడు అన్ని పత్రికల్లాగానే ఇది కూడా ఉంటుందనుకున్నాను. కాని 'హాసం'లో ప్రతి పేజి అమూల్యమైనది, దాచుకోదగ్గది. నేటి టెన్షన్ యుగంలో 'హాసం' పత్రిక తన హాస్యంతో పాఠకులకు సేదతీరుస్తుంది. సంగీత ప్రియులైన పాఠకులకు మీరందిస్తున్న పాటలు, విశ్లేషణలు బాగున్నాయి.

**-సి.విజయసారథి, కర్నూలు.**

'హాసం' పత్రిక దిగ్విజయంగా సాగుతున్నందుకు నా శుభాభినందనలు. 16-30 జూన్ సంచిక సంపాదకీయంలో ఘంటసాల కాంస్య విగ్రహం రవీంద్రభారతికి తరలించిన వైనం, ఘంటసాల గారికే ఇంత ప్రాశస్త్యం రావడానికి ఆ మహానుభావునిలో గల అనేక సుగుణాలను వివరించి, భావితరాల వారు నేర్చుకోవలసిన విషయాలను వర్ణించిన తీరు నన్నెంతో ఆకట్టుకుంది. తెలుగు పాట విశిష్టత తెలిసిన రెండుతరాలవారధిగా పద్మశ్రీ ఎస్.పి.బాలసుబ్రమణ్యం గారు ఈ కార్యక్రమానికి పునాది వేసింది మొదలు, పనిపూర్తయినంత వరకు చేసిన కృషికి అభినందనీయులు. ఘంటసాల గారి మీద తనకున్న అవ్యాజమైన భక్తిప్రపత్తులు పలుమార్లు చూపుతూనే వున్నారు. తెలుగు సినీ పరిశ్రమలో ఎవ్వరూ చేయలేని సేవలు ఘంటసాల కార్యక్రమాలకై చేపడుతూ, మొత్తం తెలుగుజాతి ఋణాన్ని బాలూ గారు తీరుస్తున్నందుకు సర్వదా అభినందనీయులు. వేటూరి గారి కొమ్మకొమ్మకో సన్నాయి శీర్షిక చాలా బాగుంది. జంధ్యావందనం అత్యద్భుతం. లలితసంగీతానికి, పద్యానికి ఒక ప్రత్యేక ఒరవడి సృష్టించి, కర్నాటక సంగీతానికి సరిసమాన ప్రతిష్ఠను సముపార్జించిన ఘంటసాల గారి మీద డా॥సినారె, బాలు లాంటి ప్రముఖులతో ఒక సీరియల్ వేస్తే బాగుంటుంది.

**-కళ్యాణపు రాము, శ్రీరాంనగర్ (గరివిడి)**

1-15 జులై నెల పత్రిక చాలా రమణీయముగా వుంది. ముఖ్యంగా అట్టవెనుక మరియు చివర, స్వర్ణోత్సవం పూర్తిచేసుకున్న వినోదా వారి 'దేవదాసు' చిత్రంలోని మరపురాని కమనీయ దృశ్యాలు, మాకు కనువిందు కలిగించాయి. 'అర్థం చేసుకుందాం-ఆస్వాదిద్దాం' ద్వారా 'తాజ్‌మహల్' చిత్రంలోని 'జో వాదా కియావో నిభానా పడేగా', రఫీ, లతా గార్లు పాడిన రెండు భాగాలు సంక్షిప్తంగా అందించినందుకు అభినందనలు. గజల్ కింగ్ మదన్‌మోహన్ వర్ధంతి వ్యాసం చాలా బాగా వుంది. సప్తస్వర సుందరి 'లతా' గారి సీరియల్ ప్రచురణ పత్రికకే హైలెట్. కొమ్మకొమ్మకో సన్నాయి ద్వారా స్వరబ్రహ్మ కె.వి.మహదేవన్ గారి గురించి శ్రీ వేటూరి గారి వ్యాసం సంగీతాభిమానిగా నన్ను చాలా ఆకట్టుకుంది.

**ఎన్.సారంగపాణి, అనంతపురం**

మాకు చిన్నప్పటి నుంచి హిందీ పాటలన్నా, సాహిత్యమన్నా చాలా ఇష్టం. కానీ ఆ భాషమీద అంత పట్టులేదు. అదీకాక ఆ పాటల్లో ఎక్కువ ఉర్దూ పదాలు ఉండేసరికి ఇంకా కష్టంగా ఉంటుంది. ఇప్పుడు మీ ద్వారా ఆ కొరత తీరి హిందీ పాటలు కూడా చాలా సంతోషంగా నేర్చుకుంటున్నాం. ప్రతి పదానికి అర్థం వివరంగా మాకు తెలియచేస్తున్నారు. మేము మీకు సర్వదా కృతజ్ఞులం. ఈ శీర్షిక ఒకటే కాదు ప్రతి శీర్షిక అదుర్స్. ఈ పక్షం హాసంలో మా అభిమాన నటి సావిత్రి ఫోటోలు (దేవదాసు) ప్రచురించినందుకు మళ్ళీ ధన్యవాదాలు.

**-నళినీ కుమార్, సికింద్రాబాద్.**

సంపుటి : 2 సంచిక:20

**16-31 జులై 2003**

పేజీలు: 68 + 8

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో(ఎయిర్‌మెయిల్): $50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో(ఎయిర్‌మెయిల్) : $400


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక

44


మేనేజింగ్ ఎడిటర్

**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్

**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ

డా॥ కె.వి.రావు

జె.మధుసూదన శర్మ


వెబ్‌స్టర్‌డిక్షనరీ చదివేవురా అంటే 'సినిమాగా వస్తుందిగా అప్పుడు చూశేస్తా' అంటాడు రమణగారి జోకులో ఓ స్టూడెంటు కుర్రాడు. ఇది నలభై యేళ్ల క్రితం జోకు కాబట్టి అక్కడితో ఆగింది. టీవీలొచ్చాక పరిస్థితి మరింత అధ్వాన్నమయింది. గోరుముద్దలు కూడా టీవీ ఫ్రేములోంచి పెడితే తప్ప తినని పిల్లలు పుట్టుకొచ్చారు ప్రస్తుత కాలంలో. నేటి యువత కళ్లూ, చెవులూ పూర్తిగా టీవీకే అంకితం చేసేసి పుస్తకపఠనానికి ఫుల్‌స్టాప్ పెట్టేశారని అందరూ బాధపడుతూన్న తరుణంలో హైదరాబాద్ నగరగ్రంథాలయ సంస్థ, మాజిక్ ఫన్‌స్కూల్ వారు సంయుక్తంగా గతపక్షం 5,6 తారీకులలో 15 సంవత్సరాల లోపు పిల్లలకోసం చక్కటి కార్యక్రమం నిర్వహించారు.

పుస్తకాలకు కాలం చెల్లినట్టేనా? అని ప్రశ్నించబోయే ముందు హేరీపాటర్ కళ్లముందు నిలుస్తాడు. హేరీపోటర్ ఐదవభాగం విడుదలరోజున పాఠకులు, ముఖ్యంగా బాలపాఠకులు చూపిన ఉత్సాహం చూస్తే ఏమనిపిస్తుంది? సరైన ధోరణిలో మార్కెట్ చేస్తే పుస్తకాలు కూడా అమ్ముడుపోతాయని అనిపించదూ! పుస్తకంలోని విషయం లీక్ కాకుండా చూడడం, ప్రపంచం మొత్తమంతా ఒకేరోజు, ఒకే సమయంలో రిలీజయ్యేట్టు చూడడం, దాని గురించి విస్తృత ప్రచారం - వీటివల్ల పుస్తకం గురించి ఎంతో ఎక్సైట్‌మెంట్ క్రియేట్ అయింది. పఠితలందరూ ఒకే సమయంలో గుమిగూడేట్లు చేయడం వల్లన ఆ పుస్తకపఠనం వల్ల వారు పొందిన అనుభూతులు కలబోసుకోవడం, సామూహికంగా ఆనందం పొందడం, తద్వారా ఇతర పుస్తకాల గురించి చర్చ, వాటిని చదవడం పట్ల ఆసక్తి కనబరచడం - ఇలా ఎన్నో విధాల మేలు కలిగింది.

హేరీపోటర్‌ది అంతర్జాతీయ స్థాయి అయితే హైదరాబాద్‌లో జరిగినది నగరస్థాయే! కానీ వారు అవలంబించిన థీమ్ చూస్తే బాపు, రమణలకు ఈసెన్‌బర్గ్ మహాశయుడు చెప్పినది గుర్తుకువస్తుంది. అమెరికా - ఫోర్డ్ ఫౌండేషన్ వారి సదరన్ లాంగ్వేజెస్ బుక్ ట్రస్టుకి డైరక్టరుగా పనిచేయడానికి మద్రాసు చేరిన ఆర్థూర్ ఈసెన్‌బర్గ్ అనే పెద్దమనిషి బాపు, రమణలను ఆదరించి, ప్రోత్సహించారు. (కృతజ్ఞతగా 'బుడుగు'ను ఆయనకు అంకితం ఇచ్చారీ మిత్రద్వయం). ఎమెస్కోద్వారా చవకగా పుస్తకాలు లభ్యం చేసి ఇంటింటా గ్రంథాలయం వెలవడం ఆయన కృషి ఫలితమే!

పుస్తకాలు చదివించే అలవాటు పెంచడానికి ఆయన కొన్ని ఉపాయాలు చెప్పేవారట. "బాపూ! నువ్వు వారపత్రికలో కథలకి బొమ్మలు వేసినపుడు గోడ దగ్గర బుక్‌రాక్ వేసి దాంట్లో పుస్తకాలు పెట్టు - గోడలేకపోతే గదిమధ్య టీపాయి మీదనో మంచం మీదనో కుర్చీమీదనో సగం చదువుతూ బోర్లించినట్టు పుస్తకాల బొమ్మలు వుంచు - సినిమా తీస్తే వీలైనన్ని చోట్ల పుస్తకాలు చూపించు.. దీన్ని 'హిడెన్ సెల్' అంటారు. బొమ్మ చూసేవాడికి తెలియకుండానే పుస్తకాల మీద ధ్యాస పెరుగుతుంది. ఎరువడగడం, కొనడం, చదవడం పెరుగుతాయి..క్రమంగా బుర్రలు తెరుచుకుంటాయి..సమాజానికి మేలు జరుగుతుంది.."

ఇంచుమించు ఇదే విధానం పెట్టుకున్నారు మాజిక్ ఫన్‌స్కూలు వారు. పెయింటింగ్ పోటీలో థీమ్ 'బుక్స్'! 'ట్రెజర్ హంట్'లో దొరికే ట్రెజర్ 'బుక్'! డాన్సుపోటీలో చేతిలో పుస్తకం పట్టుకుని డాన్స్ చేయాలి. ఫాన్సీడ్రెస్ పోటీ కూడా పుస్తకం అనే అంశం మీదే. అంటే చిన్నచిన్న పుస్తకం బొమ్మలను లోలాకులుగా పెట్టుకున్న వారొకరయితే, పుస్తకంలా డ్రెస్ చేసుకుని వచ్చినవారొకరు. చివరకు పచ్చబొట్టు(టాటూ) కూడా పుస్తకమే! ఇవి కాక ఓ చిన్నకథను చదివి వినిపించడం, డిక్షనరీలోని ఓ మాటకు ఎవరు ముందుగా అర్థం చెబుతారో పోటీ పెట్టడం, బుక్ రీడింగ్ పై వక్తృత్వపోటీ, క్విజ్, ఎటుచూసినా బుక్స్, బుక్స్, బుక్స్. ఇక పుస్తకాల ఐడియా పిల్లలకు బుర్రలో నాటుకోకుండా ఉంటుందా?

సింగపూర్‌లో సిండా అనే ఓ అసోసియేషన్ 'ప్రాజెక్ట్ రీడ్' అనే పథకం మొదలుపెట్టారు. సిండా స్వచ్ఛంద కార్యకర్తలు వారానికి ఒకటి రెండుసార్లు ఇళ్లకు వచ్చి పిల్లలకు పుస్తకాలు చదివి వినిపిస్తారు. వారే కొన్ని పేటల్లో రీడింగ్ సెంటర్స్ కూడా నిర్వహిస్తారు. అంతటి ఆర్థిక వసతి గల అసోసియేషన్స్ మనదేశంలో లేవనుకున్నా ఊరూరా ఉన్న లైబ్రరీలు పైన చెప్పిన బుక్‌రీడింగ్ ఫెస్టివల్ వంటివి నిర్వహిస్తే చాలా మంచిది. లేకపోతే కొద్దికాలంలోనే వాటిలో వృద్ధులు తప్ప వేరెవరూ కనబడరు. చదివేవారు లేనప్పుడు ఎందుకొచ్చిన దండగ ఖర్చని ప్రభుత్వం వాటిని ఏ సినిమాహాళ్లకో లీజు కిచ్చేయవచ్చు.

ఊరూరా ఇటువంటి ఫెస్టివల్స్ జరగాలని, నేటితరం పుస్తకపఠనం పై ఆసక్తిని పోగొట్టుకోకూడదని 'హాసం' ఆశిస్తున్నది.


HAASAMHAASYASANGEETHAPATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

# "నమోనమః" (నాటిక)

**- దివాకరబాబు**

ప్రముఖ సినీ రచయిత



ఇందులో 4 పురుష పాత్రలు, 1 స్త్రీ పాత్ర వున్నాయి. పురుష పాత్రల వయసు 25 సంవత్సరాలు, స్త్రీ పాత్ర వయసు 19 సంవత్సరాలు... 25 సంవత్సరాలు పైబడిన వయసు వాళ్ళయినా పురుష పాత్రల్ని పోషించవచ్చు. కానీ స్త్రీ పాత్ర మాత్రం ఖచ్చితంగా 19 సంవత్సరాలే..

-దివాకరబాబు

**లైట్ ఆన్ అయ్యేసరికి అడవిలో మరో చోటుకి వచ్చారు.**

ప్రజ : అబ్బా కాళ్ళు పీకేస్తున్నాయ్...ఇంక నేను నడవలేను.

నర : ఎత్తుకోనా...

ప్రజ : ఆఁ

కళా : బరువు మొయ్యలేక పెళ్ళాన్ని విమానంలో వొదిలేసినట్లు నిన్ను వొదిలేస్తాడు జాగ్రత్త...

నర : షటప్...

కళా : యూ షటప్...

నర : యూ రాస్కెల్..

కళా : యూ రాస్కెల్...

అంటూ కొట్టుకోపోతారు.

సైంటి : (వాళ్ళ మధ్యలోకి వచ్చి) హలో ఇప్పుడు మనం సవతి మొగుళ్ళం. పోట్లాడుకోకూడదు. ఆపండి..

కొట్లాట ఆపబోయి వాళ్ళు ఆపగానే సైంటిస్టు కిందపడ్డాడు.

సైంటి : అమ్మో... పడ్డా..

ప్రజ : నువ్వు పడితే పడ్డావ్ కానీ అవతల చీకటి పడ్తోంది.... ఇప్పుడు అడవిలో ప్రయాణం చెయ్యడం ప్రమాదం... ఇక్కడే వుందాం...

నర : ఇక్కడికి చీకటి రాదా...

కళా : వస్తుంది... కానీ చీకట్ని వెళ్ళగొట్టే అయిడియా కనిపెట్టా...

సైంటి : ఈసారి కనిపెట్టా అంటే నాలుక కోస్తా...

ప్రజ : అబ్బ నువ్వాగు... ఏంటో చెప్పు...

కళా : ఎండుపుల్లలు ఏరుకొచ్చి నెగడువేద్దాం...

నర : దట్స్ బ్రిలియంట్ ఐడియా!

సైంటి : ఏరుకొద్దాం పదండి-

ప్రజ : పదండి...

కళా : నువ్వెందుకు ప్రజా... నీకు సేవ చేయడానికి మేం వున్నాం కదా...

సైంటి : కొద్దిగా ఎక్కువైంది కానీ... రా..

అంటూ ముగ్గురూ వెళ్ళారు. ప్రజ సూట్‌కేస్ తీసుకుని రాబోతుంటే నరసింహం వచ్చి -

నర : డోన్ట్ టచ్

ప్రజ : నువ్వు వెళ్ళలేదేం?

నర : వాళ్ళు తెస్తారులే... అవసరమయితే కూలీ యిద్దాం.

కళాకారుడు, సైంటిస్టు పుల్లలతో వచ్చారు. ఒకచోట వెయ్యబోతే -

నర : అక్కడ కాదు ఇక్కడ..

కళాకారుడు, సైంటిస్టు పుల్లలను కిందవేసారు.

కళా : ఏంటీ పుల్లలు తీసుకురాలేదు?

నర : అక్కడ పుల్లలు లేవు. రత్నాలు, వజ్రాలు, మణిమాణిక్యాలున్నాయి.

కళా : కొంటరా...?

సైంటి : సర్లే... ఎవరి దగ్గరైనా అగ్గిపెట్టె వుందా...?

నర : అగ్గిపెట్టె ఏంటీ చీప్‌గా.. లైటర్ వుంది రిచ్‌గా...

సైంటి : అవునూ ఇంతవరకూ ఏ జంతువులు మన వైపుకి రాలేదేంటి?

ప్రజ : మనుషులం కదా, భయపడి వుంటాయి.

సైంటి : అవును కరెక్ట్.

కళాకారుడు పడుకున్నాడు.

ప్రజా : అమ్మో...( పెద్దగా అరిచింది)

ముగ్గురూ : ఏమైంది...?

ప్రజ : నాకు కడుపులో ఏంటోగా వుంది.

కళా : నాకూ అలాగే వుంది.

సైంటి : నాకు ఇంకోలా వుంది.

ప్రజ : అమ్మో ఏదో అయిపోతోంది...

నర : డబ్బిస్తే పోతుందా?

సైంటి : ఆపు నీ డబ్బుగోల.. మనకేదో జబ్బొచ్చింది.

ప్రజ : ఏంటిది.. క్షణక్షణానికి ఎక్కువవుతోంది.

సైంటి : కనిపెట్టేసా.... మనం చచ్చిపోబోతున్నాం....

నర : చావు కబురు చల్లగా చెప్పావ్.. ఇప్పుడేం చేద్దాం...

సైంటి : చావునించి తప్పించుకోవటం ఎవరి వల్లా కాదు పైకెళ్ళి పోవడమే.

నర : అవునా... నా సూట్‌కేస్ కూడా తీసికెళ్ళొచ్చా...

సైంటి : అలా తీసికెళ్ళగలిగితే ఈ భూగోళమే ఉండేది కాదు...

ప్రజ : మేం ఇంతలా బాధపడ్తుంటే నువ్వేంటి నిశ్శబ్దంగా కూర్చున్నావ్...

కళా : అన్ని శబ్దాల్లోకి గట్టిగా వినబడేది నిశ్శబ్దమే... మనకొచ్చిన



**జరిగిన కథ**

**హైదరాబాదునుండి ముంబాయికి వెళ్ళే ఓ విమానం కుప్పకూలుతుంది. పారాచూట్ సహాయంతో తప్పించుకున్న ధనవంతుడు నరసింహం, కవి అయిన కళాకారుడు, మేధావి అయిన సైంటిస్టు, మిస్ యూనివర్స్‌పోటీకి వెళుతున్న ప్రజ అనే అందమైన అమ్మాయి - ఓ అడవిలో తారసిల్లుతారు. నరసింహం వద్ద సూట్‌కేసులో డబ్బుంటుంది. అందరూ తలోదారిని వెళ్ళి దగ్గర్లో ఊరు ఎక్కడుందో కనిపెడదామని అనుకుంటారు.**

**(ఇక చదవండి)**

జబ్బేమిటా అని ఆలోచిస్తున్నాను.

ప్రజ : తెల్సిందా...?

కళా : తెల్సింది...

నర : ఏంటి? ఎంత ఖర్చయినా తగ్గించుకుంటాను.

కళా : దీనికి మందు లేదు. నీ డబ్బుతో ఇది నయం కాదు...

సైంటి : అంటే...

కళా : ఇది మందులేని భయంకరమైన వ్యాధి- ఈ వ్యాధి సోకే ఎన్నో యుద్ధాలు జరిగాయి. దారుణాలు జరిగాయి. ఈ వ్యాధి సోకితే తరతమ భేదాలు మర్చిపోతారు. నీతి న్యాయం వుండదు.. అంతా స్వార్థం...

ప్రజ : అంత భయంకరమైన ఆ వ్యాధి ఏంటి?

కళా : సకల ప్రాణికోటిని తన గుప్పెట్లో పెట్టుకుని ఆడిస్తున్న ఈ వ్యాధి పేరు ఆకలి!

నర : ఆకలా? అదెలా వస్తుంది?

కళా : కడుపుకి ఓ పూట ఫుడ్ లేకపోతే వస్తుంది.

ప్రజ : నీకెలా తెల్సు....

కళా : నేను కళని నమ్ముకున్న రోజుల్లో తెలుసు- ఆకలి విలువ...

నర : నాకసలు ఆకలి అంటే ఏంటో కూడా తెలీదు!

ప్రజ : ఎలా తెలుస్తుంది. ఎర్లీ మార్నింగ్ బ్రేక్ ఫాస్ట్.. మధ్యాహ్నం లంచ్... ఈవినింగ్ స్నాక్స్... నైట్ డిన్నర్ అన్ని రెడీగా వుంటే ఆకలి ఎలా తెలుస్తుంది...

నర : ఇప్పుడెలా తెల్సింది?

సైంటి : ఆకాశంలోంచి నేల మీదకి దిగాం కాబట్టి తెల్సింది-

ప్రజ మెలికలు తిరిగి పోతోంది.

ప్రజ : ఆకలి... ఆకలి తట్టుకోలేక పోతున్నాను.

నర : ప్రజా... కొంచెం ఓర్చుకో, మనం సిటికీ వెళ్ళగానే అన్ని దేశాల స్టార్‌హోటల్స్‌నించి నీకు ఏ ఫుడ్ కావాలంటే ఆ ఫుడ్ తెప్పించి పెడతా....

ప్రజ : ఇప్పుడు ఆకలేస్తోందంటే ఎప్పుడో పెడతానంటావేంటి. నాకు ఇప్పుడే కావాలి.

కళా : ప్రజా... ఇట్రా....

పక్కకి పిలిచి

ఆకలి మామూలు జనానికి.
మనలాంటి కళాత్మక హృదయాలకి
ఆకలుండదు... ఆకలుండదు...
దాహముండదు... నిన్ను చూస్తుంటే...

ప్రజ : నీ బొంద... ఆకలేసి చస్తుంటే నీ కవిత్వం



ఎవడిక్కావాలి.. బోడి కవిత్వం...

సైంటి : ప్రజా.. నువ్వేం కంగారు పడకు... అసలెప్పటికీ ఆకలి వెయ్యకుండా వుండే మందు కనిపెడతా...

ప్రజ : నువ్వు మందు కనిపెట్టేసరికి నేను చచ్చిపోతా....

నర : అడవిలోకి వెళ్ళి ఏవైనా కాయలు, పండ్లు దొరుకుతాయేమో ట్రై చేద్దామంటే చిమ్మచీకటి... క్రూరమృగాలు...

సైంటి : కుందేలు లాంటి చిన్న జంతువులు మంటల్ని చూసి ఈ వైపు రావు...

కళా : ఐడియా... పోనీ ఆకుల్ని తిందాం...

సైంట : తిను... అవి విషపూరితమైనవి అయితే చచ్చూరుకుంటావ్...

ప్రజ : అమ్మో... ఆకలి...ఆకలి...

కళా : ప్రజకి ఎప్పుడూ ఆకలి గోలే...

ప్రజ : నాకేనా, మీకు మాత్రం ఆకలి వెయ్యడం లేదా....

నర : వేస్తోంది... ఓర్చుకుంటున్నాం...

సైంటి : ప్రజా, ఆడదానివి కాబట్టి ధైర్యంగా పైకి చెప్పావ్... మొగాళ్లం బయటికి చెప్పలేక పిసుక్కు చస్తున్నాం.

నర : ఇంక మనం చెయ్యగలిగింది ఏమీలేదు. తెల్లారే వరకూ వెయిట్ చేయ్యడమే...

ప్రజ కూర్చునివుంది.. మెలికలు తిరుగుతూ... పొట్ట చేత్తో పట్టుకుని..

కళాకారుడు, సైంటిస్టు అటూ,ఇటూ ఆలోచిస్తూ తిరుగుతున్నారు.

నరసింహంకి వాళ్ళని చూస్తుంటే సైంటిస్టు కోడిలా, కళాకారుడు పందిలా కనిపించాడు. నరసింహం తనలో తనే నవ్వుకున్నాడు.

కళా : ఏంటి నవ్వుతున్నావ్...

నర : నాకు నువ్వు అడవి కోడిలా కనబడుతున్నావ్...

సైంటి : ఆహాఁ... మరి నేను..?

నర : అడవిపందిలా కనబడుతున్నావ్....

కళా : అంటే మమ్మల్ని చంపితింటావా....

నర : ఏంటి మీకు నేను నరమాంసం తినేవాడిలా కనబడుతున్నానా....?

కళా : మీ డబ్బున్న వాళ్ళు చేసే పని అదేగా జనాల్ని పీక్కు తినడం...

సైంటి : మీ కళాకారులు వుద్ధరిస్తున్నారా... ప్రజల వీక్‌నెస్‌ని ఎక్స్‌ప్లాయిట్ చేయ్యడం లేదూ....

నర : నువ్వేంటి... రోగాల్ని త్వరగా తగ్గించడం కోసం సైడ్ ఎఫెక్ట్ వచ్చే మందులు కనిపెట్టి ప్రజల్ని దోచేయడం లేదూ....

ప్రజ : మీరు మీరు పోట్లాడుకోవమేనా? నా ఆకలి గురించి పట్టించుకోరా....

ముగ్గురూ ఆలోచిస్తున్నారు.

సైంటి : ఇలా తిరిగితే వున్న ఓపిక కూడా పోతుంది. హాయిగా పడుకుందాం, అంతకు మించి ఏమీ చెయ్యలేం.

అందరూ పడుకున్నారు.

ప్రజని లేపి పక్కకి తీసుకొచ్చాడు నరసింహం.

నర : మన ఆకలి తీరాలంటే ఒకటే మార్గం.

ప్రజ : ఏంటి?

నర : ఆ సైంటిస్ట్ అడవి కోడిలావున్నాడు. అందరూ గాఢనిద్రలో వున్నప్పుడు వాడి తల పగలగొట్టి చంపేస్తాను. కాల్చుకు తిందాం.

ప్రజ : నరమాంసమా?

నర : ఆకలి తీరాలంటే ఏదో ఒకటి తినాలి

ప్రజ : పాపం కదా..

నర : నా దగ్గర కావాల్సినంత డబ్బు వుంది. పుణ్యం కొనుక్కుందాం. ఇంకేం ఆలోచించకు నా మాట విను. కమాన్.

అంటూ చెయ్యి పట్టుకుని తీసికెళ్లాడు.

వచ్చి పడుకున్నారు.

సైంటిస్ట్ ప్రజని లేపి పక్కకి తీసుకొచ్చాడు.

సైంటి : కనిపెట్టా.... మన ఆకలి తీరటానికి మార్గం కనిపెట్టా...

ప్రజ : ఏంటి?

సైంటి : నువ్వు నిద్ర నటించు.. వాళ్ళిద్దరూ నిద్రలోకి జారుకున్నాక కళాకారుడ్ని చంపేస్తా... కాల్చుకుతిందాం.

ప్రజ : తప్పుకదా....

సైంటి : తప్పదు కదా...

ప్రజ : మనుషుల్ని చంపుకుతింటానికి మనం రాక్షసులం కాదు.

సైంటి : ఆకలి మనుషుల్ని రాక్షసులుగా మారుస్తుంది. ఇప్పుడే కనిపెట్టా.

ప్రజ : కానీ...

సైంటి : ఇంకేం ఆలోచించకుండా నేను చెప్పినట్టు చెయ్యి. పద...

చెయ్యిపట్టుకుని తీసికెళ్ళాడు.

కళాకారుడు ప్రజని లేపి దూరంగా తీసుకొచ్చాడు.

కళా : ప్రజా.... నీ ఆకలి నేను తీరుస్తాను

ప్రజ : ఎలా...

కళా : ఆకలేసినపుడు ఏదైనా తినొచ్చని శాస్త్రం చెబుతోంది. నరసింహాన్ని చంపేస్తా... కాల్చుకుతిందాం.

ప్రజ షాక్ అయి చూస్తోంది.

ప్రజ : నరసింహం కంటే నన్ను చంపుకు తినటం ఈజీ గదా!

కళా : అమ్మో! ప్రజా... నువ్వు లేకపోతే నాకు బ్రతుకులేదు. పైగా.. ఆ నరసింహం గాడ్ని చంపేస్తే ఆ సూట్‌కేస్‌లో వున్న డబ్బుకూడా మనకి దక్కుతుంది. ఇంకేం ఆలోచించకు...

ప్రజ ఆలోచిస్తోంది...

పద... అంటూ చెయ్యిపట్టుకుని తీసికెళ్ళాడు.

వచ్చి పడుకున్నారు.

అందరూ పడుకున్నట్టు నటిస్తున్నారు.

-(ఇంకావుంది)



# దిసీజ్ ఖర్మ... దట్సాల్...!




పుట్టినరోజు నాడు అనాధ శరణాలయంలో స్వీట్లు పంచితే పుణ్యమని దగ్గరుండి స్వీట్లు చేయించి పంచుతారు.



పిల్లలు తిన్న ఆ స్వీట్లలో విషం కలిసిందని పుట్టినరోజు పూటా పోలీసులు మిమ్మల్ని అరెస్టు చేయడానికి వస్తే...




ఓ పత్రికలో మీ కథ పడిందనే ఆనందంతో మీ స్నేహితులకు పార్టీ ఇచ్చి, పాఠకుల రెస్పాన్స్ చూశాక మరో పార్టీ ఇస్తానని ప్రకటిస్తారు.




పాఠకులు తిడుతూ రెస్పాన్స్ ఇచ్చిన మరుసటి సంచిక కాపీలను పార్టీ కోసం మీ ఫ్రెండ్స్ కొనుక్కొని వచ్చి ఆ ఉత్తరాలను బిగ్గరగా చదువుతూ వుంటే...



డాక్టర్ గారి సలహాల లైవ్ ప్రోగ్రామ్‌లో మోడల్‌గా పాల్గొనమని ఓ ప్రముఖ టీవి ఛానల్ నుంచి మీకు ఆహ్వానం వస్తుంది.



ప్రేక్షకుల ప్రశ్నలకు సమాధానాలు ఇస్తూ డాక్టర్ గారు సకల రోగాలకు ఉదాహరణగా మిమ్మల్నే చూపుతూ వుంటే...

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

## క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల

### చిన్నవాటి మీద పెద్ద చూపు




లోకంలో చాలా మందికి పెద్దవాటి మీద కూడా చిన్న చూపు, నిర్లక్ష్యం ఉంటుంది. కవులకి మాత్రం చిన్నపాటి మీద కూడా పెద్ద చూపే వుంటుంది. నిజానికి, వాళ్లకి అక్కర్లేని విషయమంటూ ఏమీ వుండదు. రవి చూడనివి కూడా కవి చూస్తాడు; తన కవితా శక్తితో వాటిని అజరామరం చేస్తాడు. పూర్వం ఈ విషయాన్ని 'దశరూపక' కర్త ధనంజయుడిలా ప్రస్తావించాడు:

రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచం
ఉగ్రం ప్రసాది గహనత వికృతం చ వస్తు
య ద్వాప్య వస్తు కవి భావుక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే!!

ఒక విషయం రమ్యమైంది గానీ, జుగుప్సాకరమైంది గానీ, ఉదారం గానీ, నీచం గానీ, ఉగ్రమైంది గానీ ప్రసన్నమైంది గానీ, గహనమైంది గానీ, వికృతమైంది గానీ కవి భావనలో మథింపబడి, వెలువడింది లోకానికి ఆనంద దాయకం గానే ఉండి తీరుతుందని తాత్పర్యం.

శ్రీశ్రీ ప్రస్తావించిన కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ల, రొట్టె ముక్క, అరటి తొక్క, బల్ల చెక్క, తలుపు గొళ్లెం, హారతి పళ్లెం, గుర్రపు కళ్లెం - ఏదీ కవిత కనర్హం కాదు. అటువంటి చిన్న చిన్న వాటి మీద కవుల పెద్దదృష్టి ఎలా వుంటుందో కొన్ని వస్తువులు (విషయాలు) తీసుకుని పరిచయం చేస్తాను.

నల్లి మీద కొప్పరపు కవులు లయగ్రాహి వృత్తంలో ఎంత చమత్కార పద్యం చెప్పారో చూడండి:-

మల్లెలును మొల్లలును జల్లినను శయ్యపయి నల్లి యొకడుండ సుఖమెల్లయును
పాడం చెల్లరు వచింతు రటు లెల్లిదము సేయ దగ్గ దల్ల కుసుమాంబకుని భల్ల మది యందున్
వల్లభుడు కాంత ముద మల్లు కొన సెజ్జగన పెల్లెగసి నిద్ర తను వెల్ల మరిపింపన్
ఝల్లు మన గుట్టి రతి నుల్లములు దన్ని భళి వల్లెయని వారినుతు లల్లపుడె గంటన్!!

మల్లెపాన్పుపై నల్లి ఉంటే సుఖం పాడు చేస్తుందంటారు కానీ కాదు. క్రీడించి నిద్రించే ప్రేయసీప్రియుల్ని మన్మథున్ని బల్లెం లాంటి అది కుట్టి, లేపి, మళ్లీ వాళ్లు సుఖపడేలా చేసి మేలే చేస్తుందని భావం.

కాకిని చాలామంది దూషిస్తారు కానీ నేను మాత్రం నా 'రుద్రాక్షలు' కావ్యంలో-

పువ్వు లేనప్పుడు
కొమ్మ కూడా అందంగానే ఉంటుంది!
తద్దినం నాడు కోకిలెందుకు?
కాకే ఆత్మ బంధువవుతుంది!!

అని ప్రస్తుతించాను. ఒక సంస్కృత కవి కాకి అరుపు కెంత అర్థం చెప్పాడో చూడండి:

వయం కాకః వయం కాకః- ఇతి జల్పంతి వాయసః
తిమిరారిః తమోహంతి - అస్మాక్ హంతి ఇతి శంకః!!

చీకట్లతో బాటు తమను గూడా యెక్కడ హరిస్తాడోననే భయంతో కాకులు తెల్లవారగట్ట సూర్యుణ్ని "కావు-కావు" మని (అంటే రక్షించుమని' అరుస్తున్నాయట!

గువ్వల చెన్న శతకంలో-

పక్కల నిడి ముద్దాడుచు
చక్కగ కడుగుచును దినము సబ్బు జలముచే
నక్కఅదని యస్పృశ్యపు
కుక్కల పెంచుదురు ద్విజులు గువ్వల చెన్నా!!

అంటూ కుక్కల పెంపకాన్ని గూర్చి బ్రాహ్మణుల్ని యీసడిస్తూ చెబితే. మరోకవి గారు తన పెంపుడు కుక్కను గూరి

విశ్వాసానికి మారుపేరు
తోకాడించే తీరేవేరు
ఆకారానికి పోటీలేదు
నీవుంటేనే నాకు హుషారు - అంటూ పొంగిపోయాడు.



పిల్లి మీదైతే బోయి భీమన్న గారొక మహాద్భుతమైన శతకమే రాశారు. ఒక సంస్కృత కవి మేక మీదెలా జాలిపడ్డాడో యీ శ్లోకంలో చూడండి.

అశ్వం నైవ గజం నైవ వ్యాఘ్రం నైవచ నైవచ
అజాపుత్రం బలిం దద్యాత్ దైవో దుర్బల ఘాలకః!!

గుర్రాన్నో, ఏనుగునో, పులినో బలి యివ్వరు. దుర్బలమైన మేకపిల్లనే బలిస్తారు. దేవుడు కూడా దుర్బలులనే శిక్షిస్తాడని భావం.

మరో కవి చిలుకని చూపించి మనిషికెంత బుద్ధి చెపుతున్నాడో చూడండి:-

సద్విద్యా యది కా చింతా-
వరా కోదర పూరణే
శుకోప్యసన మాప్నోతి - రామ
రామేతి చా బ్రువన్!!

'రామ రామ' అని రెండు మాటలు నేర్చుకున్న చిలుక తన తిండి తాను సంపాదించుకుంటూ వుండగా బాగా చదువుకున్నవాడు తన పొట్టకోసం ఎందుకంత చింతించటమని హెచ్చరిక!

శ్రీనాథ మహాకవి తన నైషధ కావ్యంలో హంస నోట-

"భారతీదేవి ముంజేతి పలుకు చిలుక, సమద గజయాన!
సబ్రహ్మచారి మాకు" అనిపిస్తాడు.

చిలకకెంత ప్రాధాన్య మిచ్చారో చూడండి: అది మన్మథుని వాహనం, చదువుల తల్లికి చెలికత్తె. అంతెందుకు, వ్యాసమహర్షి తన కుమారునికి శుకుడని పేరు పెట్టుకున్నాడు. చిలక జోస్యం ఉంది, చిలక కొట్టుడు వుంది, చిలక సాహిత్యం చాలా వుంది.

కూరగాయల మీదెన్నెన్నో తమాషా రచన లొచ్చాయి. గోంగూర మీద పాటలూ, పద్యాలు ఎన్నో వచ్చాయి.

వెల్లుల్లి బెట్టి పొగిచిన
పుల్లని గోంగూర రుచిని పొగడగ వశమా?
మొల్లముగ నూనె వేసుకు
కొల్లగ భుజియింప వలయు గువ్వల చెన్నా!!

అని చెన్నడంటే సినారె "గోంగూర కోసమై గుటక లేసేవాడు" తెలుగువాడని దానిమీద ఆంధ్రాభిమానాన్ని ప్రకటించారు. ఉల్లిపాయ మీద సుబ్బారావు కవిగారు- "ఓ యుల్లిపాయా! నమో యుల్లిపాయా! నినుం బూజగావింతు నీ వాసనల్లేక నే కూరయుం గూడ నేదో మరో మట్టి దిన్నట్లుగా దోచు.... మా కాంక్షలందీర్పవే, పూర్వకాలంబులో రీతిగా కూరలన్నింటికిన్ కొత్త టేస్టుల్ ప్రసాదించి మా జిహ్వకుం దృప్తి చేయంగదమ్మా! నమస్తే నమస్తే నమస్తే నమః" అంటూ ఓ దండకమే రాశారు. మరో కొంటె కవి తెలుగు పదాలకు సంస్కృత అత్యయాలు జోడించి-

కాచీ కాచీ ములక్కాయా, కాయవే పొట్టి కాకరీ
కాయనాం వంగపింజానాం కూరానాం గుజ్జు పచ్చడిః!!

అంటూ ములగ, కాకర, వంకాయల్ని పచ్చడి చేసేశాడు. పచ్చి మిరపకాయ మీద తిరుపతి కవులెంత అందమైన పద్యం చెప్పారో చూడండి:-

ఎద్దాని సంబంధ మెలిమి గల్గిన మాత్ర
కూరలెల్లను మంచి గుణము గనునో
కొత్తిమీరిని నూరుకొని తిన్న నెయ్యది
కంచె డన్నము తినగలుగ జేయు
ఎద్దాని శిశుజాల మెరుగక చేబట్టి
కనులు నల్గిగ మంట గలుగ జేయు
ఎద్ది తా క్రమముగా నెదిగి పంపిన మీద
జోటి కెమ్మోవితో సాటి యగునా
నూరి దేనిని పుల్లనై మీరు మెంతి
పెరుగులో గూర్ప స్వర్గము నెరుగజేయు
నరుల కెల్లను నా పచ్చి మిరపకాయ
మహిత భక్తిను నేను నమస్కరింతు!!

అంటూ దణ్ణం పెట్టేశారు. గువ్వల చెన్న శతకం గొంగళి మీద పద్యం-

అంగీలు పచ్చడంబులు
సంగతి గొను కాలు జోడు సరిగంచులమేల్
రంగగు దుప్పటులన్నియు
గొంగలితో పోలవన్న గువ్వల చెన్నా!!

తో ప్రసిద్ధి కెక్కిందంటే అత్యుక్తి కాదు. స్త్రీకి అంత అందమిచ్చే జడ వెనుక భాగానే యెందుకుందో తిరుపతి కవుల యీ చమత్కార పద్యం చదివితే తెలుస్తుంది.

పురుషాయిత మొనర్చు పూబోడి కటి మీద
నాట్యమ్ము సల్పు పుణ్యము కొరకో
ఘన నితంబ స్థలమును పెన్నిధానంబు
బహు భద్రముగను కాపాడు కొరకో



తానాశ్రయించు కొంతకు వెన్క భాగమ్ము
 నను గూడ సౌందర్య మునుపు కొరకొ
పదిమంది దృష్టులు పడిన కంటక మంచు
 నూహించి కనబడకుండు కొరకొ
వేణి కాంతల వెన్నంటి వ్రేలు చుండె
లేక యుండిన నిధువన లీల కుపచ
రించు సంగమ్ము లెదులనే నంచు నించ
దాని కట్టుండ నే యుపద్రవము వచ్చె?

నడుం మీద నాట్యం చెయ్యటానికో. పిరుదులనే నిధిని - పాలిలులా కాపాడటానికో, వెనుక భాగాన్ని కూడా అందంగా వుంచటానికో, ఎదుటుంటే దృష్టిదోషం తగులుతుందనో జడ స్త్రీకి వెనుకవైపునే ఉన్నదట! జడ మీదే కాదు ఒక వెంట్రుక మీద కూడా ఎంత అందమైన స్రగ్ధర పద్యం చెప్పారో చూడండి:-

అంభోజాతాక్షి వేణిన్ హరువు గనిన రోమాతి సౌభాగ్యమెంతే
సంభావింతున్ పయోము క్సముదయ రుచులున్ స్ఫార రోలంబ కాంతల్
శుంభద్ధ్వాంత ప్రభకి హెచ్చుగా గొని విధి యెచ్చొప్పుగా గూర్చి యూపై
జంభద్విడ్ రత్నరోజుల్ చమిరి యొనరుపన్ చక్కనౌ తీవె యెనాన్!!

మబ్బులా, తుమ్మెదలా, చీకటిలా. ఇంద్రనీలంలా నల్లగా ఉన్నదట ఆ తల వెంట్రుక! అని పద్యాని కెక్కిందంటే దాని భాగ్యం కాక మరేమిటి? చీపురు పుల్ల మీద చీకుముల్ల మీదా కూడా తిరుపతి కవులెంత గొప్ప పద్యాలు చెప్పారో చూడండి:-

తిరు నామంబిడు వేళను
వర వైష్ణవమణుల కెల్ల వరసాధనమౌ
నరయంగ నహహ! యీ చీ
పురుపుల్ల బుధాళి కర్ణపుట రంధ్రగమౌ!!

బొట్టు పెట్టుకోవటానికి, చెవిలో గోక్కోటానికి చీపురుపుల్ల పనికొస్తుందని పద్యం. ఇక చీకు ముల్ల మీద పద్యం చూడండి.

ఇది దుష్టబుద్ధి గల వారికి చెప్పుదెబ్బలాంటి పద్యం:-

నిన్ను కాల్చిన గాని నీ బుద్ధి మానవే
 చీ! యేమనందునే చీకుముల్ల!
దొంగరీతిని దూరి దొరక కుందువు గదే
 చీ! యేమనందునే చీకుముల్ల!
పొరలోపలం జేరి పోటు గూర్చెదుగదే
 చీ! యేమనందునే చీకుముల్ల!
పదమాశ్రయించియు బాధపెట్టెదు గదే
 చీ! యేమనందునే చీకుముల్ల!
నిన్ను మర్యాదగా జూచునేని యెట్టి
దక్షుడేనియు నీదు కోతలకు లోగు
చెప్పు దెబ్బకు తప్ప నీ చెడ్డ గుణము
చీకదు సుమీ! యిసీ! యిసీ! చీకుముల్ల!!




బాధపెట్టే వాళ్లని పదే పదే తిట్టుకునే పద్ధతి ప్రకారమే ఈ పద్యంలో చీకుముల్ల సంబోధన పదే పదే కనిపిస్తుంది. అదే మరి, భావౌచిత్యమంటే!

ఒక కవి గారు ఎలుక మీద ఎంత గొప్ప పద్యం రాశాడో చూడండి:

నిర్నిద్ర విషయుక్త నిశిత దంష్ట్రలు బూని
 భేదించు నెటువంటి గాదెలైన
దారుణోద్య ద్దంత తతిచేత ఖండించు
 గుఋతుగా నెటువంటి కోకలైన
పటు సురంగా గార భరితంబుగాఁ ద్రవ్వు
 పొంకాన నెటువంటి భూమినైన
కీచు కీచు ధ్వని ప్రాచుర్య మహిమచే
 వర్ణించు నెటువంటి వారినైన
అతడు సామాన్యుడే నరేంద్రాల యాంత
రంత నారేక పేటిక క్రాంత వస్తు
హరణ సురధాటి యవ్వినాయకుని రాణి
చారుతర మూర్తి మూషక చక్రవర్తి!!

వాడిగా, దారుణంగా వుండే పళ్లతో వడ్లగాదెలు, బట్టలు, భూమి- ఎటువంటి దాన్నైనా కొట్టి, కొరికి, గుల్లచేసేసి కీచు కీచుమనే ఎలుక అందమైన మూషక చక్రవర్తిట! మూషకమంటే ఎలుక. మూషక వాహనుడైన ఆ వినాయకుడు ఈ పద్యం వింటే యెంత సంతోషపడతాడో!

డా. ఉండేల మాలకొండారెడ్డిగారు తమ 'ఒడిసెలరాళ్లు' కవితా సంపుటిలో "ఎలుకలు వచ్చేశాయ్" అనే మహాద్భుతమైన సుదీర్ఘ కవిత రాశారు. అలాగే 'కాంతి చక్రాలు' కవితా సంపుటిలో కోడి మీద, కొంగ మీద కవితలు రాశారు. రెడ్డిగారు. కోడిని గూర్చి రాసిన పద్యాల్లో ఈ పద్యం చూడండి:

నిన్ను 'పలావు' చేసి, రమణీయముగా భుజియించి, తేన్పు భీ
మన్నలు, నిద్రపోవు గురవన్నలు మేల్కొని లేశయేని నీ
సున్నితమైన ప్రేముడియు శూరతయున్ ఋతు బద్ధ రాగ భో
గోన్నతియున్ గ్రహించునెడ, ఉర్వీ సుభిక్షముగా వెలుంగదే?

ఇలాగే 'గ్రుడ్డి కొంగ' శీర్షికతో రాసిన పద్యాల్లో ఈ పద్యమెంత సత్య స్ఫూర్తి తో వుందో చూడండి.

అరరె! కన్ను మూసి తెరచు లోపల గండు
మీను నొకటి బట్టి మ్రింగినావు
ఏ మెరుంగనటు నటింతువు, నిను 'గ్రుడ్డి
కొంగ' యన్న వారు గ్రుడ్డి వారు!!

అంటూ ఆ కొంగకు- "కలరు నిన్ను మించు ఘనులు మా సంఘాన, వారి తోడ పోటి పడకు మెపుడు" అని సలహా కూడా యిచ్చారు. పశువులు మేసే గడ్డిని గూర్చి కవిత రాస్తూ-

"కుతుకలు కోయగలవే కాని మా
బతుకులు కోయగలవా?
తరిగే కొలది మాదికి
 పెరిగే లక్షణం మాది
 కోసే వానికి ధాన్యపు
 రాశులిచ్చే వితరణ మాది"

అంటూ గడ్డితో మనిషికి బుద్ధి చెప్పిస్తారు. ఇలా చెప్పుకుంటూపోతే అదో సిద్ధాంత గ్రంథమే అవుతుంది. శ్రీశ్రీకి, ధనంజయుడికి ముందే కవిలోకంలో ఎన్నో ఆలోచనలు, నిబద్ధతలు ఉన్నాయి. కళ్లకు కనిపించే యీ సంఘాన్నే కాదు, ఈ ప్రపంచాన్నే ఏ కవీ విస్మరించలేదు, కాకపోతే, అవసరమెంతో అంతే వాడుకున్నాడు. అంత మాత్రానికే అజ్ఞానంతో హద్దులు గీయటానికి వీల్లేదు. మహాత్మాగాంధీ చిన్న గుండుసూదిని కూడా విడిచిపెట్టేవాడు కాదు. అందుకే పరతంత్రాన్ని పారద్రోలి, స్వాతంత్ర్యాన్ని సాధించగలిగాడు. చిన్నవాటి మీద పెద్దచూపు యొక్క ఫలితాలు అలాగే మధురంగా ఉంటాయి. ■

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం: 040-27402993

## చూడరమ్మ సతులాలా

ప: చూడరమ్మ సతులాల సోబాన పాడరమ్మ
కూడున్నది సతి చూడి కుడుత నాంచారి
సోబానే సోబానే

చ1: శ్రీమహాలక్ష్మియట సింగారాలకే మరుదు
కాముని తల్లియట చక్కదనాలకే మరుదు
సోముని తోబుట్టువట సొంపు కళలకే మరుదు
కోమలాంగి యీ చూడి కుడుత నాంచారి ॥చూడ॥

చ2: కలశాబ్ది కూతురట గంభీరాలకే మరుదు
తలప లోకమాతయట దయమరి ఏమరుదు
జలజ నివాసినియట చల్లదనమే మరుదు
కొలది మీర యీ చూడి కుడుత నాంచారి ॥చూడ॥

చ3: అమరవందితయట అట్టే మహిమ ఏమరుదు
అమృతము చుట్టమట ఆనందాల కేమరుదు
తమితో శ్రీవేంకటేశు తానె వచ్చి పెండ్లాడె
కొమెర వయస్సు యీ చూడి కుడుత నాంచారి ॥చూడ॥



అన్నమాచార్య సంకీర్తన
గానం, సంగీతం: గరిమెళ్ళబాలకృష్ణప్రసాద్
రాగం : మధ్యమావతి
-మద్మాత్ సారంగ్
(హిందుస్తాని సం॥)
ఆరోహణ : స రి మ ప ని స
అవరోహణ : స ని ప మ రి స
తాళం : త్రిశ్రగతి (కర్ణాటక సం॥)
- దాద్రా (హిందుస్తాని సం॥)

షడ్జము, చతుశృతి రిషభం, శుద్ధమధ్యమం, పంచమం, కైశికినిషాదం యీ రాగంలోని స్వరాలు.

మధ్యమావతి కర్ణాటక సంగీతంలో ఎంతో ప్రాచుర్యాన్ని పొందిన రాగం. ఈ రాగంలోని వర్ణాలు, "అలకలల్లలాడగగని" మొదలగు కీర్తనలు, మంగళహారతులు ఎన్నోవున్నాయి. మధ్యమావతి, సురటి. ఆరభి, శ్రీ మొదలైనవి మంగళప్రదమైనవిగా పరిగణించబడే రాగాలు. అందుకే వివిధ దేవతలపై ఆ రాగాలలో ఎన్నో రచనలు మంగళహారతులుగా వెలువడినాయి. కర్ణాటక సంగీత కచేరీలలో కూడా చివరి అంశంగా మధ్యమావతి రాగం ఆలపించడము, లేక ఆ రాగంలో మంగళం పాడటము సంప్రదాయం.

పద కవితా పితామహుడు, సంకీర్తనచార్యుడుగా పేరొందిన తాళ్ళపాక అన్నమాచార్యుడు కలియుగ వైకుంఠంగా భావించబడే తిరుమల కొండపై వేంచేసి వున్న శ్రీ వేంకటేశ్వరునిపై 32వేల సంకీర్తనలు రచించిన మహనీయుడు. ప్రాఢమైన పదజాలంతోను, లలితమైన సరళమైన భాషలోను జానపదశైలిలోను, మాండలిక శబ్దాలతోను ఎంతో వైవిధ్యంగల యితివృత్తాలతో శ్రీనివాసుని పరంగా రూపొందిన దివ్య సంకీర్తనలు ఆయనవి. శాస్త్రీయ సంగీతపు రాగస్వరూపాలకు, లలితసంగీత రీతులకు, జానపద శైలికి అనువైనవిగా ఆయన రచనలను వర్గీకరించవచ్చు. ఇంతటి వైవిధ్యం చూపిన వాగ్గేయకారుడింకెవరూ మనకు కానరారు.

వైకుంఠపురిలో శేషశయనుడై లోకాలను రక్షించే శ్రీమహావిష్ణువు పంచాయుధాలలో ఒకటైన నందక నామక ఖడ్గమే అన్నమయ్యగా అవతరించినట్లు ఐతిహ్యమున్నది. ఆయన అలవోకగా అంత్యానుప్రాసలతో వేలాది సంకీర్తనలను రచించి భక్తకోటిపై





భగవదనుగ్రహ వర్షాన్ని కురిపించాడు. అందులో ఒక సుధాబిందువు "చూడరమ్మ సతులాలా" అనే సంకీర్తన. సీతగా, రుక్మిణిగా, అలమేలుమంగగా, గోదాదేవిగా స్వామితోబాటు తాను కూడా అవతరించుచున్న అమ్మ ఆదిలక్ష్మి చేతి పాయసాన్ని మెసగిన ధన్యుడు అన్నమయ్య.

చూడి కుడుత నాంచారి అనగా తాను ధరించిన మాలలను స్వామికర్పించిన తల్లి అని, ఆమె ఎవరోకాదు సాక్షాత్తు మహాలక్ష్మియే అని తానెరిగిన రహస్యాన్ని భక్తుల కందించాడు యీ కీర్తనలో. చక్కని తెలుగు నుడికారంతో సాగిన మహాలక్ష్మి గుణ కీర్తన అయిన యీ పదానికి సరళమైనదీ అందరూ తేలికగా పాడుకునే వీలు కలిగినది అగు చక్కని బాణీని మధ్యమావతి రాగంలో కూర్చి మృదుమధురంగా గానం చేశారు శ్రీ బాలకృష్ణప్రసాద్.

## గరిమెళ్ళ బాలకృష్ణ ప్రసాద్

కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వరుని వే తీరుల కీర్తించి తరించిన తొలి తెలుగు వాగ్గేయకారుడు అన్నమయ్య కాగా, ఆ సంకీర్తనల గానంతో తన జీవితాన్ని సార్థకం గావించుకుంటున్న సుమధుర గాయకుడు శ్రీ గరిమెళ్ళ బాలకృష్ణ ప్రసాద్. తల్లిదండ్రులు కీ॥శే॥ శ్రీమతి కృష్ణవేణి, కీ॥శే॥ నరసింహారావు గార్ల వద్ద బాల్యంలోనే సంగీత విద్య నభ్యసించారు. వీరి కుటుంబంలో అందరూ సంగీత కళాకారులే. ఈయన సోదరి శ్రీమతి విజయబాల ఆకాశవాణిలో మంచి గాయనిగా పేరుపొందినది. శ్రీబాలకృష్ణ, వీరి తల్లిగారు, విజయబాల, ఆమె కుటుంబ సభ్యులు మున్నగు వారందరితో నాకు అత్యంత సాన్నిహిత్యము వున్నది. క్రితం సంవత్సరమే (2002లో) తల్లి పరమపదించారు. 1970 దశకంలో ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో క్యాజువల్ ఆర్టిస్టుగా అనేక కార్యక్రమాలలో పాల్గొంటూండేవారు. ఆ రోజులలోనే ఆయన ఎన్నో లలిత గీతాలు రచించి "కృష్ణరవళి" గ్రంథంగా ప్రచురించగా నేను పీఠిక వ్రాయడం జరిగింది. ఆ

తరువాత కొంత కాలానికి మరికొన్ని లలిత గీతాలతో "కృష్ణ రవళి" రెండవ భాగం వెలువడింది. ఆయన రచించిన లలిత గీతాలను పి.వి. సాయిబాబా, నేను, యింకా యితర

స్వరకర్తలు కూడా స్వరపరచడం జరిగింది. 1976-77 ప్రాంతంలో సంగీత కళానిధి శ్రీ నేదునూరి కృష్ణమూర్తి గారు హైదరాబాద్ ఆకాశవాణిలో 'భక్తిరంజని' కార్యక్రమానికై అన్నమయ్య కీర్తనలను ఆయన స్వరరచనతో పాడించి రికార్డు చేశారు. బాలకృష్ణప్రసాద్, నేను, లలిత, హరిప్రియ మొ॥వారం పాడాము. ఆ తరువాత బాలకృష్ణ తిరుపతికి వెళ్ళి నేదునూరివారి వద్ద శిష్యరికం చేయడము, తిరుమల తిరుపతి దేవస్థానం వారి అన్నమాచార్య ప్రాజెక్టులో కళాకారుడుగా స్థిరపడడం జరిగింది. అప్పటినుండి ఎంతోమంది మహావిద్వాంసులు స్వరపరచిన అనేక అన్నమయ్య సంకీర్తనలను పాడడమే కాక, స్వయంగా సుమారు 300 కీర్తనలకు స్వరరచన గావించారు శ్రీ ప్రసాద్. ఎంతో మంది యితర కళాకారుల చేత కూడా పాడించారు. శ్రీ డి.పశుపతి, శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గార్ల వద్ద కూడా కొన్ని అన్నమయ్య సంకీర్తనలను, శాస్త్రీయ సంగీతాన్ని కూడా అభ్యసించారు. కర్ణాటక సంగీతంలో డిప్లొమా చేసిన ప్రసాద్ తి.తి. దేవస్థానం వారి ద్వారా అన్నమయ్య సంకీర్తనలను నోటేషన్‌తో పుస్తకాలుగా ప్రచురింపజేశారు.



ఆయన గాయకుడు, స్వరకర్తమాత్రమే కాక సుమారు 300 కృతులు, వర్ణాలు, తిల్లానాలు రచించిన వాగ్గేయకారుడు కూడా. శ్రీ ఆంజనేయ, శ్రీ గణపతి, నవగ్రహాలను తన వాగ్గేయ కుసుమాలతో పూజించారు.

వందలాది అన్నమయ్య సంకీర్తనా కార్యక్రమాలతో దేశ విదేశాలలోని ప్రజలను మంత్రముగ్ధులను గావించారు. ఆయనను ఎన్నో బిరుదులు, సత్కారాలు వరించాయి. 1977లో అమెరికాలో SAPNA, SVASA పేర్లతో ఏర్పడిన శ్రీ అన్నమాచార్య సంస్థలు ఆ దేశంలో కార్యక్రమాలు ఏర్పాటుచేసి శ్రీ ప్రసాద్‌ను 'అన్నమాచార్య విద్వన్మణి', 'అన్నమయ్య నాదజ్యోతి' బిరుదులతో ఘనంగా సత్కరించాయి.

విశాఖలో 'మాస్టర్ ఎం.ఎస్. అవార్డు', ఢిల్లీ తెలుగు అకాడమీ వారి ఉగాది పురస్కారంతో బాటు 'Enchanting Singer' బిరుదు, తి.తి. దేవస్థానం వారు నిర్వహించిన 'అన్నమయ్య సంకీర్తన యజ్ఞం' పదిరోజులపాటు తిరుపతిలో జరుగగా శ్రీ ప్రసాద్ 108 రాగాలలో 300 సంకీర్తనలు గానం చేయగా 'అన్నమయ్య సంకీర్తన మహతి' బిరుదుతోను, శ్రీవేంకటేశ్వర స్వామి బంగారు డాలర్‌తోను సత్కరించారు. ఆయనవి సుమారు 100 ఆడియో క్యాసెట్లు, ఎల్.పి.లు, సీడిలు వెలుడినాయి. శ్రీమతి ఎస్.జానకి, డా॥ బాలమురళీకృష్ణ, రాధ-జయలక్ష్మి వాణి జయరాం మొ॥ వారు ఆయన స్వరరచనలు గానం చేశారు.

శ్రీ ప్రసాద్ సహధర్మచారిణి శ్రీమతి రాధ, కుమారుడు అనిల్‌కుమార్ కూడా ఆయన వద్ద శిక్షణ పొంది సంకీర్తనలు గానం చేస్తున్నారు. శ్రీమతి ఎన్.సి.శ్రీదేవి, జి.మధుసూదనరావు, రఘునాథ్ మున్నగువారు ఆయన శిక్షణపొందిన వారిలో ప్రముఖులు. నిరంతర స్వరార్చనలో తిరుమలేశుని సేవించే యీ 'అన్నమయ్య నాద జ్యోతి', 'అన్నమయ్య విద్వన్మణి', 'అన్నమయ్య సంకీర్తన మహతి' ధన్యుడు.

**మధ్యమావతి రాగం ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు 'హాసం' 16-31 డిసెంబర్ 2001 సంచికలో పేర్కొనడం జరిగింది.**

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

## 1957

**ఆర్.కె.** ఫిలింస్ సంస్థలో శంకర్ - జైకిషన్ లకు ఎరేంజర్‌గా పనిచేసిన 'దత్తారాం' ఆర్.కే.వారి 'అబ్ ఢిల్లీదూర్ నహీఁ' చిత్రం ద్వారా సంగీత దర్శకుడిగా పరిచయమయ్యారు. ఆ చిత్రంలో రఫీ పాడిన 'చున్ చున్ కర్తీ ఆయీ చిడియా' పాట మంచి హిట్ అయింది.

'కట్‌పుత్లీ', 'బేగునాహ్' చిత్రాల ద్వారా శంకర్ - జైకిషన్‌లు తమ హవా కొనసాగించారు.

కట్‌పుత్లీలో శైలేంద్ర రాసిన కట్‌పుత్లి టైటిల్ సాంగ్, 'మంజిల్ వహీ హై ప్యార్ కీ' (సుబీర్ సేన్ పాడారు), లతా పాడిన 'బకడ్ భమ్ భమ్ భమ్ భమ్ భజే గుంబాగు' పాటలు హిట్ అయ్యాయి.



'కట్‌పుత్లీ' లో ఓ సన్నివేశం

కిశోర్ కుమార్ నటించిన 'బేగునాహ్' చిత్రం కోసం శంకర్ - జైకిషన్‌లు కిషోర్‌కు ప్లేబాక్ సింగర్‌గా మన్నాదేను పరిచయం చేసారు. 'దిన్ అల్‌బేలా ప్యార్‌కా మౌసమ్' అంటూ సాగే గీతాన్ని మన్నాదే ఈ చిత్రంలో పాడారు.



'బేగునాహ్' చిత్రంలో కిశోర్, షకీలా

ఎస్.డి.బర్మన్ హిట్ పరంపరకు అడ్డే లేకపోయింది. విజయ్ ఆనంద్ చిత్రం 'నౌదోగ్యారా' గురుదత్ చిత్రం 'ప్యాసా', దేవ్ ఆనంద్, నూతన్‌ల 'పేయింగ్‌గెస్ట్' - ఇవన్నీ హిట్సే!

'నౌ దో గ్యారా'లోని 'హమ్ హై రాహీ ప్యార్‌కే', 'ఆంఖోఁ మేఁ క్యా జీ', 'ఆజా పంఛీ అకేలా హై', హిట్ అయితే 'ప్యాసా' చిత్రంలోని అన్నిపాటలూ సాహిత్యపరంగా, సంగీతపరంగా కలకాలం నిలిచిపోయేవే! 'యే దునియా అగర్ మిల్ భి జాయేతో క్యాహై', 'జానే వో కైసీ లోగ్ హై జిన్‌కో' 'సర్ తేరా చకరాయే', 'కహా హై, కహా హై' 'హమ్ ఆప్‌కీ ఆంఖోఁ మైఁ'- వీటిలో వేటిని కాదనగలం!? ఇక 'పేయింగ్ గెస్ట్' దగ్గరికి వస్తే 'మానా జావాబ్ నే పుకారా నహీఁ', 'ఛోడ్ దో ఆంచల్', 'చాంద్ ఫిర్ నికలా', 'ఓ నిగాహ్- ఎ -మస్తాన్' ఈ చిత్రంలోని కొన్ని హిట్ గీతాలు.

'నయాదౌర్', చిత్రంతో ఓ.పి.నయ్యర్ అవార్డులతోపాటు ప్రశంసలూ సాధించారు. 'నయాదౌర్' చిత్రంలోని 'మాంగ్ కే తుమ్హారా', 'మైఁ బంబై కా బాబు', 'ఉడే జబ్ జబ్ జుల్ఫే తేరీ', 'సాథీ హాత్ బఢానా', 'రేష్మీ సల్వార్ కుర్తా జాలీకా', పాటలు సూపర్‌హిట్ కావటమే కాదు ప్రజల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోయాయి. నయ్యర్ ఫేవరేట్ గీతం 'ఆనా హై తో' గీతాన్ని ఎవరు మర్చిపోగలరు?



'ప్యాసా'లో ఓ సన్నివేశం

-(వచ్చే సంచికలో మరికొంత)



# అంతేరా... బావమరిది



ఆదివిష్ణు



## జరిగిన కథ



భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ ప్రియుడు వేణుకి నాగపూర్లో ఉద్యోగం వచ్చినా ఉమకోసం హైదరాబాదులోనే ఉద్యోగం కై చూస్తూంటాడు. అతని బావ రంగనాథం తన బాల్యమిత్రుడు బసవరాజును స్వయంగా కలిసి అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్స్‌ను కలవకూడదని నిశ్చయించుకుంటాడు. అందుకే అతన్ని కలవడానికి వచ్చిన రంగనాథాన్ని చూడ నిరాకరిస్తాడు. కానీ తరువాత బాధపడతాడు. ఆ సంగతి తెలియని రంగనాథం బసవరాజుపై మండిపడుతూంటాడు. బావగారి పేరు చెప్పకుండా ఉద్యోగానికై వేణు డైరక్టుగా వెళతాడు. బసవరాజు అతన్ని చూసి ఇంప్రెస్ అయి ఉద్యోగం ఇస్తాడు. ఆ ఉద్యోగానికి ఒప్పుకున్నందుకు ఉగ్రుడైన రంగనాథం వేణుని ఇంట్లోంచి పొమ్మంటాడు. (ఇక చదవండి)

బిర్లా మందిరం!

స్వామి వారిని వేణు ఉమలు దర్శించుకున్నారు!

తీర్థప్రసాదాలు పుచ్చుకుని మెల్లగా ఆలయం వెలుపలకు వచ్చేరు.

ఒకచోట కూచున్నారు!

కొన్ని నిమిషాలపాటు వాళ్లిద్దరూ మవునంగానే వుండిపోయేరు!

ఇక ఓర్చుకునే ఓపికలేక కొంచెం కోపంగానే అనేసింది -

"తండ్రిలాటి బావగార్ని నొప్పించి - ఆ ఇల్లు విడిచిపెట్టి రావడం హీరోయిజం అనిపించుకోదు!"

"నిజమేనేమో! కానీ - ఆ ఇంటో వుంటే నేను హీరోని కాలేను ఉమా!"

"అందుకని - దేవుడిలాటి మీ బావగార్ని విడిచిపెట్టి రావడం ధర్మమా?"

"బావ నాకు ఎల్లప్పుడూ దేవుడే! ఆ దేవుడ్ని కాదనే దమ్మూ ధైర్యం నాకు లేవు!"

"మాటలకేమిలే! బాగానే చెబ్తావ్? అంత విశ్వాసం, అంత భక్తీ మాటల్లోనే కాదు - చేష్టల్లో కూడా కనిపించాలి! నిజంగా ఆయన్నీకు దేవుడే అయితే - ఆ ఇల్లు విడిచిపెట్టేవాడివి కావు!"




"మన పెళ్లి త్వరగా జరగాలనుకుంటే - ఇష్టం లేకపోయినా - కొన్నాళ్ల పాటు నేను బావకి దూరంగా వుండాల్సిందే!"

"అంటే?"

"నీతో నాపెళ్లి - మా బావ చేయలేడు!"

"విడ్డూరంగా మాటాడకు!"

"నేను నిజమే చెబుతున్నాను ఉమా! మీ నాన్న పేరు వింటేనే చాలు మా బావ నిప్పులు కక్కుతున్నాడు! ఇల్లాంటి పరిస్థితుల్లో - బసవరాజు గారి అమ్మాయితో నా పెళ్లి జరిపించు బావా అని అడిగితే - నా మెళ్లో చెప్పుల దండేసి ఊరంతా తిప్పుతాడు! అంచేత - బావ ప్రమేయం లేకుండా - నాపెళ్లి నేనే చేసుకోవాలనుకుంటున్నాను! అందుకే ఆ ఇంటోంచి బయటకు వచ్చేను!"

"కట్టుకథలు చెప్పి నీ చర్యని సమర్థించుకుంటున్నావా వేణూ?"

"వెంకన్న సాక్షిగా నిజమే చెబుతున్నాను ఉమా!"

"మీ బావగారి విషయం అట్లా వుంచు! మీ బావగారి మీదున్న కోపంతో - మన పెళ్లికి మానాన్న అంగీకరిస్తాడనే గ్యారంటీ ఏమిటి?"

"అదీ పాయింటు! నేను ఫలానా అని తెలిసి కూడా నాకు ఉద్యోగం యిచ్చేరు! ఉద్యోగమిచ్చినవారు పిల్లనివ్వరా? ఎందుకైనా మంచిదని మా బావకి దూరమై మీనాన్న గారికి మరింత దగ్గరయ్యేందుకు ప్రయత్నం చేస్తున్నాను! అవునూ - మీ నాన్న గారి హాబీలేమిటి?"

"ఉడ్‌హవుస్‌ని చదవడమొక్కటే అనుకున్నాను! ఆయన చెప్పిన థియరీలు వంటబట్టించుకున్నట్టున్నావ్!"

"ఏం చేయమంటావ్? ఈ పరిస్థితుల్లో ఉడ్‌హవుసే నాకు దిక్కు!"

"మా నాన్నకి మార్నింగ్ వాకంటే చాలా యిష్టం!"

"థేంక్యూ" అన్నాడు వేణు.

ఈ చిన్న సమాచారానికి థేంక్స్ ఎందుకు చెప్పేడో ఉమకి అప్పుడు అర్థం కాలేదు!

అందుచేత అతని వేపు విడ్డూరంగా చూసింది!

* * *

హైదరాబాదు నిండా కేవలం అపార్టుమెంటులే వున్నాయని చెప్పడం సరికాదు!

కొన్ని చోట్ల అందమైన మైదానాలు కూడా వున్నాయి!

ఈ మైదానాలు మార్నింగ్ వాక్‌కి బాగా ఉపకరిస్తాయి!

ఆ ఉదయం -

ఒకానొక మైదానంలో -

బసవరాజు జాగింగ్ చేస్తున్నాడు! ఆ కార్యక్రమంలో అతను బిజీగా వుండగా - దూరంగా వేణు రేసుగుర్రంలాగా పరిగెత్తుతూ కనిపించేడు! తాను చేస్తున్న జాగింగ్‌కి చుక్కపెట్టి వేణుని కన్నార్పకుండా చూస్తున్నాడు బసవరాజు!

వేణు ఇప్పుడు పరుగు ఆపి బస్కీలు తీస్తున్నాడు!

అతన్ని చూస్తూ ముచ్చటపడుతున్నాడు బసవరాజు!

వేణు బస్కీలు పూర్తి చేసి మళ్లా రేసుగుర్రంలాగా పరుగెత్తుకుంటో మాయమైపోయేడు!

బసవరాజు గొణుక్కుంటున్నాడు -

"స్మార్ట్ బోయ్! చాకులాటి కుర్రాడు! దేశానికి, నా కంపెనీకి ఇల్లాంటి కుర్రాళ్లే కావాలి!"

* * *

బసవరాజు గారి బంగళా ముందు వేణు స్కూటరు ఆపేడు. అతనిప్పుడు చక్కగా ముస్తాబై వున్నాడు! ఎంతో ఠీవిగా వున్నాడు!

స్కూటరు దిగి ఆ యింటి గడపతొక్కేడు!

కాలింగ్ బెల్లు నొక్కేడు!

స్వయం బసవరాజే తలుపు తీసేడు -

"గుడ్ మార్నింగ్ సర్!" అన్నాడు వేణు వినయంగా!

"కమిన్!" అన్నాడు బసవరాజు.

- ఇద్దరూ హాల్లో కూచున్నారు. బసవరాజు అడిగేడు -

"అవును మిస్టర్ వేణూ! నువ్వు మంచి రన్నర్! కదూ?"



"అరే! భలే కనిపెట్టేసేరే?" ఆశ్చర్యం నటిస్తూ అన్నాడు వేణు!

బసవరాజు కొంచెం గర్వంగా అన్నాడు -

"అంతే! నేనంతె! నీకు తెలీకుండా నీ గురించి అన్నీ కనిపెట్టేస్తుంటాను!"

"అది జీనియస్సుల లక్షణం సార్!"

ఆ మాటకి బసవరాజు మురిసిపోయేడు! అందువల్ల కాళ్లు ఊపుకుంటో అడిగేడు-

"ఊ! ఏవంటున్నాడు మీ బావ?"

"ఏమడుగుతార్లేండి!" అన్నాడు వేణు!

"నీ ఉద్యోగం దొరికింది గదా! హేపీగా వున్నాడా?"

"లేదండి! చాలా వర్రీడ్‌గా వున్నాడు!"

ఆ మాట వినగానే బసవరాజు బిక్కమొగం పెట్టేడు.

"లక్షణమైన ఉద్యోగం దొరికినందుకు సంతోషించాలి గాని ఏడుస్తూ కూచోడమేమిటి చిత్రంగానూ?" అంటూ నసిగేడు బసవరాజు.

"మా బావ సంగతి మీకు తెలీందేముంది? మీ దగ్గిర ఉద్యోగం చేయడం బావకి సుతరామూ యిష్టం లేదు!"




"అందుకే కాబోలు! నాకు ఫోన్ కూడా చేయలేదు. కనీసం థేంక్సని ఫోను పెట్టేసినా సంతోషించేవాడిని! వదిలెయ్! మీ బావని మరిచిపో!"

"అక్షరాలా ఈ మాటే ఆయన కూడా అన్నాడండి!" అన్నాడు విచారం నటిస్తూ!

"అంటాడంటాడు! తిక్క సన్నాసి!" విసుక్కున్నాడు బసవరాజు.

"అంతేకాదండి! నన్ను ఇంటోంచి -"

మాట పూర్తి చేయకుండా - 'తరిమిమేసేడని' చేత్తో సంజ్ఞ చేసేడు!

"దుర్మార్గుడు! ఇన్నేళ్లూ పెంచి పెద్ద చేసి - నా దగ్గిర ఉద్యోగం చేస్తున్నావనే ఆఫ్టరాల్ రీజన్‌కి - ఇంటోంచి వెళ్లిపొమ్మంటాడా? ఇప్పుడెక్కడుంటున్నావ్?"

'ఈ వీధిలోనే - ఒక పాత పెంకుటింటో -"

"పెంకుటిల్లా?" బాధపడుతూ అడిగేడు!

"చాలా పాతదండి! అందులో ఒక చిన్న గదిలో -"

"ఒక గదిలోనా?"

"చాలా చిన్న గదండి!"

చెప్పవలసిన దీనగాథ చాలా వుంది గనక - దానికి తగ్గట్టుగా తలవంచుకున్నాడు. మధ్యమధ్య గాలి బరువుగా పీల్చుకుంటో అంటున్నాడు -

"పాత పెంకుటింటో చాలా చిన్న గదైనా ఫర్లేదులేండి! నా ఒక్కడికి ఆ గది చాలు!

కాకపోతే పగటిపూట కూడా ఆ గది చీకటిగా వుంటుంది! అయినా సర్దుకోవచ్చునుకోండి!

ఎటాచ్డ్ గాలి రాదు! ఫేను పెట్టుకోవచ్చునుకోండి! పగటిపూట కరెంటు వాడకూడదని రూలు పెట్టేరు! పగలంతా ఆఫీసులో వుంటాను గనక నో వర్రీ అనుకోండి! కాకపోతే స్నానానికి చాలా ఇబ్బందిపడాలి! ఆ యింటో పంపుల్లేవు. నుయ్యీ లేదు. నాలుగిళ్లవతల దిగుడుబావి వుందిలెండి! రోజూ అక్కడికి వెళ్లి నీళ్లు తోడుకుని స్నానం గట్రాలు చేసుకునే ఏర్పాటు చేసేరు-"

ఇంత చెప్పింతర్వాత తలెత్తి చూసేడు!

ఆశ్చర్యం! అతని చుట్టుతా ఇంటిల్లిపాదీ వున్నారు!

అందర్నీ ఒకేసారి చూడటంతో ఉలికిపడి లేచి నించున్నాడు వేణు!

బసవరాజు తనవాళ్లతో అంటున్నాడు సీరియస్‌గా -

"విన్నారా? ఆ సింగినాదం గాడి కిరాతకం ఏ స్థాయిలో పెరిగిపోయిందో తెలుసుకున్నారా? ఈ కుర్రాడికి - ఆ దేభ్యంగాడి మొహం చూచి ఉద్యోగం ఇవ్వలేదు! ఇతని క్వాలిఫికేషన్లూ, ఇతని సర్టిఫికెట్లు చూచి ముచ్చటపడి ఉద్యోగం యిచ్చేను! ఇతను ఫలానా అని తెలీకుండానే - ఇంటర్వ్యూ చేసి - ఉద్యోగం యిచ్చేను! అంచేత ఇతను సింగినాదం గాడి బ్రదరిన్లా కానేకాదు! బసవరాజు ఇండస్ట్రీస్‌కి సెక్రటరీ! మన సెక్రటరీ కూడా మన హోదాకి తగ్గట్టుండాలి! అంతేగాని - పాత పెంకుటింటో చిన్న గది - గాలి రాదు - వెలుతురు లేదు - నో వాటర్ సప్లై - కరెంటు వాడకమ్మీద ఆంక్షలు - షేమ్! క్వైట్ షేమ్! ఎవరికి? ఎవరికిషేమ్! మనకి! మన కంపెనీకి! ఇది నేను భరించలేను! నా వల్ల కాదు! చెప్పండి! ఏం చేద్దాం ఇతన్ని?"

"ఏదైనా బంగళా చూడండి! మీ ఫ్రెండు బామ్మర్దే గదా! మన మనిషే!" అన్నది జానకి!

వేణు ఆ తల్లికి చేతులు జోడించిఅన్నాడు -

"బ్రహ్మచారిని! బంగళా పెద్దదవుతుంది మేడమ్!"

"అయినా సరే! మీ బావగారు మా నాన్నకి ప్రాణమిత్రుడు!" అన్నాడు డాక్టర్ మురళి!

"ఇప్పుడేమో గాని - మీ బావ నాకు ప్రాణంలాటి మిత్రుడు! నాకు తోడు! నాకు నీడ! నాకు గైడు! ఒక్కటేమిటి? నాకు అన్నీ వాడే! కాకపోతే తిక్క సన్నాసి! ఆ సన్నాసికి నువ్వు బామ్మర్దివి! దటీమీన్స్ - నాక్కూడా నువ్వు బామ్మర్దిలాటి వాడివే!" అన్నాడు బసవరాజు!

"అలాంటప్పుడు ఎక్కడో ఎందుకు? మనింటోనే మనందర్తోపాటే వుంటాడు!" అన్నది పద్మ!



"మేడమ్!"అన్నాడు వేణు ఆశ్చర్యంగా.

"అంతే! కోడలు చెప్పిందే కరెక్టు!"

"సార్?"

"ఇంకేం చెప్పకు! ఆ తిక్కరాస్కెల్‌కి బుద్ధి రావాలంటే - నువ్వు మా అందర్తోపాటు మా ఇంటోనే వుండాలి! వుంటావ్! దట్సాల్!"

వేణు కళ్లు తుడుచుకునే వంకమీద ఉమ వేపు అలవోకగా చూసేడు! ఉమ గట్టిగానే అనేసింది - 'ఉడ్‌హవుస్' అని!

ఆ పేరు ఎందుకు ప్రయోగించిందో ఆ కుటుంబ సభ్యులెవ్వరికీ అర్థం కాలేదు!

దాన్నొక విచిత్రమైన శబ్దంగా ఎంచుకున్నారు! అంతే!

* * *

రంగనాధమింటో -

రంగనాధం చేతిలో కాఫీ కప్పు పెట్టి - తమ్ముడ్ని దూరం చేసుకున్న బాధని బయటపెడుతోంది అన్నపూర్ణమ్మ -

"వాడిని నానా మాటలూ అని - ఇంటోంచి తరిమికొట్టి - ఇప్పుడు చింతిస్తే ఏం ప్రయోజనం?"

ఏం ప్రయోజనమో చెప్పకుండా - రంగనాధం తన చేతిలో వున్న కాఫీ కప్పుని విసిరికొట్టేడు!




కోపమ్మీద అంటున్నా ఆత్మీయంగానే అంటున్నాడు -

"అవునే! చింతిస్తున్నాను! వాడిని - ఇంత - ఇంతప్పట్నుంచీ కన్న బిడ్డలాగా పెంచుకున్నాను గదా! అందుకు - అందుకు చింతిస్తున్నాను! కన్నప్రేమ కంటె పెంచిన ప్రేమకి పవరెక్కువ గదా! అందుకు - అందు కేడుస్తున్నాను! తండ్రిలాటివాడినే! ఒక మాటంటే తప్పా? కోపమొచ్చినప్పుడు ఏ తండ్రయినా ఏం చేస్తాడు? అరుస్తాడు. గెటవటంటాడు. అన్నాడు గదాని - రోషం తెచ్చేసుకుని గెటవుటేనా? గెటవుటైతే ఫర్లేదు! గురిచూసి కొట్టినట్టు ఆ బసివిగాడింటో చేరతాడా? ఎవడ్తో గొడవ పడ్డానో - సాక్షాత్తు వాడింటికే దేహి అని అడుక్కుంటూ వెడతాడా? వెళ్లనివ్వు! అయ్ డోంటోకేర్! ఆ బసివిగాడికీ వీడికీ ఎప్పుడో ఒకప్పుడు చెడిపోతుంది! తప్పకుండా చెడిపోతుంది! అప్పుడు బావా అంటూ నన్ను వెతుక్కుంటో వచ్చి నా కాళ్లమీద పడి భొల్లున ఏడుస్తాడు. ఆ!"

తమ్ముడి భవిష్యత్తు గురించి కడుదరిద్రంగా చెబుతున్న భర్త మాటలు వినలేక అసహనంగా అన్నది అన్నపూర్ణ -

"శాపం పెట్టకండి! అసలే మీ నోరు మంచిది కూడా కాదు!"

తన నోటికి వంక పెట్టినందుకు రంగనాధానికి బోలెడు కోపం వచ్చింది. అంచేత కుర్చీని గట్టిగా తన్నేడు. ఆ తర్వాత అన్నాడు -

"చంపుతా! అంటే - వాడేదో అయిపోవాలని దీవించే నను కుంటున్నావా? అసలు - అసల్నేను అల్లాంటి మనిషినా? నన్ను కాదని ఆ బసివిగాడితో చేతులు కలిపేడనే బాధతో.... బక్కకోపంతో... కడుపు మంటతో అన్నానే గాని - వాణ్ని శపించేంత దుర్మార్గుడినా నేను? వాడు ఎక్కడున్నా సుఖంగానే వుండాలి! సుఖంగానే వుంటాడు! ఆ!"

అని తన గదిలోకి వెళ్లిపోయి తలుపులు మూసుకున్నాడు! ఆ చర్యకి అన్నపూర్ణమ్మ నిట్టూర్చింది!

- బసవరాజింటో... ఉమతో వేణు అంటున్నాడు

"మా బావని ఎవరైనా దూషిస్తే - నాకు కోపం వస్తుంది!"

"ఆయన్ని దూషించే స్థితిలో పెట్టింది నువ్వే!"

"మా బావ సంగతి మీకెవ్వరికీ తెలీదు ఉమా! కోపమొచ్చినప్పుడు పెనమ్మీద నీటి చుక్కలల్లే చిటపటమంటాడే గాని -నేనంటె గొప్ప ప్రేమ! ఎంతో యిష్టం!"

సరిగ్గా అప్పుడే మోటారు సైకిలు శబ్దమైంది. వేణు అన్నాడు -

"పాణి వచ్చినట్టున్నాడు! మళ్లా కలుసుకుందాం!" అని అక్కడ్నించి వెళ్లిపోయేడు!

**(ఇంకావుంది)**





# సప్తస్వర సుందరి
# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు
**డా॥ పి.బి.శ్రీనివాస్**
'కోసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

స్వరభావమాధుర్యం- ఆటపట్టు.. అహ- ఆయువు పట్టు. లతా సంగీతాభిమానులందఱం ఎంత పుణ్యం చేసు కున్నామో మఱి! ఆమె అందిస్తున్న అజరామర గానాన్ని ఆనందించేందుకూ, వరవశించేందుకూ!

నాకానాడూ అనిపించేది, ఈనాడూ అనిపిస్తూనే వుంది. లతా మంగేష్కర్ అనే అజరామర గాయిక, అనుపమ చిత్ర నాయికగా పేరు గడించేని "పాడే నాయిక" (సింగింగ్ స్టార్) గా రూపొందివుండి వుంటే ఏ కొన్ని చిత్రాలకో ఏ కొన్ని పాటలు మాత్రమే పాడగలిగి వుండే సందర్భం ఏర్పడి మహా అయితే కొన్ని వందల గొప్ప హిట్‌సాంగ్‌లు మాత్రమే ఆమెకు పేరు తెచ్చి వుండేవేమో! సంగీత ప్రియుల అదృష్ట వశాత్తూ, నటనకి ఆమె ఆరంభదశలోనే స్వస్తి చెప్పి, గాయికగా పాడడం మాత్రమే వృత్తిగా స్వీకరించాలని తీర్మానించు కోవడం వలన, ఈనాటికే కొన్ని వేల అద్భుతమైన అజరామర గీతాలు పాడి, శ్రోతల హృదయాలలో శాశ్వత స్థానాన్ని ఆక్రమించుకుని తన గద్దెపై తాను



మాత్రమే తిష్ఠవేయగలిగారు.

నిజానికి ఆమె నటనకి స్వస్తి చెప్పదలచుకున్నప్పుడు ఏమాత్రం కష్టం

## లతా తల్లి శిక్షణ

**భర్త పేరు నిలబెట్టేలా నటనలోనూ, సంగీతంలోనూ తన సంతానం మంచి పేరు ప్రతిష్ఠలూ, ధనం సంపాదించాలనే లతా తల్లికి ఆకాంక్ష వుండేది. అందుకు బిడ్డల్ని ఆమె పెంచిన విధానమే సాక్ష్యం. దీక్షాశ్రద్ధలతో ఆమె పెంపకంలోనే బిడ్డలందరూ సంపూర్ణ కళాకారులుగా రూపొందారు.**

నిజజీవితంలో నటించడం బొత్తిగా

ఫీలవలేదు. సరికదా 'అమ్మయ్య! ఈ అభినయ భారం నుండి విముక్తి దొరికింది కదా' అని సంతోషపు నిట్టూర్పే విడిచారుట. ఇది లతాకి సంగీతం పట్లా గానం పట్లా కల అత్యాధికాభిమానాన్నే సూచిస్తుంది. ఏది ఏమైనా ఆమె నిశ్చిత నిర్ణయం సంగీతాభిమానులందరికీ వరప్రసాదమై లభించింది.

కానీ ఆ నటనే ఆమెకు, ఆమె కుటుంబానికి కొంతకాలం తిండిపెట్టింది. ఏ పరిస్థితుల్లో ఆమె నటించవలసివచ్చిందో, ఇష్టం లేకుండానే కొనసాగించ వలసి వచ్చిందో తెలుసుకుంటే అయ్యో పాపం అనిపిస్తుంది.

అవెల్లాంటి గడ్డురోజులు! ఒక ప్రక్క పితృపాదులు పరమ పదించడం. మరొకప్రక్క ఇల్లు నడిపే భారం చిన్నారి లతా భుజస్కంధాలపై మోపబడడం! పట్టుమని పదమూడేళ్ళైనా నిండని చిఋతప్రాయంలో లతాబాల దిగ్భ్రాంతయై నిలిచింది.

దీనానాథ్ అంత్యక్రియ లకి ఖర్చైన దంతా పోగా ఇంట్లో మిగిలినది నాలుగు రోజుల రేషన్! ఐదో రోజున ఇల్లు గడిచెదెలా? ఆఋగురి పొట్టలు నిండేదెలా? అంతా అగమ్య గోచరం. "అమ్మా! ఇక నేనేదైనా పనికి వెళ్ళవలసినదేనా"! అని చిన్నారి లత అడిగిన ప్రశ్నకి, తల్లి నివ్వెరపోయింది. కళ్ళనిండా కన్నీళ్ళు! ఆమె పొందిన ఆవేదన కన్నా లత మనసులో దొలుస్తున్న ఆవేదన పరిమాణమే ఎక్కువేమో!

తాకట్టు పెట్టిన కెమేరానీ ఇతర వస్తువుల్నీ విడిపించుకోడానికి గూడా స్తోమతలేని క్లిష్టపరిస్థితిలో నగలు కూడా అమ్మక తప్పలేదు. చివరికి వంట పాత్రల క్కూడా రెక్కలొచ్చి ఎగిరిపోసాగాయి ఇల్లు వదిలి.

అలాటి గడ్డు సమయాన సంగీత సాధకానికి కూడా అడ్డు తగిలింది పేదరికం. అందువలననే అతి చిన్న వయసులోనే సరదాగా నారదుడి పాత్రని అభినయించిన లతకి తెరపై నటించవలసిన అగత్యం ఏర్పడిన సమయాన తండ్రి అన్నమాటలు గుర్తుకొచ్చి మనస్సులో రీంకరించడం మొదలు పెట్టాయి.

"మొఖానికి రంగు పులమడం నాతోనే ముగిసిపోవాలి. మీరెవ్వరూ ఆ పక్కకికూడా మొఖం తిప్పకండి. ఈ వృత్తిలో డబ్బు బాగా సంపాదించ గలిగినా, సమాజగౌరవం లభించడం అరుదు-" అనేవారట ఆయన తన అనుభవసారాన్నంతా కుమ్మరిస్తూ-

అయినా ఎట్టకేలకి లతాకి గృహ నిర్వహ ణార్థం నటించక తప్పలేదు. తండ్రికి ఆప్తమిత్రుడైన శ్రీపాదజోషిగారి ద్వారా ఆమె నటించే అవకాశం దొరికింది ఒక ఫిలిం సంస్థలో. ఆ సంస్థ అధిపత్యంలో మాస్టర్ వినాయక్ (నేటి నటి నందా తండ్రి)కి మేటి భాగం వుండింది. ఆ సంస్థ నిర్మించిన 'పహ్లీ మంగళ్ గౌరీ' అనేదే

## తమ్ముడు హృదయనాథ్ పట్ల లతా ప్రేమ

లతాకి తమ్ముడి యెడల ప్రీతి వాత్సల్యాలు అధికం అనే విషయం ఈనాడందరికీ తెలిసినదే. హృదయనాథ్ సామాన్యుడేమీ కాదు. మంచి శాస్త్రీయ పరిజ్ఞానం కల మంచి గాయకుడూ, సంగీత దర్శకుడూ కూడా. చిన్నప్పుడు పోలియో వలన తన ఒక కాలు స్వాధీనం తప్పినందుకు ఒకింత మనసుక్రుంగినా దాన్నే తలచుకుంటూ కుమిలి పోకుండా, ధైర్యంగా సమస్యలన్నిటినీ ఎదుర్కుంటూ తన సంగీత జ్ఞానాన్ని అపారంగా పెంపొందించుకున్న స్థైర్యశాలి. లలితశాస్త్రీయ పరంగా ఆయన వరుసలు కూర్చిన కొన్ని గీతాలని విశిష్టంగా ఆలాపించి, రికార్డులుగా విడుదల చేయించి తమ్ముడి ట్యూన్లకి శాశ్వతత్వం కలిగించారు లతా!



ఓ రోజున రేడియోలో లతా పాడిన ఒక అద్భుతమైన భజన్ ప్రసారితమౌతూ నా చెవిని పడింది. అంతే, 'నడిచివెడుతున్న వాడిని, తటాలున ఆగి ఆ పాట సాంతం విని కాని కదలలేకపోయాను. వింటూ నేను పొందిన ఆనందపారవశ్యాన్ని వర్ణించడం నా శక్యం కాదు. ఎవరబ్బా ఈ ట్యూన్ కంపోజ్ చేసిన గ్రేట్ జీనియస్ అని అనుకుంటూ పాట చివరిని, కంపోజర్ పేరు చెబుతారేమో అని ఎదురుచూశాను. కాని ప్రారంభంలోనే చెప్పేరేమో తెలియదు కాని, ఆ పాట ముగియగానే మరొక పాట మొదలైంది. నాకు నిరాశ మిగిలింది.

అప్పట్నించి ఆ పాట ("నిస్ దిన్ బరసత్ నైన్ మమారే నైన్ హమారే") పాడి వినిపించి చాలా మందిని అడిగి చూశాను. కొందరు చెప్పలేకపోయారు. కొందరు తప్పు తప్పుగా చెప్పారు. తరవాత చాలా రోజులకు సినిమా పాట కాదని తెలిసింది. ఎందుచేతనంటే అది ప్రైవేట్ సాంగుల లిస్టులో వినిపించబడింది. కంపోజ్ చేసినది హృదయనాథ్ మంగేష్కర్ అని తెలుసుకున్న మీదట నాకు అయనపట్ల గౌరవ భావం చాలా పెరిగిపోయింది. అక్కాతమ్ముళ్ళ మేటి కాంబినేషన్లో ఆ పాట ప్రత్యేకతని సంతరించుకుంది.

నేనూ, ఎస్.జానకి జరిపిన అనేక సంగీత కార్యక్రమాలలో చాలాసార్లు ఆమె ఈ భజన్ తు.చ. తప్పకుండా యథాతథంగా అవలీలగా అనాయసంగా పాడేస్తూవుంటే ఆశ్చర్యపడిపోయే వాడిని. "భజన్స్"లో నా మోస్ట్ ఫేవరేట్ భజన్ ఇదేనని నేను ఘంటాపథంగా చెప్పగలను.

హృదయనాథ్ గొప్ప గాయకుడని ఇటీవలదాకా నాకు తెలియదు. టీ.వి.లో ఒక ప్రత్యేక కార్యక్రమంలో లతా, హృదయనాథ్‌లు పాడిన సందర్భాన పాట చివర్న హృదయనాథ్ పాడిన వైనం విని విస్తుపోయాను. సంగతులు ఎలా పలికాయంటే అలా పలికాయి నిర్దుష్టంగా. అక్కకి తగిన తమ్ముడే అన్పించుకున్నారాయన.

"ఆనంద్‌ఘన" అనే మారుపేరుతో సంగీత దర్శకత్వం కూడా వహించిన లతా, హృదయనాథ్‌లు సంప్రతించుకొని కంపోజ్‌చేసిన అనేక చిత్ర గీతాలు మరాఠీ చిత్రాల్లో చాలా వున్నాయని నా అంచనా! ఎవరి పేర వెలువడినా ట్యూన్లోని సంగీతంలో ఇద్దరి సమిష్టి కృషీ వుండివుండవచ్చు అని అనిపించక మానదు, సూక్ష్మజ్ఞులైన శ్రోతలకు!

# లతా ధాటికి రూనా లైలా దడిసిపోయిందా?



'ఏక్ సే బఢ్‌కర్ ఏక్' రికార్డింగు సమయంలో రూనాను అభినందించవచ్చిన లతా

'దమా దమ్ మస్త్ కలందర్' అంటూ తన గానంతో, అభినయంతో భారతీయ సంగీతరంగాన్ని ఒక కుదుపు కుదిపిన రూనా లైలా హిందీ సినిమా రంగంలో కాలూనలేకపోవడానికి కారణం లతా మంగేష్కరా? అన్న ప్రశ్న రూనా అభిమానులను ఎప్పటికీ వేధించే ప్రశ్న.

బంగ్లాదేశ్‌కు చెందిన బహుభాషాగాయని, ప్రజ్ఞాశాలి రూనా ఏ రకమైన పాటనైనా సరే అవలీలగా పాడగలదు. కానీ దురదృష్టం ఆమెను వెంటాడింది. బంగ్లాదేశ్ (అప్పట్లో తూర్పుపాకిస్తాన్ అనేవారు) పాకిస్తాన్‌లో కలిసి ఉండే రోజుల్లో ఆమె కరాచీవెళ్లి అవకాశాలకై ప్రయత్నించింది. కరాచీ సినిమారంగాన్ని నూర్జహాన్ ఏలుతూ ఉండేది. 'మాలికా-ఏ-తరన్నుమ్' అనే బిరుదుతో బాటు యాహ్యాఖాన్‌కు సన్నిహితురాలిగా ఆమె ఎవర్నీ ఎదగనిచ్చేది కాదు.

కానీ 1971 యుద్ధంలో పాకిస్తాన్ ఓటమి, బంగ్లాదేశ్ ఆవిర్భావం తర్వాత నూర్జహాన్ ప్రభ తగ్గి, షానాజ్‌బేగం, నహీద్ అఖ్‌తర్, మెహనాజ్ బేగమ్, ఇత్యాది గాయనీమణులు కరాచీ టివిపై ప్రభవించారు. వారందరూ ఒక్కోరకం పాటలే పాడగలిగితే రూనామాత్రం అన్నిరకాల పాటలూ పాడగలిగేది. దాంతో టీవీ ప్రేక్షకులు ఆమెకు బ్రహ్మరథం పట్టారు.

యుద్ధం ముగిసిన ఏడాదిలోగానే నూర్జహాన్ మళ్లీ తెరమీదకు వచ్చింది. డామినేషన్ కొనసాగించింది. రూనా లైలా బెంగాలీ కాబట్టి బంగ్లాదేశ్‌కి వెళ్లాలి కానీ ఇక్కడ పాటలు పాడడమేమిటన్న వాదనలు వినిపించాయి. దాంతో రూనా 1973లో బంగ్లాదేశ్ చేరింది.

కానీ సముద్రమంతటి ఆమె ప్రతిభకు కొత్తగా రూపుదిద్దుకుంటున్న బంగ్లాదేశ్ చాలలేదు. తన టేలంటు చూపడానికి ఇండియా వచ్చింది. వి.వి.గిరి బంగ్లాదేశ్ పర్యటన సందర్భంగా ఆయన ఎదుట పాడిన రూనాను కల్చరల్ ఎక్స్‌ఛేంజ్ కార్యక్రమంలో బొంబాయివచ్చి భారతీయ

## 'ఒన్స్‌మోర్' లేకుండా రావద్దు'

లతా తల్లి సంగీత కచ్చేరీలకి పిల్లలని పంపేముందు "ఇదుగో చూడండి, మీ బాబా ఏ కచ్చేరీకి వెళ్ళిపాడినా 'ఒన్స్‌మోర్' అని అనిపించుకోకుండా తిరిగి వచ్చేవారు కారు. మరి మీరు కూడా ఆ తండ్రికి తగిన బిడ్డలమని నిరూపించుకుని మరీ ఇంటికి తిరిగి రావాలి తెలిసిందా" అని మరీ మరీ హెచ్చరించి మరీ పంపేవారట!

"మీరు అందరిలాగా సామాన్య కార్యాలు చేసేందుకని పుట్టలేదు- అసాధారణ మహత్కార్యాలు నెరవేర్చేటందుకే జన్మించిన ప్రత్యేక వ్యక్తులూ, శక్తులూ మీరు అన్న విషయం ఎన్నడూ మరచిపోకండి" అనేవారుట.'మాయీ' పెర్‌ఫెక్షన్ ఎంతటిదంటే, పిల్లలు తమ తండ్రి పద్ధతిలో కచ్చితంగా పాడ గలిగేవరకూ, దయాదాక్షిణ్యాలు లేకుండా ప్రాక్టీసు చేయించేవారు. వాళ్ళు సక్రమంగా పాడిన వెంటనే ఏమాత్రం దాపరికం లేకుండా, మనసారా బాహాటంగా మెచ్చుకునేవారు. ఆమె ఆ మెప్పు గొప్ప గొప్ప అవార్డుల కన్నా ఎక్కువ ఆనందం అందించేదిట పిల్లలకి.

ఆమె శాస్త్ర ప్రకారంగా సంగీతం అభ్యసించకపోయినా, తన భర్త సాధనచేసే సమయాలలో అకుంఠిత శ్రద్ధతో మెలకువలన్నీ అవగాహన చేసుకుని జ్ఞానాన్ని అభివృద్ధి పఱచుకునేవారట."సంగీతమూ, పాడే ఇంపైన గాత్రము దైవదత్త వరాలనేది అక్షరసత్యమే అయినా దైవదత్తమైన ప్రతిభకీ, సామర్థ్యానికీ, కృషీ దీక్షాతోడైనప్పుడే ఆ ప్రతిభాపాటవాలు రాణిస్తాయి." అని ఆమెకి సంపూర్ణమైన నమ్మకం.

అదృష్టవశాత్తూ లతాను తీర్చిదిద్దిన నౌషాద్ కూడా మరో పెర్‌ఫెక్షనిస్టు. రికార్డింగుకి పాడి ముగించినంతనే టేకెలా వచ్చిందోకూడా తెలుసుకోకుండానే సంగీతం దర్శకుడు 'ఓ.కే' అంటే చాలు, అందరి వద్దా సెలవు తీసుకుని నేరుగా కారెక్కి ఇంటికి బయలుదేరే సింగర్స్ ఉన్నరోజుల్లో కూడా లతాని వెళ్ళనివ్వకుండా ముఖ్యమైన వ్యక్తులతోపాటు కూర్చోబెట్టి, ఓ.కే. అనుకున్న టేకుని వినిపించి లతా కూడా సంతృప్తిని వెలిబుచ్చిన మీదటనే కారెక్కి వెళ్ళేందుకు అనుమతించేవారట.

విద్యాభవన్‌లో ప్రదర్శన ఇచ్చింది. "లతా ఆఫ్ బంగ్లాదేశ్" అని ఆమె పరిచయం అవుతూండ గానే సాక్షాత్తూ లతాయే ఆ కార్యక్రమానికి వచ్చింది.

కాస్సేపు చూశాక ఈ అమ్మాయి వల్ల ఛాలెంజ్ ఏదీ రాదులే అనిపించిందేమో, లతా సభ విడిచి వెళ్లి పోయింది. ఆమె వెళ్లిపోయాక రూనా విజృంభించి పాడి అందర్నీ మెప్పించింది. 1975లో దూర్‌దర్శన్‌లో పాడే ఛాన్స్ వచ్చిందామెకు. దాంతో ఒక సెన్సేషన్ అయి పోయింది. రూనాకున్న ఆడియో-విజువల్ ఎఫెక్టు వేరెవ్వరికీ లేదని అర్థమయిపోయింది.

సాధారణంగా మన సింగర్స్ అందరూ చేతిలో పుస్తకం పట్టుకుని, సరదా పాటైనా సరే సీరియస్‌గా పాడతారు. (లతా కూడా మినహాయింపు కాదు). కానీ రూనా పద్ధతి అది కాదు. ఆమె ముందునుండీ టీవీలతో ఎదిగిన మనిషి కాబట్టి పుస్తకం చూడనక్కరలేకుండా హుషారుగా శరీరాన్ని కదిలిస్తూ (అసభ్యత ఉండదు, ఆమె కూడా పాటను ఎంజాయ్ చేస్తున్నట్టు అనిపిస్తుంది) పాడుతుంది. ఆమె భజన్‌ల నుండి పాప్ వరకు, ఘజల్ నుండి ఫోక్‌లోర్ వరకు, బెంగాలీ, ఉర్దూ, హిందీ (ఆమె తల్లి హిందూ) ఏ తరహా గీతాన్నయినా అలవోకగా పాడగలదు.

టీవీ లేనప్పుడు గాయకుల హావభావాలు తెలుసుకునే సౌకర్యం లేదు. టీవీ తెరపైన ప్రేక్షకులకు కట్టిపడేసే నేర్పు రూనా స్వంతం. టీవీపై 'దమ్ దమాదమ్' పాట రాగానే ఆమె హాట్ ఫేవరేట్ అయిపోయింది. 'సిన్సియర్లీ యువర్స్, రూనాలైలా' అనే ఎల్.పి.రిలీజయ్యింది. సంగీతదర్శకుడు జయదేవ్ "లతా సిస్టర్స్‌కు జవాబు ఇదిగో, ఇన్నాళ్లకు!" అని స్టేటుమెంటు ఇచ్చాడు. రూనాచేత 'బోలో బోలో కాన్హా బోలో ఛలియా' పాడించాడు.

రూనాకు ఫిలింఫేర్ ఎవార్డు వచ్చినప్పుడు అందరి దృష్టి ఆమె మీదనే. వెంటనే బొంబాయిలోని షణ్ముఖానంద హాల్‌లో ఓ స్టేజ్ షో ఏర్పాటు చేశారు. స్పాన్సర్ చేసిన అజిత్ శేఠ్ రూనాలైలాను ప్రేక్షకులకు పరిచయం చేస్తూ హిందీ చిత్రసీమలో లతా సోదరీమణులు ఎంత దారుణంగా డామినేట్ చేస్తున్నారో, కొత్త గాయనీమణుల చేత పాడించిన సంగీతదర్శకులను ఎలా ఏడిపిస్తారో చెబుతూండగానే లతా మంగేష్కర్ సభాప్రవేశం చేసింది. దాంతో వెంటనే అజిత్ ప్లేటు ఫిరాయించాడు. సంగీతరంగంలో ఎదగదలచినవారందరూ మెలడీక్వీన్ ఆశీస్సులు తీసుకోవలసిన ఆవశ్యకత ఎంత ఉందో ఉద్ఘాటించాడు.

రూనా ఫస్ట్ రికార్డింగ్ టైములో కూడా లతా ఇటువంటి డిప్లమసీయే ప్రదర్శించారు. బ్రిజ్ తీసిన 'ఏక్ సే బఢ్‌కర్ ఏక్' లో పాటపాడడానికి రూనా సమాయత్తమవుతూంటే అందర్నీ ఆశ్చర్యపరుస్తూ లతా బొకే తీసుకుని వచ్చారు. కొత్త గాయకులపై తనకు వైషమ్యం లేదని ఆమె ఇలా ప్రదర్శించినా 'మోర్ లాయల్ దాన్ కింగ్' వంటి వందిమాగధులు రూనాకు అవకాశాలు ఇవ్వడానికి దడిశారు.

జయదేవ్ ఒక్కడే రూనాకు అండగా నిలిచాడు. భీమ్‌సేన్ అనే నిర్మాత సహకారంతో 'ఘరౌండా' సినిమాలో 'దో దీవానే షెహర్ మే', 'తుమ్హే హోన హో' పాటలు పాడించాడు. అవి చాలా బాగా హిట్ అయ్యాయి. కళ్యాణ్‌జీ - ఆనంద్‌జీ రూనా చేత పాడించడానికి 'లతాజీ వచ్చి ఆమోదముద్ర వేయిస్తేనే పాడిస్తాం' అని షరతు పెట్టారు. లక్ష్మీకాంత్ ప్యారేలాల్ అయితే మరీనూ. నిర్మాత రూనా వాయిస్ కావాలనుకుంటే తమను వదులుకోవాలని స్పష్టంగా చెప్పేవారు.

ఇవన్నీ ఒక ఎత్తయితే అన్నిటికన్నా దారుణమైనది - రూనాలైలా ఇంటర్నేషనల్ స్పై అనే పుకారు. రూనా అరబిక్, పెర్షియన్ భాషల్లో కూడా పాడగలదు కాబట్టి గూఢచారిణి అని బొంబాయిలో పుకారు పుట్టించారు. పాడేఛాన్సులు రాకపోగా ఇలాటి న్యూసెన్సు కూడా భరించరావలసి రావడంతో విసిగిపోయిన రూనా బంగ్లాదేశ్‌కు తిరుగుప్రయాణం కట్టింది.



లతా సిస్టర్స్‌కు జవాబీమేనంటూ ధైర్యంగా రూనాచే పాటలు పాడించిన నిర్మాత భీమ్‌సేన్, కంపోజర్ జయదేవ్ 'ఘరోండా' రిహార్సల్స్ సందర్భంగా

లత ప్రప్రథమంగా తెరపై అభినయించిన మరాఠీ చిత్రం. ఆమె నటించడానికి మాత్రమే కాక పాడడానికి కూడా ఆ వుద్యోగంలో నియమింపబడింది. అయితే ఆ పాటకి అదనంగా ఏమాత్రం సొమ్మివ్వబడదని ఒక కండిషన్. అందువలన ఫ్రీగానే ఒక పాట ఆ చిత్రం కోసం పాడింది లత- ఆ పాటే- 'నటలీ చైత్రాచీ నవళాయీ.'

లతా అభినయవృత్తి మెల్లమెల్లగా సాగుతూ వచ్చింది. అంతలో మాస్టర్ వినాయక్ తమ స్వంత ఫిలింకంపనీని ప్రారంభించదలచి, తమ మకాం పూనా నించి కొల్హాపూర్‌కి మార్చడం వల్ల, లతా పరివారం కూడా అక్కడికి మకాం మార్చాలనుకున్నా కొంత సమయం పట్టింది.

'పూనా'లో తన పని ముగించిన తరవాతగాని ఆమె కొల్హాపూర్ రావడం పడలేదు. వినాయక్ కొల్హాపూర్‌లో 'ప్రఫుల్లా పిక్చర్స్' అనే సంస్థ ప్రారంభించారు. లతా కుటుంబం రాగానే కారు పంపారు. చవకలో అద్దె ఇల్లుని యెంచుకోవడం కోసం ఆ కారులో తిరిగి ఎన్నో ఇళ్లు చూసిన పిమ్మట 'మాయీ'కి ఒక చిన్న యిల్లు నచ్చింది. కారణం అద్దె తక్కువ!

ఇల్లు విషయంలో ఇంత పొదుపు పాటించినా కానీ అదే యింట్లో దీనానాథ్ శ్రాద్ధదినాన, ఆయన హోదాకి తగినట్లుగా కర్మలన్నీ చేయించేందుకుగాను ఖర్చు చేయడంలో 'మాయీ' ఏమాత్రం వెనుకంజ వెయ్యలేదు. ఏమాత్రం లోటు జరగకుండా నడిపేందుకు ఆమె ఒక పెద్ద వెండి పళ్ళేన్ని కూడా అమ్మేశారు. లతా మనస్సు చివుక్కుమంది "ఆ పళ్లెం 'బాబా' స్మృతి చిహ్నం కదా! ఎందుకమ్మేశావు" అని బాధగా ప్రశ్నించింది-

"మీ నాన్నకున్న హోదాకి ఈ వెండిపళ్ళెం అసలు లెక్కకేరాదు. నువ్వు మీ నాన్నలాగే అద్భుతంగా పాడావంటే బంగారు నాణాలే కురుస్తాయి!".

ఆనాటి మాయీ మాట త్వరలోనే ఋజువైంది.

శ్రాద్ధం అంతా చాలాఖర్చు చేసి సక్రమంగా నడిపించినా పిండాన్ని ముట్టుకునేందుకు కాకి రాలేదట. మాయీ చాలా ఫీలయిపోయి- "మీరు కొన్ని ప్రమాణాలు చేస్తేనే కాని, మీ నాన్నగారి ఆత్మ శాంతించదు. కాకి వచ్చి పిండాన్ని ముట్టదు." అన్నారట.

మాలో ఎవరూగానీ సంగీతవృత్తి తప్ప మరో వృత్తి ఏదీ చేపట్టమనీ పిల్లలందరూ ప్రమాణం చేసి నిర్ణయం తీసుకున్న తరవాతనే, కాకి వచ్చి పిండం ముట్టిందట! దీనానాథ్ పిల్లలందరూ ఆ ప్రమాణాలన్నీ అక్షరాలా ఈనాటికీ నెరవేరుస్తూ వస్తూవున్నారు!

(ఇంకా వుంది)






కారు డ్రైవ్ చేస్తున్న ఓ అమ్మాయి మాటిమాటికి తన చేతిని బైటకు పెడుతోంది. ఆమె తన కారుని మలుపుతిప్పబోతోందని వెనుక వస్తున్న కారతను చాలాసార్లు స్లో చేసి ఇంక భరించలేక స్పీడుగా ఓవరుటేక్ చేసి ముందుకు వచ్చేసి "ఏంటండీ ఇది... ఎప్పుడు మీరు టర్న్ చేస్తారు?" అంటూ విసుక్కున్నాడు.

"అయ్యో మీరు తప్పుగా అర్థం చేసుకున్నారు. నేను నెయిల్ పాలిష్‌ని ఆరబెట్టుకుంటున్నా అంతే!" అని జవాబిచ్చిందా కారమ్మాయి తన గోళ్లని చూసుకుని మురిసిపోతూ.



ఓ రైల్లోని టికెట్ కలెక్టర్ చెకింగ్ చేస్తూ "మీ టికట్టు విశాఖపట్నంకి, కాని మీరు తిరుపతి వైపు వెళుతున్నారు!" అన్నాడు ప్రయాణికుడితో...

"ఆ మాట నాకు చెప్తావేమయ్యా? డ్రయివరుకు చెప్పు" అని గద్దించాడా ప్రయాణికుడు కోపంగా.



పెళ్లి భోజనం చేస్తున్న ఒకతనితో "ఏమిటి సంగతి... చాలాసేపట్నుండి తింటూనే ఉన్నారే మీరు !?" అని అడిగాడు పెళ్లి పెద్ద.

"అవును మరి... ఆహ్వానపత్రికలో విందు 8 గంటల నుండి 10 గంటల వరకు అని రాశారు కదా' అన్నాడా ఆహ్వానితుడు.

**ఈ జోక్‌లను పంపినవారు**
**జి.బి.లక్ష్మి, హైదరాబాద్.**



"ఆ డాక్టరేమిటి ఎప్పుడు బ్లడ్ టెస్ట్ చేయించుకున్నా షుగర్ లేదనే అంటాడు!"

"అదా! అతను తన చిన్నప్పుడు వాళ్ళ నాన్నకున్న గవర్నమెంట్ రేషన్‌షాపులో కూచునేవాడులే"



కోర్టులో ఓ దొంగతనం కేసు విచారణ జరుగుతోంది.

"నీకు వైద్యం చేసిన డాక్టర్ దగ్గరే ఎందుకు గడియారం దొంగతనం చేశావు"

"మరండి... డాక్టరు గారు మాత్రలిచ్చి నాలుగు గంటలకొకటి చొప్పున వేసుకోమన్నారండి. నా దగ్గర గడియారం లేదు కదండీ... అందుకనండీ..."

"మీ మావయ్య గారిని కాళ్లకు దణ్ణం పెట్టి దీవించమని అడుగు తల్లీ"

"కాళ్లకి దణ్ణం పెట్టి దీవించండి మావయ్యా!"





"మీలో స్వర్గానికి వెళ్లాలనుకుంటున్న వారు చేతులెత్తండి"

ఒక్క అమ్మాయి తప్ప అంతా చేతులెత్తేరు.

"ఏమ్మా! నువ్వెళ్లవా స్వర్గానికి?"

"వీళ్లంతా వస్తే అది స్వర్గమెలా అవుతుంది టీచర్!?" అందా అమ్మాయి.

"యింతకీ ఈ యింటికి యజమాని నువ్వా? నేనా?"

"తమరే బాబయ్యా!"

"మరైతే నువ్వెందుకలా మూర్ఖుడిలా మాట్లాడతావ్?"



**ఈ జోకులను పంపినవారు : కోనే నాగవెంకట ఆంజనేయులు, ఉక్కునగరం.**




"ఏమండీ దొండకాయ కూర ఎలా చెయ్యాలి?" అడిగింది అప్పుడే కాపురానికొచ్చిన భార్య.

"పుల్లా బెల్లం పెట్టు" అన్నాడు భర్త.

నరేనని దొండకాయలకు చీపురుపుల్ల గుచ్చి పక్కనే ఇంత బెల్లం ముక్క వడ్డించింది విస్తట్లో.





"ఏంటోయ్! పెళ్లికి ముందు నీ స్వరంలో గంధర్వ గానాలు విన్నాను. ఇప్పుడేంటి గార్ధభ స్వరాలు పలుకుతున్నాయ్"

"పెళ్లయిన దగ్గరనుండి వాటితోటే అరవటం మూలాన, వాటిని కంట్రోలులో పెట్టడం వలన, వాటితో కలసిమెలసి తిరగడం వలన స్వరం మారుతుంది లెండి"

"భార్యంటే... తెలుసా నీకు?"

"తెలుసు"

"ఎవరు?"

"మన చేతుల్తో ఎప్పటికీ ఆపుచేయడం వీలుకాని ఓ టి.వి. సీరియల్"



**ఈ జోక్‌లను పంపించిన వారు : తెలికిచర్ల రామకృష్ణ, విజయనగరం.**

**ఈ జోక్‌ను పంపినవారు : లకనం మూర్తి, కాకినాడ.**

"జైలర్ గారికి పెళ్లట"

"అయితే ఇంక ఆయనకి మనకి అట్టే తేడా ఉండదన్నమాట"



"తిక్క తిక్కగా వాగావంటే ఎముకలు ఏరేస్తా!"

"అయితే ఓ పనిచెయ్"

"చెప్పు"

"ఊరి చివర కసాయి కొట్టుందా?"

"ఉంది"

"ఆ కొట్టు పక్కన చెత్తకుండీ ఉందా?"

"ఉంది"

"పోయి అందులో వెతుక్కో...ఏరడానికి బోలెడుంటాయి."





"మా వ్యాపారానికి ఆ శివ కేశవులిద్దరూ మా బాగా సాయం చేత్తారండి"

"అదెలా?"

"విష్ణువు వుండేది పాల సముద్రంలో, గంగ ఉండేది శివుని తలపైన... ఆ రెంటిని కలిపితేనే కదండీ మా వ్యాపారం..."

"పెళ్లి చేసుకోవాలని - నిర్ణయించుకున్నా!"

"వినాశకాలే - విపరీతబుద్ధి"



**ఈ జోక్‌లను పంపిన వారు : ఎం.శిరీష, చిత్తూరు.**

"మా ఆయన తనకు మనశ్శాంతి లేనే లేదంటున్నారు. ప్రతిరోజూ విసుగు విసుగ్గా ఉంటున్నారు డాక్టర్...! ఏదైనా మందిద్దురూ"

"ఇది వేసుకుంటే హాయిగా నిద్ర పడుతుంది."

"ఎన్ని గంటలకు వేయమంటారు?"

"ఇది మీ ఆయనక్కాదు. మీరు వేసుకుని మాట్లాడకుండా నిద్రపోతే మీ ఆయనకు మనశ్శాంతి దానంతట అదే వస్తుంది"



**ఈ జోక్‌ను పంపినవారు సి.హెచ్.బృందావనరావు, విజయవాడ.**

## 'కసమ్ కీ కసమ్ హై కసమ్ సే'

బృం: ప ప ద ద ని ద ని ద ని ప ప ద ద

అ : కసమ్ కీ కసమ్ హై కసమ్ సే
హమ్ కో ప్యార్ హై సిర్ఫ్ తుమ్ సే ॥ప ప ద ద॥॥కసమ్ కీ కసమ్॥
అబ్ మే న హోగా ఫిర్ హమ్‌సే ॥కసమ్ కీ కసమ్॥

లోగ్ కెహతే హైం పాగల్, హూం మైం భీ న జానూం
దిల్ లుటాయా హై మైనే, అబ్ కిసీ కీ న మానూం
చైన్ దేకర్ కే మైనే బేచైనియాం యే లీ హై
నీందేం ఉడాకే మైనే తుమ్‌సే వఫాయేం కీ హై
కసమ్ కీ కసమ్ హై కసమ్ సే
జీ రహేం హమ్ తేరే దమ్ సే
అబ్ యే ప్యార్ న హోగా ఫిర్ హమ్‌సే ॥ప ప ద ద॥

అ : కుఛ్ ఇషారోం మేం తుమ్‌నే హమ్‌సే జో యే కహా హై
అబ్ యకీం ఆ రహాహై తుమ్‌కో భీ కుఛ్ హువా హై
క్యూం తుమ్‌కో దేఖ్‌తే హైం, క్యా దిల్ మేం సోచ్‌తే హం
తూఫాం జో ఉర్ రహాహై, హమ్ ఉస్‌కో రోక్‌తే హైం
కసమ్ కీ కసమ్ హై కసమ్ సే
యే మిలన్ హై సనమ్ కా సనమ్ సే
అబ్ యే ప్యార్ న హోగా ఫిర్ హమ్‌సే ॥కసమ్ కీ కసమ్॥





# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

**చిత్రం**
మైం ప్రేమ్ కీ దీవానీ హూం (2003)

**రచన**
దేవ్‌కోహ్లీ

**సంగీతం**
అనూ మలిక్

**గానం**
చిత్ర, షాన్, బృందం

**అభినయం**
కరీనా కపూర్, అభిషేక్ బచ్చన్, హృతిక్ రోషన్ తదితరులు

కుటుంబసమేతంగా చూడదగ్గ సంగీతభరిత చిత్రాలకు రాజశ్రీ ప్రొడక్షన్స్ సంస్థ పెట్టింది పేరు. దోస్తీ, చిత్‌చోర్, సావన్ కో ఆనేదో, నదియాకే పార్, మైనే ప్యార్‌కియా, హమ్ ఆప్‌కే హైం కౌన్ వంటి మ్యూజికల్ సూపర్‌హిట్స్ ఆ సంస్థ నుండి వెలువడ్డాయి. 'హమ్ ఆప్‌కే హైం కౌన్' అయితే బాక్సాఫీసు రికార్డులు బద్దలుకొట్టి ఆధునిక కుటుంబకథాచిత్రాల ఒరవడికి శ్రీకారం చుట్టింది. రాజశ్రీ సంస్థ అధినేతలలో ఒకరైన రాజకుమార్ బర్జాత్యా కుమారుడు సూరజ్ బర్జాత్యా 'మైనే ప్యార్‌కియా' చిత్రంతో దర్శకుడిగా పరిచయమై ఆ సంస్థ తదుపరి చిత్రాలన్నిటికీ దర్శకత్వం వహించారు. 'మైనే ప్యార్‌కియా' 'ప్రేమ పావురాలు'గా, 'హమ్ ఆప్‌కే హైం కౌన్' 'ప్రేమాలయం' గా తెలుగునాట కూడా విజయం సాధించాయి. ముఖ్యంగా 'మైనే ప్యార్‌కియా'లోని 'దిల్ దీవానా', 'కబూతర్ జా జా జా' పాటలు 'నీ జతలేక', 'ఓ పావురమా హో హో' పాటలుగా అనువదించబడి విశేష ప్రజాదరణ పొందాయి.

రాజశ్రీ సంస్థ సూరజ్ దర్శకత్వంలో నిర్మించిన గత మూడు చిత్రాలకు రామ్‌లక్ష్మణ్ సంగీతం అందించారు. వారి తాజా చిత్రం 'మైం ప్రేమ్ కీ దీవానీ హూం'కి అనూమలిక్ సంగీతం అందించారు. నిజానికి అనూమలిక్ 'మైనే ప్యార్ కియా' చిత్రం విడుదలైన తర్వాత రాజ్‌కుమార్ గారిని కలిసి వారి సంస్థకు పనిచేయాలని తన కోరికను వెల్లడించారు. కానీ రామ్‌లక్ష్మణ్ తమ చిత్రాలకు చక్కని సంగీతం అందిస్తున్నారని రాజ్‌కుమార్ గారు చెప్పారు. ఇన్నాళ్ళకు అనూ మలిక్‌కి ఆ సంస్థకు పనిచేసే అవకాశం లభించింది. సూరజ్ ఆయనకి 'మై ప్రేమ్ కీ దీవానీ హూం' కథ చెప్పినప్పుడే ఆయన 'ఔర్ మొహబ్బత్ హై' గా దరిమిలా రూపొందిన పాటకు ట్యూన్ వినిపించారు. సూరజ్, రాజ్‌కుమార్‌లకు



ఆ ట్యూన్ ఎంతో నచ్చింది. ఇలా ఈ కాంబినేషన్ మొదటి నుంచి చక్కని పరస్పర అవగాహనతో పనిచేసి నేటి తరాల్ని ఆకట్టుకునే చక్కని గీతాలను రూపొందించింది.

'మైఁ ప్రేమ్ కీ దీవానీ హూఁ' లో చిత్ర మొదటిసారి ఒక హిందీ చిత్రంలో దాదాపు హీరోయిన్ పాటలన్నీ పాడారు. ఇంతకు ముందు ఆమెకు అడపాదడపా హిందీ పాటలు వచ్చేవి. ఈ చిత్రం తనకు మేజర్ బ్రేక్ అని ఆమె స్వయంగా అన్నారు. అనూమలిక్ మాటల్లో చెప్పాలంటే 'చిత్ర లతాజీ, ఆశాజీలతో సమానమైన గాయని అని నేను భావిస్తున్నాను. ఆమెను నేను చిత్రమ్మా అని పిలుస్తాను. ఆమెను నేను ఈ చిత్రంలో పాడమని అడిగినపుడు హిందీలో ఇంత పెద్ద అవకాశం రావడం ఎంతో ఆనందంగా ఉందన్నారు. ఇక గాయకుల విషయానికి వస్తే హృతిక్ రోషన్‌కు కె.కె., అభిషేక్ బచ్చన్‌కు షాన్ పాడారు. కె.కె. కెరియర్‌లో ఇంతవరకు పాడిన పాటల్లో అధికశాతం పై శ్రుతిలో పాడినవే. ఈ చిత్రంలో సాఫ్ట్ పాటలు పాడారాయన. ప్రస్తుతం జీ.టి.వి.లో 'స రె గ మ ప' కార్యక్రమం నిర్వహిస్తున్న షాన్ ఈ చిత్రంలో రెండు పాటలు పాడారు. 'అక్స్', 'అశోక' చిత్రాలకు అనూమలిక్‌కి సౌండ్ డిజైనర్‌గా పనిచేసిన రంజిత్ బారోత్ ఈ చిత్రానికి కూడా సౌండ్ డిజైనింగ్ చేశారు. అత్యాధునిక వాయిద్యాలతో



మెలొడీ ప్రధానమైన సంగీతాన్ని రూపొందించారు.

'హమ్ ఆప్‌కే హైఁ కౌన్' చిత్రం రాజశ్రీ వారి 'నదియా కే పార్' మూలకథను తీసుకుని కొత్త స్క్రీన్‌ప్లే వ్రాసుకుని రూపొందించినది. అలాగే ఈ 'మైఁ ప్రేమ్‌కీ దీవానీ హూఁ' వారి చిత్రం 'చిత్‌చోర్' మూలకథ మీద ఆధారపడినదే. అమెరికాలో ఉండే ప్రేమ్ కుమార్‌తో సంజనా అనే అమ్మాయికి పెళ్ళిచేయాలని ఆమె తల్లిదండ్రులు తపపెడతారు. ఆమెను చూడటానికి వచ్చిన ప్రేమ్ అంటే సంజనాకు మొదట్లో గిట్టదు. తలిదండ్రులు చూపించిన వాడితో తలవంచి తాళికట్టించుకోవటం ఆమెకు ఇష్టం ఉండదు. కానీ ప్రేమ్ స్వభావం, కలుపుగోలుతనం, తనపై అతనికున్న అమితమైన ప్రేమ చూసి ఆమె అతన్ని గాఢంగా ప్రేమిస్తుంది. కానీ అతను ప్రేమ్‌కుమార్ కాదని, అతని కంపెనీలో పనిచేసే ప్రేమ్‌కిషన్ అని తర్వాత తెలుస్తుంది. దానితో సంజనా తల్లి ప్రేమ్ కిషన్‌ని కాదని ప్రేమ్ కుమార్‌నే తన అల్లుడిగా చేసుకోవాలని భావిస్తుంది. చివరికి సంజనా ఎవర్ని ఎంచుకుంటుందనేది మిగతా కథ. సంజనాగా కరీనాకపూర్, ప్రేమ్‌కుమార్‌గా అభిషేక్ బచ్చన్, ప్రేమ్ కిషన్‌గా హృతిక్‌రోషన్ నటించారు.

సూరజ్ బర్జాత్యా చిత్రాలన్నిటిలో హీరో పేరు ప్రేమ్ అనే ఉంది ఇప్పటి వరకు. 'మైనే ప్యార్ కియా', 'హమ్ ఆప్‌కే హైఁ కౌన్', 'హమ్ సాథ్ సాథ్ హైఁ' చిత్రాలలో హీరోగా నటించిన సల్మాన్‌ఖాన్ పాత్ర పేరు ప్రేమ్. ఈ చిత్రంలో హీరోలిద్దరికి పేరు ప్రేమ్ అని వచ్చేలా కథ కుదరటం విశేషం. చిత్రం పేరుకు కూడా రెండు అర్థాలు వస్తాయి- 'నేను ప్రేమ పిచ్చిదాన్ని' అని, 'నాకు ప్రేమ్ అంటే పిచ్చి' అని.

కథానుసారం సంజనా, ప్రేమ్‌కిషన్‌ల స్వభావాలు, అభిరుచులు భిన్నమైనవి. అతను బంజీ జంపింగ్, అండర్ వాటర్ డైవింగ్, ఐస్ స్కేటింగ్, రివర్ ర్యాఫ్టింగ్ వంటి సాహస క్రీడల అభిమాని అయితే ఆమె సంగీతం, కవిత్వం ఇష్టపడుతుంది. అయినా అతను తన కుటుంబ సభ్యులపై చూపే అప్యాయత, విలువలకిచ్చే ప్రాధాన్యం ఆమెను ఆకట్టుకుంటాయి.



ప్రేమ్‌కుమార్, సంజనాల అభిరుచులు పూర్తిగా కలుస్తాయి. వారికిష్టమైన కవిత కూడా ఒకటే- అదే 'కసమ్ కీ కసమ్ హై కసమ్ సే'. తమ కుటుంబ సభ్యుల ఎదుట సంజనా, ప్రేమ్‌కుమార్ పాడే పాట ఇది. ప్రేమ్ కిషన్ కూడా అక్కడే ఉంటాడు. సంజాకు అసలు విషయం తెలుసు ప్రేమ్ కుమార్, ప్రేమ్ కిషన్‌లకు తెలియదు. పల్లవి సంజనా పాడుతుంది

'ఒట్టు! ఒట్టు మీదే ఒట్టు
నాకు ప్రేమున్నది నీ మీదే
ఈ ప్రేమన్నది మరోసారి పుట్టదు'

ఒట్టు మీదే ఒట్టు వేసి ఆమె తన ప్రేమను చాటుతోంది. తను ప్రేమించినది ఒక్కరినేనని, మళ్ళీ మరొకరిని ప్రేమించటం తన వల్ల కాదని భావం. ఇంకా ఇలా అంటోంది-

'పిచ్చిదంటారు అంతా, నిజము, నాకే తెలియలేదు
మనసు పారేసుకున్నా, ఎవరి మాటా వినేది లేదు
శాంతి కోల్పోయి నేను అశాంతితో వేగుతున్నా!
నిదురే దూరమైనా నీ బాసలే నిలుపుకున్నా'

అతని ప్రేమలో పూర్తిగా మునిగిపోయానని, మనసు అర్పించానని, ఇంక ఎవరి మాటా విననని తెగేసి చెప్తోంది. మనశ్శాంతి కోల్పోయి నిదురే కరవైనా అతనికి ఇచ్చిన మాట నిలబెట్టుకుంటానని అంటూంది.

'ఒట్టు! ఒట్టు మీదే ఒట్టు
నేను బతికున్నది నీ వల్లే
ఈ ప్రేమన్నది మరోసారి పుట్టదు'

ఇదంతా విని ప్రేమ్‌కుమార్ ఆమెకు తనపై ప్రేమ ఉందని భావించి తన భావాలు చెబుతున్నాడు. ఇషారా అంటే సైగ, సంకేతం. యకీన్ అంటే నమ్మకం. మిలన్ అంటే కలయిక.

'చెప్పకుండానే నీవు చెప్పావు నాకో మాట

ఐతే నీకు కూడా ఏదో అయిందన్నమాట
ఎందుకో నిన్ను చూస్తే మదిలో ఏవో తలపులు
ఆపేను నేను రేగే ఆ తలపుల తుఫానులు
ఒట్టు! ఒట్టు మీదే ఒట్టు
ఇది ప్రేమసీ ప్రియుల కలయిక
ఈ ప్రేమన్నది మరోసారి పుట్టదు.'



సంకేతాలతో ఆమె తన ప్రేమను చెప్పిందని అతను భావించాడు. ఆమెలో కూడా ప్రేమ భావాలు ఉన్నాయనే నమ్మకం కుదిరింది అతనికి. మదిలో రేగే తుఫానులను ఆపేందుకు ప్రయత్నిస్తున్నాడు.

ఈ చిత్రంలోని పాటలు దేవ్ కోహ్లీ వ్రాశారు. 'చలీ ఆయీ' పాట చిత్ర, కె.కె. పాడారు. తొలిప్రేమ ప్రభావాన్ని, ప్రియుని ప్రేమకు తలవొగ్గే భావాన్ని చక్కగా పలికించారు. 'సంజనా ఐ లవ్ యూ' పాట చిత్ర, సునిధి చౌహాన్, కె.కె. పాడారు. యువతను ఆకట్టుకునే వేలెంటైన్స్ డే పాట ఇది. 'బనీ బనీ' అంటూ చిత్ర పాడిన పాట ప్రేమలో మైమరచిపోయిన అమ్మాయి పాడే నృత్యగీతం. ఢంకా బజాయించి చెప్పినట్టుండే ఈ పాటకు ఢంకాలతో, జానపద వాయిద్యాలతో చక్కని ఆర్కెస్ట్రా అమరింది. చిత్ర గొంతులో హుషారుగా పలికిందీ పాట. 'జయం'లోని 'బండి బండి' పాటను తలపించే లైన్ 'బనీ బనీ బనీరె బనీ','ఓ అజ్‌నబీ' పాట రెండు వెర్షన్లలో ప్రేమలోని ఆనందాన్ని, విరహంలోని బాధను ఆవిష్కరించి తన ప్రత్యేకత చాటుకున్నారు అనూ మలిక్. 'భట్‌కే పంఛీ' అనే సంప్రదాయ భజన్‌ను సరదాగా మలిచారు. 'లడ్‌కా యే కెహతా హై' కె.కె. పాడిన మెలొడీ పాట. తెలుగులో 'ఆకాశవీథిలో' చిత్రంలోని 'వెన్నెల్లో ఆడపిల్ల నీవైతే' పాట గుర్తు వస్తుంది. 'పాపాకీ పరీ' పాట నేటి తరాన్ని ఉర్రూతలూగించే పాట. సునిధి చౌహాన్ పాడారు. 'ఔర్ మొహబ్బత్ హై' పాట ప్రేమంటే తెలియని వ్యక్తికి ప్రేమ రుచి తెలిసినపుడు ఎలా ఉంటుందో తెలిపేలా ఉంది. అందమైన పాట ఇది. ఈ ఆడియో సరెగమ హెచ్. ఎమ్.వి. ద్వారా విడుదలయింది.

**-పి.వి.సత్యనారాయణ రాజు**

# గ్రెగరీ పెక్ - సురైయా - దేవ్ ఆనంద్

గతమాసం మరణించిన ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు గ్రెగరీపెక్ ఆంధ్రదేశంలో కూడా విజయదుందుభి మోగించిన 'మెకన్నాస్ గోల్డ్', 'ది గన్స్ ఆఫ్ నవరోన్', 'రోమన్ హాలిడే' 'ఓమెన్' చిత్రాలలో నాయకపాత్రద్వారా మనకూ పరిచితుడు. అయితే అతను, బాలీవుడ్ గాయకనటి సురైయా ఒకరికొకరు అభిమానులని చాలామందికి తెలియకపోవచ్చు.

1943లో తన 27 వ యేట 'డేస్ ఆఫ్ గ్లోరీ' ద్వారా తెరకెక్కిన గ్రెగరీపెక్ ఇండివిడ్యువాలిటీ కల నటుడు. అప్పట్లో స్టూడియోలదే డామినేషన్. పెద్ద పెద్ద స్టార్సుందర్నీ కాంట్రాక్టులలో ఇరికించి స్టూడియోవారు రాజ్యమేలేవారు. సినిమా సక్సెయినా, ఫెయిలయినా నెలజీతం వచ్చిపడుతుంది కదాని నటీనటులు కాంట్రాక్టులవైపే మొగ్గు చూపేవారు. కానీ ఆత్మవిశ్వాసం మెండుగాగల గ్రెగరీ ఫ్రీ లాన్సర్‌గానే ఉన్నాడు. ఇది మోస్ట్ పవర్‌ఫుల్ స్టూడియో, ఎమ్.జి.ఎమ్. అధినేత లూయీ మేయర్‌కు ఆగ్రహం కలిగించినా ఇతను లెక్కచేయలేదు.



"ది కీస్ ఆఫ్ కింగ్‌డమ్" (1945), "స్పెల్ బౌండ్" (1945) "జెంటిల్‌మన్స్ ఎగ్రిమెంట్" (1947), మోబీడిక్ (1956). "టు కిల్ ఎ మాకింగ్ బర్డ్" (1962) వంటి చిత్రాల ద్వారా ప్రపంచం యావత్తూ అభిమానులను సంపాదించుకున్న గ్రెగరీకి 1929లో పుట్టిన సురైయా కూడా అభిమాని కావడంలో ఆశ్చర్యమేముంది?

దేవ్ ఆనంద్‌కు, గ్రెగరీపెక్‌కు పోలికలున్నాయన్న విషయం సర్వవిదితం. సురైయా దేవ్ అంటే ఇష్టపడడానికి కారణం - అతనికీ, గ్రెగరీకి గల పోలికలేనని అంటారు. (పోలికలున్నా గ్రెగరీకున్న వాయిస్ దేవ్‌కి లేదని సురైయా అంటుంది) కానీ దేవ్ హైందవుడు కావడం వల్ల సురైయా నాయనమ్మ వివాహానికి సమ్మతించలేదు. సురైయా అవివాహితగానే మిగిలిపోయింది.

మన ఇండియన్ స్టార్స్ హాలీవుడ్ వారిని అభిమానించడంలో విశేషం లేదు. కానీ గ్రెగరీ కూడా సురైయా అభిమానే! ఓ సారి గ్రెగరీ ఇండియా వచ్చినప్పుడు సురైయాను కలిశాడు. 1977లో ఒక పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో సురైయా ఇలా చెప్పింది - "అవేళ రాత్రి 11.30 అయింది. అప్పుడే నడుం వాల్చేను. ఇంతలో మా నాన్నవచ్చి 'గ్రెగరీపెక్ వచ్చి నీకోసం వెయిట్ చేస్తున్నాడు" అని చెప్పాడు. నేను అంతకుముందే ఎప్పుడో శల్వార్, కమీజ్‌లో ఫోటో ఒకటి అతనికి పంపివున్నాను. ఫ్రాంక్ కాప్రా ద్వారా అతను నాగురించి విన్నాడు కూడా. అప్పట్లో అల్‌నసీర్ అనే టాప్‌హీరో మా ఫ్యామిలీఫ్రెండ్. ఆయన చెప్పబట్టి గ్రెగరీ మా ఇంటికి వచ్చాడు. ఆశ్చర్యపడుతూనే డ్రాయింగ్‌రూమ్‌లోకి తొంగిచూశాను - నా ఆల్ టైమ్ ఫేవరేట్ యాక్టర్..నా కోసం..వెయిటింగ్..



వెంటనే రూములోకి పరిగెట్టుకుని వెళ్లి కాస్త మేకప్ పులిమేసుకుని వెళ్లి కలిశాను. "యూ హార్డ్‌లీ లుక్ ఎ స్టార్. సో ఛైల్డ్‌లైక్" అన్నాడు నన్ను చూస్తూనే. సో ఛామింగ్, సో నైస్. మర్నాడు ఓ ఫంక్షన్‌లో మళ్లీ కలిశాం. ఆ తర్వాత ఏడాదిదాకా ఉత్తరప్రత్యుత్తరాలు సాగించాము."

సురైయా, గ్రెగరీ పెక్‌ల సాన్నిహిత్యం బాంబే జనాలకు మింగుడు పడలేదు. అంతర్జాతీయస్థాయి గల నటుడు ఒక హిందీ స్టార్‌కు ఇంత ప్రాధాన్యత ఇవ్వడమా? అని ఆశ్చర్యపడి, అసూయపడ్డారు. వారిద్దరూ బాంబేకు దగ్గరలో ఉన్న ఖండాలాలోని ఇంట్లో కొద్దికాలం గడిపారన్న వదంతికూడా పుట్టింది.

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**



# తెలుగు సినీ గీతకోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 857 | అహో బలియే నా గతి | నాగ మోహిని | | ఎమ్.రంగారావు | శ్రీశ్రీ | సుశీల |
| 858 | చిరు నవ్వులొలికించె చిన్నారి చిట్టిపాప | నాగ మోహిని | | ఎమ్.రంగారావు | శ్రీశ్రీ | వి. రామం, బృందం |
| 859 | కామధేనువా లోకమందే | నాగ మోహిని | | ఎమ్.రంగారావు | శ్రీశ్రీ | సుశీల |
| 860 | నయన ములోకేసరి పాడేయనా | నాగ మోహిని | | ఎమ్.రంగారావు | శ్రీశ్రీ | జమునా, కోరస్ |
| 861 | ఓ మనుష్య లోకైక సతీమతల్లి | నాగ మోహిని | | ఎమ్.రంగారావు | శ్రీశ్రీ | పి.బి.శ్రీనివాస్ |
| 862 | ప్రణయామృతాల రాతిరే | నాగ మోహిని | | ఎమ్.రంగారావు | శ్రీశ్రీ | సుశీల |
| 863 | శోక జగతినే చరించవలెనా | నాగ మోహిని | | ఎమ్.రంగారావు | శ్రీశ్రీ | సుశీల |
| 864 | ఇది కల కాదే | నాగ మోహిని | | ఎమ్.రంగారావు | శ్రీశ్రీ | సుశీల |
| 865 | అలు మగలు పొందు అందమో ఆనందం | నమ్మినబంటు | 1960 | వేణు | కొసరాజు | సుశీల, స్వర్ణలత, టి.వి.రత్నం |
| 866 | అందాల బొమ్మ నా అందాల బొమ్మ | నమ్మినబంటు | 1960 | వేణు | కొసరాజు | జిక్కి, మాధవపెద్ది |
| 867 | చెంగు చెంగునా గంతులు వేయండి | నమ్మినబంటు | 1960 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | సుశీల |
| 868 | జవ్వాది గుమాయించు గోల్కొండ జవ్వాది | నమ్మినబంటు | 1960 | వేణు | కొసరాజు | మాధవపెద్ది, పి.లీల |
| 869 | నాజుకు తెచ్చు టోపి నాతోటె వచ్చు టోపి | నమ్మినబంటు | 1960 | వేణు | కొసరాజు | మాధవపెద్ది |
| 870 | పొగరబోతు పోట్ల గిత్తరా | నమ్మినబంటు | 1960 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | ఘంటసాల |
| 871 | రైతు మేడి పట్టి సాగాలిరా | నమ్మినబంటు | 1960 | వేణు | కొసరాజు | సుశీల, ఘంటసాల |
| 872 | ఎంత మంచి వాడవురా | నమ్మినబంటు | 1960 | వేణు | కొసరాజు | ఘంటసాల, సుశీల |
| 873 | తెల తెల వారెను లేవండమ్మా | నమ్మినబంటు | 1960 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | జిక్కి, కోరస్ |
| 874 | మన్నించుమా ప్రియా | నా పేరే భగవాన్ | 1976 | చక్రవర్తి | సి.నారాయణరెడ్డి | పి.సుశీల |
| 875 | నిన్న నీవు నీవు కావు | నా పేరే భగవాన్ | 1976 | చక్రవర్తి | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 876 | నిను మధుశాల రమ్మన్నది | నా పేరే భగవాన్ | 1976 | చక్రవర్తి | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 877 | పూవుల రెమ్మ మురిపాల గుమ్మ | నా పేరే భగవాన్ | 1976 | చక్రవర్తి | సి.నారాయణరెడ్డి | సుశీల, ఎస్.పి.బాలు |
| 878 | ఎంత బాగుంటుందీ పడుచుపిల్ల | నా పేరే భగవాన్ | 1976 | చక్రవర్తి | సి.నారాయణరెడ్డి | సుశీల, ఎస్.పి.బాలు |
| 879 | చిన్నవాడ వన్నెకాడ | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 880 | మదన సామ్రాజ్యమందు | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | వద్దాది | సుశీల |
| 881 | నలభైకి దెబ్బయికి తేడా ఎంత | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | ఆత్రేయ | ఘంటసాల, పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 882 | నీలాల కన్నుల్లో మెల్ల మెల్లగా | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | ఆత్రేయ | సుశీల |
| 883 | నిరుపేద కనుల నెమరేసే కలలు | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | ఆత్రేయ | సుశీల |
| 884 | పట్టు పొన్నునా (పద్యం) | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | వద్దాది | పిఠాపురం |
| 885 | రథము సిద్ధము (పద్యం) | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | వద్దాది | పిఠాపురం |
| 886 | రాయుడా నా రాయుడా | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | ఆత్రేయ | పిఠాపురం, బృందం |
| 887 | వేళ చూడ వెన్నెలాయె | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | ఆత్రేయ | సుశీల |
| 888 | వింటిని మీ మృదోక్తులను (పద్యం) | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | వద్దాది | సుశీల |
| 889 | ఇదేనా నేనెదురు చూసిన ప్రజాస్వామ్యం | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | ఆత్రేయ | ఘంటసాల, సుశీల, కోరస్ |
| 890 | ఇదే జీవితమురా | నాటకాల రాయుడు | 1969 | జి.కె.వెంకటేష్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు |
| 891 | చెప్పలేనిది చెపుతున్నా | ఒక దీపం వెలిగింది | 1976 | ఎస్.రాజేశ్వరరావు | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 892 | గళ్ళ చీర కట్టిందిరా | ఒక దీపం వెలిగింది | 1976 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | సుశీల |
| 893 | తెలిసిందా మన దెబ్బ | ఒక దీపం వెలిగింది | 1976 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | ఎస్.పి.బాలు |
| 894 | ఎక్కడి వాడమ్మ | ఒక దీపం వెలిగింది | 1976 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | సుశీల, రమేష్, ఆనంద్ |
| 895 | అందరికి ఒక్కడే దేవుడు | ఒకే కుటుంబం | 1970 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | ఘంటసాల |
| 896 | అవునే తానే నిన్నేనే | ఒకే కుటుంబం | 1970 | ఎస్.పి.కోదండపాణి | దేవులపల్లి | సుశీల |
| 897 | బాధలలోనే పయనించి | ఒకే కుటుంబం | 1970 | ఎస్.పి.కోదండపాణి | శ్రీశ్రీ | ఘంటసాల |
| 898 | కావాలి తోడు కావాలి | ఒకే కుటుంబం | 1970 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | ఎస్.పి.బాలు, సుశీల |
| 899 | మంచిని మరచి | ఒకే కుటుంబం | 1970 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | ఘంటసాల |
| 900 | శిల్పాలు శిథిలమైనా | ఒకే కుటుంబం | 1970 | ఎస్.పి.కోదండపాణి | దాసరి | ఘంటసాల |
| 901 | వోటున్న బాబులారా | ఒకే కుటుంబం | 1970 | ఎస్.పి.కోదండపాణి | కొసరాజు | ఎస్.పి.బాలు, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 902 | గుడ్ నైట్ వెరీ గుడ్ నైట్ | ఒకే రక్తం | 1977 | సత్యం | ఆరుద్ర | సుశీల, రామకృష్ణ |
| 903 | కాటుక కన్నుల అమ్మాయి | ఒకే రక్తం | 1977 | సత్యం | దాశరథి | ఎస్.పి.బాలు |
| 904 | రమ్మనగానే వస్తా | ఒకే రక్తం | 1977 | సత్యం | దాశరథి | ఎస్.జానకి |
| 905 | తాకితే కందిపోతానోయి | ఒకే రక్తం | 1977 | సత్యం | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 906 | లోకం చీకటిలో | పదండి ముందుకు | 1962 | ఎస్.పి.కోదండపాణి | జగ్గయ్య | రఫీ |
| 907 | మనసిచ్చిన నచ్చిన చిన్నవాడ | పదండి ముందుకు | 1962 | ఎస్.పి.కోదండపాణి | ఆరుద్ర | ఎస్.జానకి |
| 908 | మనసు మంచిది వయసు చెడ్డది | పదండి ముందుకు | 1962 | ఎస్.పి.కోదండపాణి | ఆత్రేయ | ఘంటసాల, సుశీల |
| 909 | మేలుకో సాగిపో | పదండి ముందుకు | 1962 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | ఘంటసాల, మాధవపెద్ది |




| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 910 | పదండి ముందుకు పదండి తోసుకు | పదండి ముందుకు | 1962 | ఎస్.పి.కోదండపాణి | శ్రీశ్రీ | ఘంటసాల, మాధవపెద్ది, కోమల |
| 911 | తమాషా దేఖో తస్సాదియ్యా | పదండి ముందుకు | 1962 | ఎస్.పి.కోదండపాణి | ఆరుద్ర | పిఠాపురం |
| 912 | ఇన్నాళ్ళు లేని వేగిరపాటు | పదండి ముందుకు | 1962 | ఎస్.పి.కోదండపాణి | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 913 | అమ్మానాన్న లేని దేవుడు | పల్లెసీమ | 1977 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు, బృందం |
| 914 | భజన చేసుకుందాం | పల్లెసీమ | 1977 | కె.వి.మహదేవన్ | అప్పలాచార్య | ఎమ్.రమేష్, రఘురాం |
| 915 | హలో కాస్త అల్లరి చేస్తానాగండి | పల్లెసీమ | 1977 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | సుశీల |
| 916 | మా ఊరికి | పల్లెసీమ | 1977 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 917 | సూరట్టుకు జారతాది | పల్లెసీమ | 1977 | కె.వి.మహదేవన్ | జాలాది | సుశీల |
| 918 | వీణతో నా గొంతు | పల్లెసీమ | 1977 | కె.వి.మహదేవన్ | మోదుకూరి జాన్సన్ | సుశీల |
| 919 | హే బావయ్య పిలక బావయ్య | పల్లెటూరి బావ | 1973 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 920 | మురిపించే గువ్వలారా | పల్లెటూరి బావ | 1973 | టి.చలపతిరావు | ఆరుద్ర | ఘంటసాల, కోరస్ |
| 921 | ఒసే వయ్యారి రంగీ | పల్లెటూరి బావ | 1973 | టి.చలపతిరావు | ఆత్రేయ | రామకృష్ణ |
| 922 | ఒసే వయ్యారి రంగీ | పల్లెటూరి బావ | 1973 | టి.చలపతిరావు | ఆత్రేయ | ఘంటసాల |
| 923 | శరభా శరభా | పల్లెటూరి బావ | 1973 | టి.చలపతిరావు | కొసరాజు | ఎస్.పి.బాలు |
| 924 | తెలివి ఒక్కడి సొమ్మంటే | పల్లెటూరి బావ | 1973 | టి.చలపతిరావు | కొసరాజు | జయదేవ్, శరావతి |
| 925 | ఎటు చూసినా అందమె | పల్లెటూరి బావ | 1973 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | సుశీల, బృందం |
| 926 | అమ్మమ్మా ఇక తగ్గవోయి | పంచ కళ్యాణి దొంగలరాణి | 1969 | ఎ.ఎ.రాజ్ | అనిసెట్టి | ఎస్.పి.బాలు, సుశీల |
| 927 | కథ కదలదేను ఎదలో వ్యథ | పంచ కళ్యాణి దొంగలరాణి | 1969 | ఎ.ఎ.రాజ్ | జంధ్యాల పాపయ్యశాస్త్రి | ఎస్.పి.బాలు, మాధవపెద్ది, వసంత |
| 928 | మనసు వయసు నీదే | పంచ కళ్యాణి దొంగలరాణి | 1969 | ఎ.ఎ.రాజ్ | సి.కె.రాజు | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 929 | తీపి తీపి కల్లోయ్ రాజా | పంచ కళ్యాణి దొంగలరాణి | 1969 | ఎ.ఎ.రాజ్ | కొసరాజు | సుశీల |
| 930 | ఉదయించిన సూర్యునిలా | పంచ కళ్యాణి దొంగలరాణి | 1969 | ఎ.ఎ.రాజ్ | ఏల్చూరి | సుశీల |
| 931 | బాబు వినరా అన్నదమ్ముల కథ ఒకటి | పండంటి కాపురం | 1972 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | ఘంటసాల |
| 932 | మనసా కవ్వించకే నన్నిలా | పండంటి కాపురం | 1972 | ఎస్.పి.కోదండపాణి | గోపి | సుశీల |
| 933 | ఇదిగో దేవుడు చేసిన బొమ్మ | పండంటి కాపురం | 1972 | ఎస్.పి.కోదండపాణి | గోపి | కోదండపాణి, సుశీల |
| 934 | చిరునవ్వు వెల ఎంత | పగపట్టిన పడుచు | 1971 | ఎమ్.రంగారావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 935 | నీకోసమే నిలిచెను | పగపట్టిన పడుచు | 1971 | ఎమ్.రంగారావు | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 936 | నిషాలో వున్నానని | పగపట్టిన పడుచు | 1971 | ఎమ్.రంగారావు | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 937 | ఏవో మౌన రాగాలు | పగపట్టిన పడుచు | 1971 | ఎమ్.రంగారావు | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 938 | అలుకమైబ్రహ్మయ్యనాయుడు | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | మాధవపెద్ది, భానుమతి |
| 939 | అమ్మా బంగారు తల్లి (పద్యం) | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | మల్లాది | సుశీల |
| 940 | అంటరాని తనంపు టదుసులో (పద్యం) | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | ఘంటసాల |
| 941 | అరయ నాడు పెద్దపులివై (పద్యం) | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | ఘంటసాల |
| 942 | బుగ్గి అయినది నాదు (పద్యం) | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | సుశీల |
| 943 | గర్భ శత్రువు కాని | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | ఘంటసాల |
| 944 | జయ శంభో శివ శంకరా | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | మల్లాది | పి.భానుమతి |
| 945 | కూతురి పుస్తెదెంచితివి (పద్యం) | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | ఘంటసాల |
| 946 | కులగోత్రములు మంట గలిపితిని (పద్యం) | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | పి. భానుమతి |
| 947 | మగువ సిగ్గిడి కత్తిపట్టి (పద్యం) | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | బసవలింగ దేవర | పి.భానుమతి |
| 948 | నా తలగొట్టి తెత్తునని | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | మాధవపెద్ది |
| 949 | ఒక మేఘం వచ్చింది | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | దాశరథి | సుశీల, ఎస్.జానకి |
| 950 | పడవైతున్ నరసింహనాయుడి | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | బాలమురళి |
| 951 | పలనాడీతని తాతదా (పద్యం) | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | సదాశివబ్రహ్మం | పి.భానుమతి |
| 952 | పుట్టింపగలవు (పద్యం) | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | ఘంటసాల |
| 953 | రమ్మంటే రావేమిరా | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | •సుశీల |
| 954 | రతి రాజ సుందర రణరంగ ధీర | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | మల్లాది | సుశీల |
| 955 | రతిచేత రాచిలక రతనాల మొలకా | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | మల్లాది | బాలమురళీకృష్ణ |
| 956 | శాతవాహన తెలుగు చక్రవర్తుల | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | పులుపుల శివయ్య | బి.గోపాలం |
| 957 | శీలము గలవారి చిన్నవాడ | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | మల్లాది | బాలమురళీకృష్ణ, సుశీల |
| 958 | తీయని తొలిరేయి | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్, ఎస్.జానకి |
| 959 | వచ్చితిని రాయబారినై | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | జాషువా | మాధవపెద్ది |
| 960 | వెలుగొచ్చెనే లేత వెలుగొచ్చెనే | పల్నాటి యుద్ధం | 1966 | ఎస్.రాజేశ్వరరావు | మల్లాది | స్వర్ణలత, బి. వసంత |

**సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.**

వచ్చే సంచికలో మరికొన్ని



# కొమ్మ కొమ్మకో సన్నాయి...



## పాటల కడలి మాటల జలధి...

# సముద్రాల

ఆంధ్ర చలనచిత్ర సాహిత్యం సప్త సముద్రాలై సుడులు తిరిగి శ్రీమాన్ సముద్రాల వేంకటరాఘవాచార్యుల రూపంలో అవతరించి శతవర్షాలు పూర్తి అయ్యాయి. ఈ శతజయంతి సుకృతికీ రససిద్ధ కవీశ్వరుడికీ అక్షరాంజలి ఘటిస్తూ కొన్ని నలుపు తెలుపుల జ్ఞాపకాల క్రీనీడలతో ఆయన సాహితీ స్మృతికి నివాళి అర్పిస్తున్నాను.

మూడు దశాబ్దాల సుదీర్ఘ సాహితీ వ్రతంలో మూడు పొద్దులా సరస్వతీ గాయత్రికి సంధ్యావందనం క్రమం తప్పకుండా ఆచరించిన నైష్ఠికులు సముద్రాల వారు. ఒకే రోజున పొద్దున మధ్యాహ్నం సాయంత్రం మూడు వేరువేరు చిత్రాలకు కథ, సంభాషణలు, గీతాలు రాస్తూ మరొకవైపు కథా చర్చలు కూడా జరిపిన శతావధాని ఆయన. ఇంతటి నిర్విరామ సాహితీ జీవితానికి ఊపిరి సంస్కృతం, తెలుగు, తమిళ భాషలలో ఆయనకు గల కూలంకష పాండిత్యం. గురుదేవులు శ్రీ విశ్వనాథవారు తమ అవిశ్రాంత సాహితీ జీవితంలో కావ్యాలు, నవలలు, వ్యాసాలు ఆశువుగా శ్రీ పేరాల భరత శర్మ గారికి డిక్టేట్ చేయడం చూసి ఆ ధారణకు, ప్రతిభకు నివ్వెరపోయిన నేను మళ్లీ అటువంటి వ్యక్తిని సముద్రాల గారినే చూశాను. ఎందరు నిర్మాతలు, దర్శకులు, నటులు ఆయన లేఖిని కోసం తపస్సు చేసేవారో! ఆలస్యం, దీర్ఘసూత్రతా అనే దోషాలకు పాల్పడని మహా రచయిత ఆయన. తెలుగు చిత్ర పరిశ్రమ వికాసం కోసం ఆయన చేసిన విశేష పరిశ్రమకు చిహ్నాలే అనేక చిత్రాలు.



తెలుగు సినీ సాహితికే అంకితమై అకుంఠిత దీక్షతో అనర్ఘ గీతికా రత్నాలను, సంభాషణా సంపదను మనకందించిన సముద్రాల గారు ఈనాటి రచయితలకు ఆదర్శప్రాయులు, మార్గదర్శకులు. దివిసీమలోని టేకుపల్లి గ్రామీణులు ఆ వూరికి చెందిన ఘంటసాల గారి విగ్రహాన్ని అక్కడ ప్రతిష్ఠించుకున్నారు. అలాగే ఈ శతజయంతి సందర్భాన సముద్రాల గారి విగ్రహాన్ని పెదపులివర్రు గ్రామంలో నెలకొల్పుకొనడం సముచితంగా వుంటుంది. అలాగే ఆయన గేయ సాహితిపై సమగ్ర తులనాత్మక పరిశీలనా గ్రంథం వెలువడవలసి వుంది.

శివకేశవుల ఏకత్వాన్ని ఆదిశంకరులనుంచీ తిక్కన మహాకవి వరకు అందరూ కీర్తించారు. హరిహరుల అద్వైతాన్ని వాక్కు ,అర్థము అన్నాడు కవికుల గురువు కాళిదాసు.(పార్వతీప రమేశ్వరౌ) తిరుపతి వేంకటకవులు, కొప్పరపు కవులు ఎంత అభేద కవితా స్వరూపులో మన సాహితీ చరిత్ర చెబుతుంది. అటువంటి అపురూపమైన భావనంబంధం, అవినాభావసంబంధం పూజ్యులు శ్రీ సముద్రాల రాఘవాచార్యుల వారిదీ, శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి గారిదీ- దేహాత్మల వంటిది వారి సాహితీ స్వరూపం.

కృష్ణానదికి బందరు, దివిసీమలు ఒకవైపు, తెనాలి, రేపల్లె తాలూకాలు మరోవైపు ఉన్నాయి. ఈ ప్రాంతాలమధ్య సంబంధ బాంధవ్యాలను కృష్ణానది వేరుచేయలేదు సరికదా పెంచిపోషించింది. బందరును ఆనుకుని వున్న చిట్టిగూడురు శ్రీ మల్లాది రామకృష్ణుల జన్మస్థలం. కృష్ణకు అద్దరినే వున్న రేపల్లె తాలూకాలో పెదపులివర్రు శ్రీ సముద్రాల రాఘవాచార్యుల స్వగ్రామం. రెండూ ఉద్దండ వేద వేదాంగ సంగీత సాహిత్యాలకు పుట్టినిళ్లే- అచట పుట్టిన చిగురుకొమ్మయినచేవ అన్నట్లు మల్లాది, సముద్రాల సాహితీ జీవితాలు నిరూపించాయి. భావ సంస్కారం, ఊహాసౌందర్యం, సృజనాత్మకత వీరిద్దరినీ మహారచయితల కోవలో నిలబెట్టాయి.

సముద్రాలవారిది అసంఖ్యాక, అవిశ్రాంత చిత్ర రచనావ్యాసంగమైతే మల్లాది వారిది ఎంపికచేసుకున్న ఏ కొద్ది చిత్రాలకో రచన చేయడంతో పాటు తెలుగు కథా, నవలా, గీతరచనా రంగంలో ధ్రువతారగా వెలిగిన గురుపీఠం.

సముద్రాలవారి పెదపులివర్రుకు చేరువలో వున్న వెల్లటూరు కళలకు కాణాచి, వేదాశ్రమం. దర్శక శ్రేష్ఠుడు శ్రీ కె.విశ్వనాథ్‌గారి జన్మస్థలం, ఘంటసాల గారి అత్తవారివూరు కూడా పెదపులివర్రు గ్రామమే.

ఇక మల్లాదివారి విద్యార్థి జీవితం పై కళాసముద్రం, సంస్కృతీ నిలయం అయిన బందరు నగర ప్రభావం ఎంతగానో వుండేది. ఆయన ఆంగ్లభాషా వాఙ్మయ సమగ్ర పాండితికేమి తేటతెలుగుతనపు మాట వరసకేమి బందరు జీవితం పునాది వేసింది. ఎటుచూస్తే అటు కవులు, పండితులు, అధ్యాపకులు, ఆచార్యులు, వేదవేదాంగ వేత్తలు- ఇందరిమధ్య బందరు జీవితాన్ని పూర్తిగా తీర్చిదిద్దుకున్నవారు మల్లాది వారు.

సముద్రాల వారికి మల్లాది వారికి నాగయ్యగారి 'పోతన' చిత్రానికి ముందునుంచే సినిమా సంబంధం ఏర్పడివుండాలి. అప్పటికి తెలుగు సినిమాకు సముద్రాల గారే కవి. ఆయన తరువాత ఆ రంగంలో ప్రవేశించినవారు రామకృష్ణశాస్త్రిగారు.

'పోతన' సినిమాలో తానే పోతనగా ఆయన పక్షాన సముద్రాల రాసిన పాటలు అజరామరాలు. 'వేదాంత వధూ హృదయ విహారా వేదమయా పరమానందరూపా పావనగుణరామా హరే రామాహరే' అన్న పాట ఆనాడు ఆంధ్రదేశాన్ని భక్తిలోను జ్ఞాన వైరాగ్యాలలోను ముంచెత్తింది. 'యోగివేమన' లో **'అందాలు చిందేటి నా జ్యోతి', 'ఇంతేనా ఈ జీవితమింతేనా'** మొదలైన పాటలు వేమన పాటలు రాస్తే యిలా వుంటాయేమో అన్న స్థాయిలో నిలిచిపోయాయి.

ఒక 'చక్రపాణి రంగనాథుణ్ణి'గురించి విన్నదీ పుట్టపర్తి నారాయణాచార్యుల ద్వారా కన్నదీ 'వైష్ణవుని శివకీర్తన' అన్నది సముద్రాల గారిలో అత్యున్నత స్థాయిలో కానవస్తుంది. అనేక చిత్రాలలో ముఖ్యంగా 'భూకైలాస్' (ఎవియం) తెనాలి రామకృష్ణ వగైరాలలో ఆచార్యుల వారి శివకవిత అమృతతుల్యం.

**'దేవదేవ ధవళాచల మందిర గంగాధర హర నమోనమో**
**దైవతలోక సుధాంబుధి హిమకర లోక శుభంకర నమోనమో'**

వంటి పాటలు మరుపురాని మధురగీతాలు. అలాగే పార్వతిని గూర్చి వారు రాసిన గీతాలూను.

ఒకసారి ముళ్ళపూడి వెంకటరమణగారు సముద్రాల వారిని 'గురువుగారూ వైన్ అండ్ వుమెన్'కి తెలుగు ఏమిటండీ' అని అడిగారట- 'ఏముందీ మదిరా మదవతీనీ' అంటూ ఆకు చిలక నోట్లో వేసుకున్నారట. ఆయన నిలువెల్లా కవిత్వమే, సమయస్ఫూర్తితో కూడిన సాహిత్యమే అనడానికి ఇదొక చిన్న ఉదాహరణ మాత్రమే.

దాదాపు అన్ని చిత్రాలకు మాటలు పాటలు సముద్రాలగారు రాస్తున్న కాలంలో అలవోకగా రాసిందల్లా పాటగా, మాటగా చెలామణీ అవుతున్న రోజుల్లో 'మరీ పల్చబడి పోతోంది' అని వ్యాఖ్యానించిన వారితో 'మంది ఎక్కువైతే పల్చబడదూ' అన్నారట సముద్రాల. అప్పుడు శ్రీశ్రీ ఉవాచ 'సముద్రాలగారి పాటలు ఉప్పగా వుంటాయి.. ఒకప్పుడు గొప్పగానే వుండేవి'. కుమారుడు రామానుజం (సముద్రాల జూనియర్) చేతికి అందివచ్చిన తరువాత మరీ ముఖ్యమైనవి అయితేనే సముద్రాలగారు

రంగంలో దిగేవారు.

దేవదాసు, రేచుక్క, విప్రనారాయణ, బ్రతుకుతెరువు, దొంగరాముడు వంటి పలు చిత్రాలలో సముద్రాల పేరిట వెలువడిన అనేక గీతాలు రాసిన నేపథ్య రచయిత మల్లాదిగారు. పరస్పర ప్రేమాభిమాన గౌరవాల కారణంగా ఇది జరిగేది. జరిగినప్పుడల్లా ఎవరి శైలీ సంతకం వారిదే గనుక యిట్టే తెలిసిపోయేది. కుడి ఎడమైతే, జగమే మాయ (దేవదాసు) చిగురాకులలో చిలకమ్మా (దొంగరాముడు) రవ్వలాంటి దాన్ని మల్లె పువ్వులాంటి దాన్ని (రేచుక్క) మొరలాలించవే లాలించవే, ఎందుకోయీ తోటమాలీ అంతులేని యాతన (విప్రనారాయణ) అందమె ఆనందం (బ్రతుకుతెరువు) వంటి గీతాలు సముద్రాల అనే త్రివేణిలో అంతర్వర్తిని అయిన మల్లాది వారి సరస్వతీ ప్రవాహాలే!

సముద్రాలవారు ఆశ్రిత జన రత్నాకరులు- ఆయన్ని ఆలంబనంగా చేసుకుని ఎందరో చిత్రసీమలో అడుగుపెట్టి అగ్రగణ్యులైనారు. అమర గాయకుడు ఘంటసాల అందుకు నిదర్శనం. అలాగే అధ్యాపకత్వం పడక, ఇతర పరిస్థితులు సరిపడక మల్లాదివారు మద్రాసు చేరినప్పుడు చేయూత నిచ్చిందీ సముద్రాల గారే!

'పాండవ వనవాసం' వంటి పౌరాణిక చిత్రాలలో సముద్రాల తన విశ్వరూపం చూపించారు. **'విధివంచితులై విభవము వీడి అన్నమాట కోసం అయ్యో అడవి పాలయేరా'** వంటి నేపథ్య గీతం, 'హిమగిరి సొగసులు' వంటి పాటల నుంచి దుర్యోధనుడి స్వగతాల వరకు ఎంతో నాటకీయత, భాషా రమణీయత కనిపిస్తుంది. అప్పటికీ పింగళివారి 'నవీనగుణ సనాథత్వం' పౌరాణికాల్లో ప్రజాబాహుళ్యాన్ని ఆకట్టుకుంది. కొత్త భాష పుట్టించడాలు, సరికొత్త పరిభాషా పదకోశాన్ని కల్పిత పాత్రల కోసం సృష్టించడాలు (మాయాబజార్) వీరతాళ్లు, అలం అలం, హలాలు నోటి తెలుగుగా మారిపోయాయి. సముద్రాల వారిపై మబ్బుచాటు మూగ ఎండగా పింగళి వారి ముద్ర కొంత పడింది 'పాండవ వనవాసం'చిత్రంలో-ముఖ్యంగా దుష్ట చతుష్టయం సంభాషణల విషయంలో. 'తెనాలి రామకృష్ణ' చిత్రంలో శ్రోత్రియ భాషను, అందులో వైష్ణవ పరిభాషను ఆయన **'అన్నీన్నీ కూడాన్నున్నూ'** లతో వంగర ముక్కామల పాత్రల ద్వారా పలికించిన తీరు అద్వితీయం.



భరణీవారి 'బాటసారి' చిత్రంలో మిత సంభాషణలు అమితార్థ ప్రతి పాదకాలుగా సముద్రాల గారు రాశారు. 'దేవదాసు' చిత్రంలో సంభాషణలు ఎంత పొదుపైనవో అంత నిగూఢమైనవి. అలాగే

**'ఓ బాటసారీ నను మరువకోయి**
**మజిలీ ఎటైనా మనుమా సుఖాన'** పాటవిన్నా
**'కనులకుదోచి నోటికందని ఎండమావులున్నయ్**
**సోయగముండి సుఖము నోచని బ్రతుకులున్నవి కొన్ని**
**బ్రతుకంతా పలు ప్రశ్నల మయమై బ్రతుకును జన సముదాయం**
**బదులు కోసమై వెదకుటమాని బ్రతుకుటయే న్యాయం'**పాట వింటున్నా

ఒక నూరేళ్లకు సరిపడా లాలి పాట పాడిన తల్లిలా కనిపిస్తుంది సముద్రాల గేయ సాహితీ సరస్వతి.

ఆంధ్రుల అభిమాన చిత్రనిర్మాణ సంస్థ వాహినీలో సముద్రాల గారి కవితావాహిని సంఘసంస్కరణోన్ముఖమై దేవత, సుమంగళి వంటి చిత్రాలను శాశ్వత నిధులుగా మనకు మిగిల్చింది. 'సుమంగళి' చిత్రంలో నాగయ్యగారు అభినయిస్తూ పాడే 'బాలా! బాలా నీకు పసుపు కుంకుమ జన్మహక్కు కాదా' వంటి పాటలు వితంతు పునర్వివాహాలకు నాందీగీతాలనవచ్చు. జనంలోకి చొచ్చుకుపోగల జనప్రియ సాహితిని సినిమాకి తెచ్చిన మహనీయులు సముద్రాలగారు. **'వస్తాడే మా బావ రేపో మాపో వస్తాడే బీయే పాసై వస్తాడే' 'మా వదిన సుకుమారీ వదిన మంగళకర్త వదిన'** వంటి పాటలు ఆధునికి ప్రజాసాహితిగా ఆనాడు కీర్తింపబడ్డాయి. 'చండీరాణి' చిత్రంలో **'కిల కిల నవ్వుల కురిసేవే వెన్నెల'**, **'ఎవరాలకింతురు నా మొర'** లైలామజ్నూలో **'విరితావుల లీలా మన్నా జాలిన హాయిగా నీవే నేనుగా'**, **'నినుబాసి పోవుదునా గొనుమా సలాముళైక్'**- ఇవన్నీ సముద్రాల కవితా కెరటాలుగా జన హృదయాలలో ఉప్పొంగిన పాటలు. ఇవి ఆపాతమధురాలు.

సముద్రాలగారు సవ్యసాచిగా మాటలు పాటలు రాస్తున్న రోజుల్లో 'వినాయకచవితి' చిత్రానికి దర్శకత్వం వహించి ఆ చిత్రాన్ని ఎంతో జనరంజకంగా చిత్రీకరించారు. ఎన్.టి.ఆర్. కృష్ణుడుగా కనిపించిన తొలిచిత్రాలలో ఆ చిత్రం ఒకటి. ఎన్.ఎ.టి. సంస్థకు పూర్వ చిత్రాలన్నిటికీ ఎన్.టి.ఆర్ నటించిన అనేక ఇతర చిత్రాలకు రచయిత సముద్రాలగారే. 'శ్రీరామ పాదుకా పట్టాభిషేకం' స్క్రిప్టును ముద్దుగా స్వహస్తాలతో పూర్తిగా కాపీ రాసి బైండు చేయించి 'మా సముద్రాలగారు అద్భుతంగా రాశారు' అని మురిసిపోతూ రామారావుగారు అందరికీ చూపించడం కన్నులకు కట్టినట్టు ఇప్పటికీ కనిపిస్తుంది.

సముద్రాలగారు మూడు దశాబ్దాలు దాదాపు ఏకైక రచయితగా సినీ రంగాన్ని ప్రభావితం చేశారు. ఉబ్బసం వ్యాధితో బాధపడుతూ వృద్ధాప్యం కూడా దాపురించినా చేతికి అందివచ్చిన కుమారుడు శ్రీ రామానుజం (సముద్రాల జూనియర్) తోడ్పాటుతో రచనా వ్యాసంగం కొనసాగిస్తూనే వచ్చారు. ఆయన చేసిన అఖండసేవకు సినీ పరిశ్రమ సన్మానం తలపెట్టగా అటువంటి ప్రమేయం పెట్టుకోవద్దని తన భుక్తికి తాను రచయితనయినానని వినమ్రంగా చెప్పి వారించిన జ్ఞానవృద్ధులు ఆయన. మద్రాసు వాణిమహల్‌లో వేదాంతకవి అనే ఒక కవికి సన్మానం జరిగినప్పుడు ఇక తెలుగు సాహిత్యానికి సినీ నిర్మాతలే మహారాజ పోషకులు కాగలరని నిరంకుశ కవులు కూడా సినీరంగాన్ని ఆశ్రయించక తప్పదని ఆయన చెప్పినమాట అక్షరాల నిజమైంది. శ్రీశ్రీ, దేవులపల్లి వంటి కవులు సినీ రంగంలో విశేష కావ్యగానం చేస్తూ శేషజీవితాన్ని గడిపినవారే. పునః పునః రామాయణ భారతాలు రాసిన కవుల్లో ఆయనే అగ్రగణ్యులయ్యేవారు.

శ్రీ దైతా గోపాలం గారి సక్కుబాయి పాటలు ఆనాడు రంగస్థలం మీద అమరగీతాలుగా వెలుగొందాయి. అవే బాణీలలో సక్కుబాయి చిత్రం కోసం 1958లో గోపాలం గారి సాహిత్యాన్ని యధాతథంగా కొద్ది క్రియా పదాలు మినహా తిరగరాసినప్పుడు, రచన సముద్రాల అని పడినప్పుడు, ఆయన నిరసనల వెల్లువను ఎదుర్కొన్నారు. కొందరు ప్రమాదో ధీమతామపీ అని సరిపెట్టుకున్నారు. వీటినిబట్టి సముద్రాల వంటి రచయితలు కూడా సమస్యల వలలో చిక్కుకుని విమర్శకు పాత్రులయినారో తెలుసుకోవచ్చు.

తన జీవితకాలమంతా చిత్రకళామతల్లికి పూజాకుసుమంగా అర్పించి అసంఖ్యాకంగా మాటలు పాటలు రాసి ధన్యులైన సముద్రాల శతజయంతికి నివాళిగా, వెలుగునీడల దర్పణంగా ఈ చిరుత రచన సంభావింపబడితే నాకు చాలు- సముద్రాల కవితా పాండితీ సరస్వతికివే నా శతసహస్ర నమోవాకాలు.

**-వేటూరి సుందరరామ్మూర్తి**

# అలా నాకు కంప్లీట్ తృప్తిని ఇచ్చిన యాక్టర్లు ఇద్దరే



- బాపు



**జులై 19న రాజేంద్రప్రసాద్ పుట్టినరోజుని పురస్కరించుకుని బాపు గారితో 'హాసం' జరిపిన ఇష్టాగోష్ఠి ఇది**

❑ **రాజేంద్రప్రసాద్‌ని ఫస్టుటైమ్ మీరు 'స్నేహం' సినిమాలో పరిచయం చేసినప్పుడు ఆయనలో ఇంత గొప్ప నటుడు ఉన్నాడని మీ ఊహకు తట్టిందాండీ?**

✦ ఇంత టాలెంట్ ఉంటుందని తెలియలేదు. చూడగానే మంచి స్పార్క్ కనబడుతోంది. మంచి ఉషారుగా ఉన్నాడు. ఇప్పుడు ఈ రేంజి వస్తాడని అప్పుడు ఎలా చెప్పగలను.

❑ **అలా ఎప్పుడూ చెప్పలేమండి. కాకపోతే 'ఇతనిలో ఏదో ఉంది' అని అనిపించడానికి ఏదో ఓ కారణం ఉండాలిగా....!?**

✦ అతనిలో ఉన్న ఇండివిడ్యుయాలిటి, కొత్తదనం... అదేంటంటే నా బట్టలు నేను వేసుకురాగలను అన్నాడు. అంత వరకే నాకు గుర్తు. రోజుకో ఫ్యాషన్ డ్రెస్ వేసుకొచ్చేవాడు.

❑ **ఆయన ఒక రేంజ్‌కు వచ్చి ఆ రేంజ్‌కి తగ్గ క్యారెక్టర్స్ చేస్తున్నప్పుడు - డిఫరెంట్‌గా పెళ్ళిపుస్తకం, మిస్టర్‌పెళ్ళాం ఆయన చేత మీరు చేయించారు. అలా చేయించాలి అని మీకు తట్టినప్పుడు ఆయన మీకు అందుబాటులో ఉంటాడనుకున్నారా? మీరు అనుకున్నట్టు ఆయన ఎలా మౌల్డ్ అయ్యారు?**

✦ అతనికి టాలెంట్ ఉంది కదా. అది మామూలు టాలెంట్ కాదు ఎక్స్‌ట్రార్డినరీ టాలెంట్. ఆ టాలెంట్‌తోటి ఏదైనా చేయగలడు అతను. రమణగారు స్క్రిప్టు రాశారు. ఇతన్ని బట్టి స్క్రిప్టు రాసుకోలేదండి. కథను బట్టి రాశారు. దానికి ఆటోమేటిక్‌గా అడాప్ట్ అయిపోతాడు అతను. అయ్యాడు కూడాను. పిక్చర్ చూస్తే మీకే తెలుస్తుంది ఎంత అద్భుతంగా చేశాడో ఆయన.

❑ **ఎక్స్‌ట్రార్డినరీ టాలెంట్ అన్నారు కదా... కొంచెం వివరంగా చెప్తారా?**

✦ అంటే మనం అనుకున్నదానికంటే, ఊహించిన దానికంటే కొంచెం ఎక్కువ చేసే వారుంటారు. అలా నాకున్న పరిధిలో నాకు ఫస్టు టైం తట్టింది రావుగోపాలరావుగారు. ఆ తర్వాత మళ్ళీ రాజేంద్రప్రసాద్‌గారు. ఇద్దరికిద్దరూ చాలా తెలివైనవారు.

❑ **అంటే... మీరు చెప్పినదాన్ని బాగా ఇంప్రొవైజ్ చేసేవారా?**

✦ చెప్పింది చెప్పినట్టు అర్థం చేసుకుని ఇంకా అందంగా చేసేవారు. కొత్తకొత్తవన్నీ పెట్టేవారు. ఏ డైరెక్టర్‌కైనా ఇలాంటి మంచి యాక్టర్స్ దొరికారంటే చాలా అద్భుతంగా ఉంటుంది. నాకు కంప్లీట్ తృప్తిని ఇచ్చిన యాక్టర్స్.... చాలామంది మంచివాళ్ళు దొరికారు అందులో ముఖ్యంగా వీళ్ళిద్దరూ.. రావుగోపాలరావు, రాజేంద్రప్రసాద్.

❑ **'పెళ్ళిపుస్తకం'లో రాజేంద్రప్రసాద్‌కి ఒక మ్యానరిజమ్‌లాంటి నవ్వు పెట్టారు... దాని గురించి చెప్తారా?**

✦ అతను ఎప్పుడూ ఏవో సరదాగా కబుర్లు చెపుతూనే ఉండేవాడు. అవి రమణగారు, నేను వినేవాళ్ళం. ఇప్పుడు ఏ.వి.యస్‌గారు చూడండి అనదర్ ఎక్స్‌ట్రార్డినరీ యాక్టర్. మా ఫ్రెండ్ ఎన్.సి.ఎల్.రాజు గారి సిమెంట్ కంపెనీకి 'నవ్వితే నవ్వండి' అనే స్క్రిప్టు చేశాం. అప్పుడు బెజవాడ నుంచి ఆంధ్రజ్యోతిలో పనిచేసే ఏవీయస్ గారిని తీసుకొచ్చారు. మొత్తం ఎనభయ్యో ఎన్నో జోక్స్ ఉన్నాయనుకోండి. ఈయనకేమో ఓ పది జోక్స్, ఇంకొకరికి పది జోక్స్ అని, అలా రాసుకున్నాం. ఏవియస్‌గారి టాలెంట్ చూసి ఆల్‌మోస్ట్ 80% ఆయనకే ఇచ్చాం. అలాగ ఎప్పుడూ సరదాగా కబుర్లు చెప్తున్నప్పుడు ఏవో ఐటమ్స్ చేస్తూనేవుంటారు వీళ్ళు - చాలా తెలివైనవాళ్ళు గనుక! అవి రమణగారు నేను విన్న తర్వాత రమణగారు స్క్రిప్టు తయారు చేసుకొనేటప్పుడు ఇన్‌కార్పోరేట్ చేశారు. ఆన్ ది స్పాట్ ఏదన్నా ఇంప్రొవైజ్ చేయాల్సినప్పుడు వచ్చి' ఏమండీ అప్పుడు చెప్పారు అది బాగుంది కదా అలా చేయండి ఇలా చేయండి' అని గుర్తు చేస్తే రాజేంద్ర ప్రసాద్ చాలా చక్కగా కలిపేవారు. ఆ నవ్వు అలా వచ్చిందే.

❑ **రాంబంటులో డిఫరెంట్ గెటప్ ఆయన మీద ప్లాన్ చేశారు ఆయనే ప్రొడ్యూసర్ అని తెలిసి కూడా?**

✦ అతను ప్రొడ్యూసర్ అయి కథలు చెప్పమంటే... ఓ కథ చెప్పారు రమణగారు. ఆ కథ బాగా నచ్చింది ఆయనకి. అంచేత నేచురల్‌గా ఆ గెటప్‌లో వచ్చారన్నమాట.

❑ మరి 'మిస్టర్‌పెళ్ళాం' లో వెంకటేశ్వరస్వామి గెటప్...?

✦ హీ ఈజ్ ఏ మల్టి-ఫేసెటెడ్ యాక్టర్. కథలో అలా వచ్చింది... చక్కగా కుదిరాడు కూడా.

❑ **అంటే.. మీరు చిత్రకారులు కనుక ఈ ఫేసు దేవుడి ఫేసులా.... ఉంటుందని ఏమైనా అనిపించిందా?**

✦ ముందర కన్సీవ్ చేసుకునేది ఏమీ వుండదు. ఇపుడు ఈ వేషానికి ఇది బాగుంటుంది అని ట్రై చేస్తాం బాగులేకపోతే తీసివేస్తాం. ప్రత్యేకంగా ఆలోచన అంటూ ఏమి ఉండదు. మనం తీసేవి మామూలు కాలక్షేపం సినిమాలే కదా. క్లాసిక్స్ ఏమీ కావు. అందుకోసం అంత డీప్‌గా ఆలోచించడం అవి ఏమీ వుండవు.

❑ **ఆయన ఇంప్రవైజ్ చేస్తాడు, బాగా చేస్తాడు అని మీరు డిఫరెంట్‌గా ప్లాన్ చేసిన, లేదా ఫీలయిన సీన్...?**

✦ మెయిన్ రమణగారే కదా స్క్రిప్టు రాసేది! స్క్రిప్టు మాత్రం క్యారెక్టర్‌ని దృష్టిలో పెట్టుకునే రాస్తారాయన. రాజేంద్రప్రసాద్ అనగానే నేచురల్లీ ఇంకేవో చమత్కారాలు తగిలిస్తారు అవన్నీ గుర్తు లేవు... పది సంవత్సరాలు అయింది కదా. రమణగారు మొత్తం విజువలైజ్ చేసి రాస్తారు. యాక్టింగ్ కూడా విజువలైజ్ చేసి రాస్తారాయన. రాజేంద్రప్రసాద్ చేస్తున్నాడంటే ఆయన్ని దృష్టిలో పెట్టుకుని రాస్తారు... ఇలా అంటాడు ఇలా చూస్తాడు అలా నవ్వుతాడు అని.

❑ **కానీ రచయిత రాయని కొన్ని మూమెంట్స్ ఉంటాయి కదండి. ఉదాహరణకు 'అమ్ముకుట్టి' పాటలో రేలంగిగారిలా రాజేంద్రప్రసాద్‌తో నడిపించడం...?**

✦ అవన్నీ రాజేంద్రప్రసాద్ సరదాగా ఉన్నప్పుడు చేసి చూపించేవారు. ఆయన ఇవన్నీ చేయగలడని - ఇక్కడ అవి ఉంటే బావుంటుందని - అనుకున్నప్పుడు సజెస్ట్ చేస్తాం - ఏవండి ఇక్కడ అది ఒకటి ఉంటే బాగుంటుందా అని. అప్పుడు చేస్తాడన్నమాట ఆయన.

❑ **కొన్ని కాస్ట్యూమ్స్ కూడా డిఫరెంట్‌గా ఆయన మీద ప్లాన్‌చేశారు ఉదాహరణకి 'మిస్టర్‌పెళ్ళాం' లో చాలా సీన్స్‌లో ఆయనికి బనీన్ వేసేసి, లుంగీ కట్టేసి...?**

✦ అక్కడ బనీన్ వేసుకోవాలని ఉంటే బనీనే వేసుకుంటాడు రాజేంద్రప్రసాద్. 'నేను హీరోని... తెల్లటి చొక్కా వేసుకుంటాను' అని అనే మనిషికాదు అయన. తెలివితేటలు ఉన్నాయి కనుక నేచురల్‌గా ఏది బాగుంటే అది చేస్తాడు. అదే కదా ఆయన గొప్పతనం. అందుకే అంత నేచురల్‌గా వచ్చాయి. మిస్టర్ పెళ్ళాం లో పిల్లలందరిని మేనేజ్ చేయడం, ఆయన కొట్టుకోవడం చూడడం మళ్ళీ నవ్వేయడం అంత



కరెక్టుగా చేయడం అయనకే చెల్లింది అది. ఆయనే చేయగలడు. ఎంతో తెలివి తేటలు ఉంటేనే కానీ అవి రావు. హి ఈజ్ వెరీ టాలెంటెడ్. విశ్వనాథ్ గారు లాంటి మహానుభావుడు పెళ్ళిపుస్తకం చూసి "బాగా చేస్తాడండీ రాజేంద్రప్రసాదూ...!?" అని అన్నారు. అంటే అంతకుముందు బాగా చేయలేదని కాదు. రేలంగి నరసింహారావుగారి పిక్చర్స్ చూసి ఎంతో ఎంజాయ్ చేసేవాళ్ళం. కానీ విశ్వనాథ్‌గారు అంటే గ్రేట్ కాంప్లిమెంట్ కదా.

❑ **రాజేంద్రప్రసాద్ గురించి మీ పర్సనల్‌గా హ్యాపీగా ఫీలయిన విషయాలు?**

✦ హ్యాపీ త్రూ అవుట్ విత్ హిమ్.

❑ **మీ పట్ల ఎలా ఉండేవారాయన?**

✦ హీ ఈజ్ ఆల్వేస్ నైస్. చాలా గౌరవం, ప్రేమ మేమిద్దరమంటే.... (ఆలోచనలోకి వెళ్ళిపోతూ) రాజేంద్రప్రసాద్ ఎంత చక్కగా చేస్తాడంటే ఇట్స్ డిలైటెడ్ అన్నమాట. 'పెళ్ళిపుస్తకం' లో ఆవకాయ వేసుకునే సీను వోన్లీ హీ కెన్ డూ దట్ ... డైరెక్టర్ ఎప్పుడూ కళ్ళాలు పట్టుకొని ఉన్నా ఆర్టిస్ట్‌లో బేసిక్ టాలెంట్ లేకపోతే ఏమీ చేయలేడు. బేసిక్ అంటే అర్థం చేసుకోవడం. ఆ క్యారెక్టర్ కి... ఆ పర్టిక్యులర్ సిట్యుయేషన్‌ని... దాంట్లో ఉన్న సొగసుని... అర్థం చేసుకోగల కెపాసిటి వస్తే ఆటోమేటిక్‌గా ఆ యాక్షన్ వచ్చేస్తుంది. అది ఈయనకుందన్నమాట. మంచి సజెషన్ ఇవ్వగలిగే ఇంటల్‌జెన్స్ కూడా ఉంది. పెళ్లిపుస్తకంలో హీరోయిన్ కొట్టబోతుంది... "అలాకొడితే బాగుండదండి.... క్యారెక్టర్‌ని చూడండి... పెద్ద హీరోను కొడుతుంది అని నేను అనట్లేదు... క్యారెక్టర్ ముఖ్యం మనకి. హీరో పట్టుకుని ఆపితే బాగుంటుంది. లేకపోతే ఇంత మంచి క్యారెక్టర్ దెబ్బతింటుంది కొంచెం ఆలోచించండి" అన్నాడు. హి ఈజ్ కరెక్ట్. అంత లోతుగా ఆలోచించే తెలివితేటలున్నాయి. ఆయన చెప్పినట్టు చేశాం అన్నది కాదు ప్రశ్న. 'ఎంత బాగా చెప్పాడు... ఇతను కరెక్టు' అని అనిపించింది. కొన్ని కొన్ని క్యారెక్టర్స్ ఉంటాయండి మనకు తెలియదండి ఈ పర్టిక్యులర్ క్యారెక్టర్ ఆయనేస్తే బాగుంటుంది అని అంటే ఇమేజ్ ఉండబట్టే కదా... సూర్యకాంతంగారిని సౌమ్యంగా చూపించలేం కదా అలా అన్నమాట.

చక్రపాణిగారి ఫేమస్ జోక్ ఒకటుండేది రేలంగిగారు వెళ్ళి 'మీ పిక్చర్స్ అన్నిట్లోనూ వేశాను ఈ పిక్చర్‌లో నాకు వేషం ఇవ్వలేదు ఎందుకు' అని అడిగారట. 'నీకు దాంట్లో క్యారెక్టర్ లేదయ్యా' అని అన్నారంట చక్రపాణిగారు. 'మరి రమణారెడ్డికి ఇచ్చారే' అని అంటే... 'వాడు విలనూ' అని అన్నారాయన. 'నేనూ విలన్ వేస్తానే' అని అన్నారట రేలంగి... 'నువ్వు విలన్ వేస్తావ్ మరి జనం చూడొద్దూ' అన్నారట చక్రపాణిగారు. అందుకనే ఇమేజి కూడా చూసుకోవాలి. ఇతనికి అంత ఇంటలిజెన్స్ ఉందన్నమాట. ఇట్ వాజ్ ఏ ప్లెజర్ వర్కింగ్ విత్ హిమ్. ఎప్పుడూ ఏదో ఓ జోక్ చెప్తూనే ఉంటాడు. వేలకొద్దిగా ఉంటాయండి ఆయన జోక్స్. ఎప్పుడూ ఎవరినో ఒకరిని ఇమిటేట్ చేస్తూనే ఉంటాడు. వుయ్ ఆర్ వెరీ ఫార్చ్యునేట్ టు వర్క్ విత్ హిమ్. ◆







విడుదల : సుప్రీమ్
వెల : రూ.38/-

సీతారామయ్య గారి మనవరాలు, అన్నమయ్య వంటి చిత్రాలను నిర్మించిన వి.దొరస్వామిరాజు సమర్పణలో ఆయన కుమారుడు విజయ్‌కుమార్ వర్మ - ఎన్.టి.ఆర్., భూమిక, అంకిత కాంబినేషన్‌లో నిర్మించిన 'సింహాద్రి' ఆడియో క్యాసెట్ విడుదలైంది. ఈ చిత్రానికి యస్.యస్.రాజమౌళి దర్శకుడు కాగా ఎం.ఎం.కీరవాణి సంగీత దర్శకుడు.

క్యాసెట్‌లో తొలి గీతాన్ని వేటూరి రాశారు. 'చీమ చీమ' అంటూ లీడ్ తీసుకునే ఈ పాటను యస్.పి.చరణ్, గంగ పాడేరు. ఈ పాటకు ముందు 'కస్తూరి రంగ రంగ' అనే సంప్రదాయ గీతానికి పేరడీగా ఓ నాలుగు లైన్ల సాకీ ఆనంద భైరవి రాగంలో వుంటుంది. ఆ సాకీని హాస్యనటుడు బ్రహ్మానందం ఆలపించారు. చీమ తీపి చిరునామా ప్రేమ/పొగరానిది సెగవున్నది సొగసొక్కటే కదా అనే వాక్యాల్లో వేటూరి మార్కు కనబడే ఈ పాట - ట్యూన్ వరంగా, ఆర్కెస్ట్రయిజేషన్ వరంగా ఎంత ఆకట్టుకుంటుందో గాయనీ గాయకులు పాడే పద్ధతి వల్ల కూడా అంతగానూ ఆకట్టుకుంటుంది. సీతారామశాస్త్రి రాసిన 'అమ్మైనా నాన్నైనా ఎవరైనా ఉండుంటే పై నుంచి ఈ వాన ఇట్టా దూకేనా' అనే పాటను కళ్యాణి మాలిక్ పాడేరు. ఈయన కీరవాణి సోదరుడని, 'ఐతే' చిత్రానికి సంగీత దర్శకుడని 'హాసం' పాఠకులకు ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. క్యాసెట్ ఇన్‌లే కవర్‌పై ఆయన పేరుని చూడకపోతే ఉన్నికృష్ణన్ పాడేడనుకుని భ్రమించే అవకాశం కూడా ఉంది. కంఠంలోనే కాకుండా పాడే విధానంలో అంతగా స్ఫురింపచేశారాయన్ని ఈయన! సాహిత్య పరంగా పల్లవి చూస్తే- అయితే అమ్మానాన్న లేకపోతేనే బావుంటుందంటారా? అనే వ్యతిరేక భావనతో రచయిత పట్ల రియాక్ట్ అయ్యే ప్రమాదం ఉంది. కానీ కథ ప్రకారం - మతి భ్రమించిన ఓ అమ్మాయికి తనకు అమ్మా నాన్న లేకపోవడానికి గల కారణాలు తెలియకుండా ఉండటానికి బుజ్జగిస్తూ పాడే పాట అని తెలుసుకుని మొదటి చరణంలోని లైన్‌లను చూస్తే రచయిత పట్ల గౌరవభావం పెరుగుతుంది. కిమ్మనక, కొమ్మెనక(కొమ్మ వెనక) వంటి కాయినింగ్స్ చాలా బావున్నాయనిపించే ఈ పాట పల్లవికి జతచేసిన ట్యూన్ విషయంలో కొంచెం ఫ్లాష్ బ్యాక్‌కి వెళితే లోగడ 'కిష్కిందకాండ' సినిమా కోసం కీరవాణి చేసిన 'గుజరాతి సరదాల పంజాబి పరువాల పెనవేసి వలవేసె చిలకో చిలకా' అనే పాట ట్యూన్‌ని యథాతథంగా వాడుకున్నారని గుర్తొస్తుంది.

యస్.పి.చరణ్, చిత్ర పాడిన 'చిరాకు అనుకో పరాకు అనుకో' పాటలోని సంగీతానికి, సాహిత్యానికి సెపరేట్ సెపరేట్‌గా మార్కులు ఇవ్వక తప్పదు. 'కో' అనే అక్షరంతో చంద్రబోస్ చేసిన విన్యాసాలు ఒక ఎత్తయితే చమత్కారాల విజృంభణ ఇంకో ఎత్తు. శృంగారానికి పరాకాష్టగా పేర్కొనాల్సిన ఓ చోట 'కిచ్‌కిచ్‌కో' అని కిసుక్కున నవ్విస్తూనే 'సకాల సుఖాల షికారు చేస్కో' అంటూ వేటూరిని తలపింప చేశాడాయన. ఇక ట్యూన్ పరంగా చూస్తే పల్లవిలో **REDNEX** అనే పాప్ అల్బమ్‌లోని **Cotton eye joe** పాట ట్యూన్‌ని వాడుకున్నారు. నాలుగు నిముషాల పధ్నాలుగు (4.14) సెకండ్ల పాటు సాగే ఆ పాట నుంచి తొమ్మిదినుండి పదమూడు (9 **to** 13) సెకండ్ల బిట్‌ని మాత్రమే వాడుకుని దానికి మనదైన సొగసులద్ది పాటను తయారు చేశారు. ఈ పాటకు మ్యూజిక్ విశ్వనాథ్ అని ఇన్‌లే కవర్ (పైన స్టార్ గుర్తుపెట్టి) లోపలిభాగంలో ముద్రించారు. కొన్ని క్రెడిట్స్‌ని తీసుకోకపోవటం కూడా క్రెడిట్టే.

చంద్రబోస్ రాయగా కీరవాణి, సునీత పాడిన 'నన్నెదో సెయ్యమాకు' పాట వెంలోడి ఓరియెంటెడ్‌గా సాగే మంచి పాట. సామరాగం ఈ పాటకు ఆధారం. 'మిన్నమ్మ'లోని 'బృందావనమిది అందరిది' పాట చివరి ఇంటర్లూడ్‌ని ఈ పాటలో రెండవ చరణానికి ముందు వచ్చే ఇంటర్లూడ్‌గా వాడుకోవడం -విలువలు తెలిసిన తమాషా ప్రయోగం.

వెన్నెలకంటి రాయగా మనో, శ్రేయ గోషల్ పాడిన ' చిన్నదమ్మే చీకులు కావాలా చీకులమ్మే చిన్నది కావాలా' పాటలోని సాహిత్యం కొంచెం శృతిమించిందనే చెప్పాలి. అంతకన్నా ఎక్కువగా పేర్కొనటం అనవసరం.

'సింగమలై' అనే లీడ్‌తో సాగిన పాటను కళ్యాణి మాలిక్,బృందం పాడేరు.ఈ పాటలో కళ్యాణి మాలిక్ కంఠం 'సీతయ్య' సినిమాలో 'ఆ విక్రమస్ఫూర్తి' అంటూ కీరవాణి స్టయిల్‌ని గుర్తుచేస్తూ డిఫరెంట్‌గా సాగింది. ఎదలో హిమవంతుడై ఎదిగే హనుమంతుడై లాంటి పదప్రయోగాలలోని సౌష్టవం వేటూరి ముద్రను స్పష్టంగా చూపిస్తుంది.

చంద్రబోస్ రాయగా టిప్పు, చిత్ర పాడిన 'నువ్ విజిలేస్తే ఆంధ్రా సోడా బుడ్డీ' పాట హిట్ సాంగ్ ఆఫ్ ది ఆడియో అండ్ ఫిల్మ్ కూడా! ఈ పాటలో సాహిత్య పరంగా శృంగారపు ఘాటు కొంచెం ఎక్కువగానే ఉన్నా చంద్రబోస్ చేసిన గిమ్మిక్కుల వలన కామెడీ లెవెల్లో సరదాగా అనిపిస్తుందే తప్ప ఆ ఘాటు నసాళానికి అంటదు.

టోటల్‌గా కీరవాణి అక్కౌంట్‌లో మరో హిట్ ఆడియో ఇది. ◆

## మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్

విడుదల : సరిగమ
వెల : రూ.55/-





వి.దొరస్వామి రాజు సమర్పించు
విజయమారుతి క్రియేటివ్స్
సింహాద్రి
వి.విజయ్‌కుమార్ వర్మ
యస్.యస్.రాజమౌళి
యమ్.యమ్.కీరవాణి
తారాగణం
ఎన్.టి.ఆర్, నాజర్, భానుచందర్ , కోట శ్రీనివాసరావు,
శరత్‌సక్సేనా, బ్రహ్మానందం, ముకేష్ ఋషి, రాహుల్‌దేవ్,
భూమిక, అంకిత, సంగీత, సీత
ప్రత్యేకపాత్రలో
రమ్యకృష్ణ

రచన: వేటూరి (1) గానం : ఎస్.పి.చరణ్, గంగ, బ్రహ్మానందం

ఆ : కస్తూరి భంగు భంగు...
కావేరి మింగు మింగు..
పిల్లతో పింగు పాంగు..
చిత్రాల చిందేసి సింగు సాంగు...
అ : జింగల్లో జింగ... దొరికింది దొంగ.. ముద్దే ఇవ్వంగ...
నీ మూతే బింగ.. కసుబుస్సె ఎస్టి పోవంగా..
చీమ.. చీమ.. చిమ.. చీమ.. చీమ..
చిమ.. చీమ.. చీమ.. చీమా..
చీమ తీపి చిరునామా ప్రేమా తెలుసుకోవే భామా.. ॥చీమ॥
ఆ : జింగల్లో జింగా.. టింగుల్లో రంగ.. అనిపిస్తా ఉంగ..
తీరుస్తా బెంగ.. హైలెస్సా తస్సాదియ్యంగా..
చీమ.. చీమ.. చిమ.. చీమ.. చీమ..
చిమ.. చీమ.. చీమ.. చీమా..
చీమ గారి విలునామా ప్రేమా.. రెచ్చిపోరా మామా.. ॥చీమ॥
ఆ : అల్లల్లల్లా.. అల్లల్లల్లా.. అల్లల్లల్లా.. అల్లల్లల్లా..
అ : వయసంతా హారతి ఇస్తే.. వయ్యారి గుళ్ళోకొస్తా..
ఓలమ్మీ ఈడే కోడై కొక్కొరొక్కో అంటే..
ఆ : అల్లల్లల్లా.. అల్లల్లల్లా.. అల్లల్లల్లా.. అల్లల్లల్లా..
అ : పొగరానిది సెగవున్నది సొగసొక్కటే కదా
ఆ : చెంగులు జారే చెడుగుడు గుళ్ళో
చెమటలు పోసే ఒడిదుడుకుల్లో
చెప్పక తప్పని తిప్పలు ఓరయ్యో.. ఓ... ఓ.. ఓ... ॥చీమ॥ ॥జింగల్లో॥
అ : అల్లల్లల్లా.. అల్లల్లల్లా.. అల్లల్లల్లా.. అల్లల్లల్లా..
ఆ : కుర్రాడు కన్నే కొట్టే కుర్రీడు నన్నే కుట్టే
చిర్రెత్తి చీరే తిడ్తే సిగ్గే పుడుతుంటే
అ : అల్లల్లల్లా.. అల్లల్లల్లా.. అల్లల్లల్లా.. అల్లల్లల్లా..
ఆ : ఎద కంటికి కథ కంచికి పొదరింటికే పదా..
అ : చలి చలి వణుకున దుప్పటి దిక్కు..
చాలని వయసున కుంపటి దిక్కు..
తిప్పలు తప్పని తంపటి లేవమ్మో.. ॥చీమ॥జింగ॥

రచన: సీతారామశాస్త్రి (2) గానం : కళ్యాణిమాలిక్

కో: గిరినీమె గలగాల గిరితీతి బైమారె
బియ్యాన దెకదేకో జురతీతి బైమా
అ : అమ్మైనా నాన్నైనా ఎవరైనా ఉండుంటే
పైనుంచి ఈవాన ఇట్టా దూకేనా...
చాల్లే అని ఎవరైనా ఆపుంటే ఎపుడైనా
సయ్యాట సాగేనా... ఎగసే కెరటాన..
అమ్మానాన్నా ఉంటే.. అమ్మో మా ఇబ్బందే...
కాస్తయినా అల్లరి చేసే వీల్లేదే ॥అమ్మైనా॥
అ : సూరీడుకి నాన్నుంటే స్కూల్లో పెడతానంటే
పగలైనా వెలుతురు వస్తుందా..
జాబిల్లికి అమ్ముంటే ఒళ్ళో జోకొడుతుంటే
రాతిరేళ వెన్నెల కాస్తుందా..
నిను చేరేనా.. నా లాలనా...
ఏనాటికైనా ఓ పసికూనా..
ఆడిందే ఆటంట.. పాడిందే పాటంట
ఆపేందుకు అమ్మానాన్నా లేరంట..
సరదాగ రోజంతా తిరగేనా ఊరంతా
ఊరేగే చిరుగాలికి ఉండుంటే అమ్మా
అలుపంటూ లేకుండా చెలరేగి ఉరికేనా..
ఉప్పొంగే సెలయేటికి ఉండుంటే నాన్న..
చ: అలిగిందా రా చిలకా.. కూచుందా కిమ్మనక..
నాతో మాటాడేదెవరింకా
రానందా నావంక.. దాగుందా కొమ్మెనకా..
అమ్మో మరి నాకేం దారింకా..
ఏది ఏది రానీ రానీ నన్నేరుకోనీ
ముత్యాలన్నీ నీ నవ్వే చాలంటూ
పులకించే నేలంతా పున్నాగ పువ్వులతోటయ్యేనంట..
కో: గిరినీమె గలగాల గిరితీతి బైమారె
బియ్యాన దెకదేకో జరతీతి బైమా


సింహాద్రి

జగలోక సుగుణాల పలుమారు సూడాలే
సరిపోలు జడివానా ఒదిగే ఈ గాలీ
అ : దిక్కుల్నే దాటాలి చుక్కల్నే తాకాలి..
ఆనందం అంచులు నేడే చూడాలి..
కో: ॥గిరినీమె॥

రచన: చంద్రబోస్ (3) గానం : యస్.పి.చరణ్, చిత్ర

ఆ : చిరాకు అనుకో పరాకు అనుకో
మరేమిటైనా అనుకో..
నీలో మాగాణ్ణి చూస్తే మరింతగా
మథించ బుద్దేస్తుందనుకో.. ॥చిరాకు॥
అ : సవాలు అనుకో శివాలు అనుకో
మరేమిటైనా అనుకో
నీలో తెగింపు చూస్తే మరింతగా
తెగించ బుద్దేస్తుందనుకో..
ఆ : గులాబి రేకో చలాకి బైకో
అడల్ట్ జోకో కరెంటు షాకో
మజాల కేకో మాగాడి లాకో
కుమారి షోకనుకో
అ : స్వరాల సింకో నరాల లింకో
వరాల ట్రంకో రసాల డ్రింకో
కులాస డుంకో పలాస డంకో
నువ్వంటే లైకనుకో
ఆ : జవాని కోకో.. ఇవ్వాళ దేఖో..
అ : జువాన మస్కో.. నాతోటి చేస్కో..
ఊ అంటే ఉస్కో.. రా అంటే రాస్కో..
నా ఇంట జాయింటు తలంటు పోస్కో.. ॥సవాలు॥చిరాకు॥
ఆ : ముడేసి ముట్కో... పడేసి పట్కో..
ఒళ్ళంతా చుట్కో.. కేరింత కొట్కో..
బలంగా అల్కో.. భలేగా గిల్కో..
అదేదో గెల్కెస్కో..
అ : అలాగే చెప్కో.. చులాగ్గా ఒప్కో..
కుచ్చీళ్ళు విప్కో.. కౌగిళ్ళు కప్కో..
కోరింది ఇచ్కో.. కొండంత పుచ్కో..
ఆపైన కిచ్‌కిచ్‌కో.. నీడోరు తీస్కో..
ఆ : నా నోరు మూస్కో..
అ : హే.. వచ్చాడు చూస్కో..
ఆ : డిగామ వాస్కో.. వయ్యారి పైనే సవారి వేస్కో..
సకాల సుఖాల షికారు చేస్కో.. ॥సవాలు॥చిరాకు॥

రచన: చంద్రబోస్ (4) గానం : టిప్పు, చిత్ర

ఆ : నువు విజిలేస్తే ఆంధ్రా సోడాబుడ్డీ..
నువు విజిలేస్తే ఆంధ్రా సోడాబుడ్డీ..
అది వినబడుతుంటే అలజడి రేగి
జారుతుంది మిడ్డీ..
అ : నీ అధరామృతం పుల్లారెడ్డీ..
నీ అధరామృతం పుల్లారెడ్డీ..
అరకేజీ అప్పుగా ఇస్తే కడతా వడ్డీ మీద వడ్డీ..
ఆ : నువు విజిలేస్తే ఆంధ్రా సోడాబుడ్డీ..
అ : నీ అధరామృతం పుల్లారెడ్డీ..
అ : కన్నెబాడి కాదమ్మో అది జీడిపప్పు జాడీ..
నిన్ను చూసి పట్టా తప్పే పడుచు రైలు గాడీ..
ఆ : ఎన్ని కోట్ల విలువుంటుందో నువ్వు కాల్చు బీడీ..
ఎప్పుడంకుల్ అవుతాడయ్యో నిన్ను కన్న డాడీ..
అ : వేస్తా బేడీ.. చేస్తా దాడి.. సొగసుల బావిని తోడి..
ఆ : రారా రౌడీ దాదా కేడీ రాత్రికి చూసెయ్ త్రీడి
నీ గుణ్ణం కోసం పెంచా నేనే..
నీ గుణ్ణం కోసం పెంచా నేనే వెచ్చనైన గడ్డీ ॥నీ అధ॥
ఆ : నువు విజిలేస్తే ఆంధ్రా సోడా బుడ్డీ..
అ : డ్డీ.. డ్డీ.. డ్డీ..
అ : కోక బ్యాంకు లాకర్లోనా దాచుకోకు వేడి..
చెక్కులిస్తే చిక్కొస్తుందే ఇచ్చుకోవే డీడీ..
ఆ : నువ్వు తాకకుంటే పువ్వు పోవునంట వాడి..
సుబ్బరంగా సుఖపడిపోరా దాన్ని నువ్వు వాడి..

అ: అరె పుంజుకు కోడి.. పంటకు పాడి..
: నువ్వూ నేనొక జోడీ..
ఆ: చింతల్‌పూడి చిలకల్‌పూడి పోదామా జతకూడి..
ఓరయ్యో నీది చెయ్యేకాదు..
అ: ఓయ్
ఆ: ఓరయ్యో నీది చెయ్యేకాదు..
విశాఖ ఉక్కు కడ్డీ ॥నువ్వు॥నీ అధ॥
ఆ: వేస్కో వేస్కో... విజిలేస్కో..

రచన: వెన్నెలకంటి **5** గానం: మనో, శ్రేయ గోషల్

ఆ: చిన్నదమ్మే చీకులు కావాలా నా సామిరంగా
చీకులమ్మే చిన్నది కావాలా.. ॥చిన్న॥
అ: గుమ్మలూరి పిల్ల నా సమ్మలోరికిల్లా
చెక్కేస్తే ఎల్లా చేస్తాను ఒళ్ళు గుల్లా
చిన్నదమ్మే చీకులు కావాలి నా సామిరంగా
చీకులమ్మే చిన్నది కావాలి.. ॥చిన్న॥
ఆ: ఆకులు కావాలా పోకలు కావాలా
సోకులు కావాలా పూత రేకులు కావాలా
ఆకులు పోకలు పూత సోకులు అన్నీ కావాలా
జున్నేకావాలా అన్నీ కావాలా లేత జున్నే కావాలా
లస్కు టపా లబ్బులు కావాలా
దానిమ్మలిచ్చే ఉస్కులపా ఊపులు కావాలా ॥లస్కు॥
అ: శింగరాయ కొండ నా చికాకోలు దండ..
ఇస్తా కలకండ కాయిస్తా చలి ఎండ
లస్కు టపా లబ్బులు కావాలి
ఈ గుమ్మ తెచ్చే ఉస్కులపా ఊపులు కావాలి
హే.. లస్కు టపా లబ్బులు కావాలి
ఈ గుమ్మ తెచ్చే ఉస్కులపా ఊపులు కావాలి
అ: షాకులు కావాలా షేకులు కావాలా
షోకులు కావాలా కిస్సు కేకులు కావాలా
షాకులు షేకులు చూపుల బాకులు మొత్తం కావాలా..

మొకే కావాలా మోజే కావాలా ప్రతిరోజూ కావాలా
తద్దినక తాకిడి కావాలా ఓ లంగరు లచ్చీ
లబ్బనక రాపిడి కావాలా
హే.. తద్దినక తాకిడి కావాలా ఓ లంగరు లచ్చీ
లబ్బనక రాపిడి కావాలా
ఆ: ఓసి అందగాడా అబ్బోసి షోకు మాడా
దూకుడంత చూడ కదిలింది కుర్రదూడ
తద్దినక తాకిడి కావాలి ఈ లంగరు లచ్చికి
లబ్బనక రాపిడి కావాలా
తక తక తక.. తద్దినక తాకిడి కావాలి
ఈ లంగరు లచ్చికి లబ్బనక రాపిడి కావాలి
అ: గుమ్మలూరి పిల్ల నా సమ్మలోరి కిల్లా
చెక్కేస్తే ఎలా చేస్తాను ఒళ్ళు గుల్లా
చిన్నదమ్మే చీకులు కావాలి నా సామిరంగా
చీకులమ్మే చిన్నది కావాలి..
చిన్నదమ్మే చీకులు కావాలి నా సామిరంగా
చీకులమ్మే చిన్నది కావాలి..
ఆ: లబ్బనక రాపిడి కావాలి.. లబ్బనక రాపిడి కావాలి..
లబ్బనక రాపిడి కావాలి..
అ: ఏహే.. ఏహే..

రచన: చంద్రబోస్ **6** గానం: యమ్.యమ్.కీరవాణి, సునీత

అ : నన్నేదో సెయ్యమాకు నడుముకాడ.. ఏయ్.. హాఁ..
ఏదేదో చెయ్యమాకు ఏటికాడ.. ఏయ్.. హాఁ..
ముద్దులెట్టి ముగ్గులో దించమాకు..
ముగ్గులోకి దించి నన్ను ముంచమాకు..
నేనింకా చిన్నదాన్నిరో..
అ : సోకేదో సెప్పమాకు.. సందెకాడ ఏయ్ ఓయ్
సోకంతా దాచుకోకు అడా ఈడా.. ఏయ్..
అడ్డమైన సిగ్గు నువ్వు సూపమాకు..
అడ్డుగోడ పెట్టి నన్ను ఆపమాకు..
అలవాటు చేసుకోవమ్మో..



ఆ : నన్నేదో సెయ్యమాకు నడుముకాడ..
ఆ : కందిచేనుకి షికారు కెళితే.. కందిరీగే నను కుడితే
ఆ : కందిచేనుకి షికారు కెళితే.. కందిరీగే నిన్ను కుడితే
ఆ : మంట నాలో మొదలవుతుంటే..
అ : మందు నేనే ఇస్తుంటే..
ఆ : పెదవి ఎంగిలి పై పైన పూస్తే
బాధ తగ్గి బాగుంది అంటూ హాయిగ కనులే మూస్తే
ఏదేదో చెయ్యమాకు అడ ఈడ హేయ్ హేఁ..
నన్నేదో చెయ్యమాకు అందగాడా.. ఏయ్ హేఁ
అ : అంతకంటే హాయి ఉంది వదులుకోకు..
ముందుకొచ్చి ముట్టుకుంటే ముడుచుకోకు..
అలవాటు చేసుకోవమ్మో..
అ : చింతపల్లి సంతకు వెళితే.. ఓ చింతపూల చీర కొంటే
ఆ : చింతపల్లి సంతకు వెళితే.. చింతపూల చీర కొంటే
అ : కట్టు నీకు కుదరకపోతే..
ఆ : నువ్వే సాయం చేస్తుంటే..
అ : చెంగు బొడ్లో దోపుతు ఉంటే
చెంగుమని నువ్వు ఉలిక్కి పడగానాలో ఉడుకే పుడితే..
సోకేదో చెప్పమాకు.. సందెకాడ.. ఏయ్.. హేఁ
షోకంతా దాచుకోకు.. కోక నీడ ఏయ్ ఏయ్
ఆ : పెళ్ళి చీర కట్టే దాకా రెచ్చిపోకు..
పెద్ద పెద్ద ఆటలేమి ఆడమాకు..
అలవాటు చేసుకోవయ్యో..
నన్నేదో చెయ్యమాకు..
నడుముకాడ.. ఏయ్.. హేఁ.. హేయ్

రచన: వేటూరి **7** గానం: కళ్యాణిమాలిక్, బృందం

అ : కత్తిఖోలిచ్చు ఉవెయాయూదిచ్చు చుట్టెరిచ్చిరావ్
సింగమలై సింగమలై
వందమురాయిరం సింగమలై
వందమురాయిరం సింగమలై
అంద్యమెరుక్కాన్ అంతగ శిరసిల్

చువడుగలే వెక్కుం సింగమలై
సింగమలై సింగమలై సింగమలై
సింగమలై సింగమలై
రగులుతున్న క్షాత్రంతో రక్తారుణ నేత్రంతో
ఎదలో హిమవంతుడై ఎదిగే హనుమంతుడై
ఉరికినాడు చూడరా ఉగ్రనారసింహుడు..
దనుజలోక దహనానికి జ్వాలా నరసింహుడు
ఆంధ్రుల సింహాద్రి నేడు కేరళలో సింగమలై..
సప్తగిరుల సాటివాడు చెదరని ఆశబరి మలై..
సింగమలై సింగమలై సింగమలై సింగమలై
అ : నా గుండెలు మండుతున్న నిరాశలో నిస్పృహలో..
ఆ నీచుల మహా నీచుల మాయా జాలపు గుహలో
కన్ను తెరచి చూసినా వెన్ను విరిచి లేచినా
నవ్వినా నడచినా నరోదయం నరోదయం
ఏ రుణమో ఈ అరుణం ఎన్నడు చేసినపుణ్యం
ఈ అరణ్య పర్వంలో అతను మాకు శరణ్యం
ఆ మనస్సు మా ఉషస్సు అతని మాట మా ధనుస్సు
అతని ప్రణయ గర్జనలే అభాగ్యులకు ఆశిస్సు
ఆంధ్రుల సింహాద్రి నేడు కేరళలో సింగమలై
సప్తగిరుల సాటివాడు చెదరని ఆశబరి మలై..
సింగమలై సింగమలై సింగమలై సింగమలై
అ : కాటుక చీకటి మబ్బులు కాలుస్తూ పేలుస్తూ
సింగమలై వస్తుంటే
హంతకీళ్ల గుండెల్లో మోగింది మృత్యుభేరి..
అదిరిపడ్డ శత్రుమూక తోక ముడిచి పరారీ..
కళ్ళు నిప్పు కణికలైన కాలుడు మా సింగమలై
హరిని కాళ్ళు బలి అడిగిన బడుగే
మా సింగమలై పిడుగే మా సింగమలై
అతడే తారకరాముడు.. అతడే కౌరవ భీముడు..
అల్లూరికి వారసుడు.. చల్లారని సింగమలై
ఆకుపచ్చ కేరళకే ఆమని మా సింగమలై
సింగమలై సింగమలై సింగమలై సింగమలై



వి.దొరస్వామి రాజు సమర్పించు
విజయమారుతి క్రియేటివ్స్

# సింహాద్రి

వి.విజయ్‌కుమార్ వర్మ   యస్.యస్.రాజమౌళి   యమ్.యమ్.కీరవాణి

విజయేంద్రప్రసాద్, రవీంద్ర బాబు, విశ్వనాథ్, రత్నం, కోటగిరి వెంకటేశ్వరరావు, ఆనందసాయి, విజయ
వేటూరి, సీతారామశాస్త్రి, చంద్రబోస్, వెన్నెలకంటి, లారెన్స్, రాజశేఖర్, ప్రదీప్ ఆంటోని, వినోద్

























పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| సమర్పణ | : | వి.దొరస్వామి రాజు |
| కథ | : | వి.విజయేంద్ర ప్రసాద్ |
| డైలాగ్స్ | : | 'గంగోత్రి' విశ్వనాథ్-ఎం.రత్నం |
| ప్లే బ్యాక్ | : | మనో, ఎం.ఎం.కీరవాణి, టిప్పు, కళ్యాణిమాలిక్, ఎస్.పి.చరణ్, చిత్ర, సునిత, గంగ, శ్రేయ గోషాల్, బ్రహ్మానందం |
| ఎడిటింగ్ | : | కోటగిరి వెంకటేశ్వరరావు |
| ఫోటోగ్రఫి | : | కె.రవీంద్రబాబు |
| డాన్స్ | : | లారెన్స్, రాజశేఖర్, ప్రదీప్ ఆంటోని |
| ఆర్ట్ | : | ఆనంద్‌సాగర్ |
| ఫైట్స్ | : | సెబాస్టియన్ బ్రదర్స్ |
| కాస్ట్యూమ్స్ | : | రాంబాబు - వేణు |
| పబ్లిసిటీ | : | సురేష్ బుజ్జి |
| పి.ఆర్.ఓ. | : | బి.ఎ.రాజు |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : | డి.యోగానంద్ |
| లిరిక్స్ | : | వేటూరి, సీతారామశాస్త్రి చంద్రబోస్, వెన్నెలకంటి |
| సంగీతం | : | యం.యం.కీరవాణి |
| నిర్మాత | : | వి.విజయ్‌కుమార్ వర్మ |
| స్క్రీన్‌ప్లే, డైరెక్షన్ | : | ఎస్.ఎస్.రాజమౌళి |

# తెలుగువారందరం తెలుగే మాట్లాడదాం



స్వరం

ప్రముఖ తెలుగు ఛానల్‌లో
ప్రముఖుల స్వరంతో ఈ మాటలు వింటుంటే
మన తెలుగు వారందరి మనసు పులకరిస్తుంది.
అందుకు మనమూ ప్రయత్నం చేస్తే
తెలుగుభాష వన్నె పెరుగుతుంది
అమ్మతనం కడుపు నిండుతుంది
అందుకు మావంతు ప్రయత్నంగా "అతడే ఒక సైన్యం" కోసం
శ్రీ చంద్రబోస్ కలం నుంచి జాలు వారిన కమ్మనిపాట



పదం

**పల్లవి:**

నా పాట తేట తెలుగు పాట నా పాట తేనెలొలుకు పాట
నా పాట తేట తెలుగుపాట నా పాట తేనెలొలుకు పాట
పూల తోటలకు పరిమళమిచ్చే ఘుమఘుమ పాట
నీలి మబ్బులకు స్నానం పోసే చిటపట పాట
రామ చిలుకలకు వన్నెలు అద్దే రంగుల పాట
కన్న తల్లులను నిద్దుర పుచ్చే ఊయల పాట
దైవాన్ని మేలుకొలిపే దీప ధూపాల పాట
నా పాట తేట తెలుగు పాట
నా పాట తేనెలొలుకు పాట



గళం

యస్.వి.కె. ఫిలింస్

# అతడే ఒక సైన్యం



సమన్వయం

కథ, స్క్రీన్‌ప్లే, సంగీతం, దర్శకత్వం : S.V. కృష్ణారెడ్డి M.Com

నిర్మాత: K. అచ్చిరెడ్డి


సత్యమూర్తి
ఆ కొండలరావు కండల్ని చూస్తే సల్మాన్‌ఖాన్ సలాం చేస్తాడు. హృతిక్ రోషన్‌కి తిక్కరేగి పోతుంది. మగాడంటే అలాగుండాలి.
ఓర్నాయనోయ్. మనసత్తా బుజువు చేసుకోక పోతే బతుకు హైద్రాబాద్ ట్రాఫిక్‌లా అందర వందరై పోతుంది
చూడు జయశ్రీ... వెధవది కండల్దేముంది. జిమ్ముకెళితే ఝుమ్మని వచ్చేస్తాయి. తెలివితేటలు ఉండాలి... మనలాగా...
ఇలాగా? అంత ఘనులా తమరు?
SATYAMURTHY
ఏం. నమ్మకం లేదా? ఆ కండకావరం కొండలరావు చేత మూడు చెరువుల నీళ్ళు తాగించనా?
ట్రైయ్ చెయ్యండి చూద్దాం
నమస్తే అన్నా... ఎక్సర్‌సైజులు చేసి చేసి అలసిపోయినట్లున్నావ్? కాస్త ఈ నీళ్ళు తాగన్నా
థాంక్స్
మూడు చెరువుల నీళ్ళు తాగిస్తానన్నారు, ఇంతేనా?
ఇంతేనా ఏంటి? మొదటిది మొన్న గంగోత్రి సినిమా దగ్గర పంచిన గంగ నీళ్ళు. రెండవది హైద్రాబాద్‌లో వచ్చే మంజీరా, గండిపేట వాటరు. మొత్తం మూడు చెరువుల నీళ్ళు తాగించేనా లేదా? తెలివితేటలంటే
ఇవే మరి

# 'ఒక దేశాధినేత కున్నంత టైమ్ మేనేజ్‌మెంట్ ఉందాయనకి'

**డా॥ సి.నారాయణరెడ్డి గురించి ఆచార్య ఎన్.గోపి**



**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం మాజీ వైస్‌ఛాన్స్‌లర్, ప్రస్తుతం ఉస్మానియా యూనివర్సిటీలో సీనియర్ ప్రొఫెసర్ అయిన డాక్టర్ ఎన్.గోపి ప్రముఖ సాహితీవేత్తగా ఎంతోమందికి తెలిసినా... డాక్టర్ సి.నారాయణరెడ్డి గారికాయన ప్రియశిష్యుడని చాలామందికి తెలియదు. జులై 29కి 73 వసంతాలను పూర్తి చేసుకుంటున్న సినారె గురించి ఆయనతో అతి సన్నిహితంగా మెలగిన ఆచార్య ఎన్.గోపి 'హాసం'తో ప్రత్యేకంగా పంచుకున్న అనుభవాభిప్రాయాల మాలిక యిది.**

నారాయణరెడ్డిగారు స్వయంగా కవియే కాకుండా గాయకుడు కూడా! పాట ఆయనకు ప్రాణం. చిన్నప్పుడు కరీంనగర్ జిల్లా హనుమాజి పేటలో ఉన్నప్పటినించే జానపద బాణీలో పాటలు పాడడం, రాయటం అనేది ఆయనకు ఉంది. పాట ఆయన తత్వం. పాట ఆయన స్వభావంలో సహజంగా అల్లుకుపోయి ఉంది.

1961 నుంచీ ఆయన సినిమా పాటలు రాస్తూనే ఉన్నారు. అంటే ఇప్పటికి నాలుగు దశాబ్దాల పాటు అన్నమాట. దాదాపు మూడు దశాబ్దాలు చాలా యాక్టివ్‌గా ఉన్నారు. మూడు దశాబ్దాలు సినిమా రంగంలో నిలదొక్కుకుని పాటలు రాయడం అన్నది చాలా అరుదైన విషయం. ఆరుద్ర, ఆత్రేయ, శ్రీశ్రీ లాంటి దిగ్గంతుల మధ్య... మద్రాసులో నివాసం ఏర్పర్చుకోకుండా... ఇక్కడ ప్రొఫెసర్‌గా పనిచేస్తూ... మూడు దశాబ్దాల పాటు సినీరంగంలో తనదైన ముద్ర వేశారంటే ఆయన శక్తికి అది మచ్చుతునక మాత్రమే. వాటిని ఆయన మ్యానేజ్ చేసిన తీరు నాకు ఆశ్చర్యం అనిపిస్తూంటుంది ఇప్పటికి.

నా చిన్నప్పటినించి... 1960లో... అంటే నాకు పదేళ్ళు. అప్పటినించి మా తెలంగాణ పల్లెల్లో.... నారాయణరెడ్డిగారి పాటకోసం సినిమాలు చూడడం బాగా గుర్తు. విఠలాచార్య సినిమాలు. సి.నారాయణరెడ్డి పాటలు ఉన్నాయి అని అనేవాళ్ళు. ప్రబంధ పదజాలంతో రాయటం అది బాగా ఇక్కడ ఈ ప్రాంతంలో బాగా వెళ్లింది.

కోస్తా జిల్లాల్లోలాగ భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం అని ఇట్లాంటి వరసలేదు. రావటం రావటమే అన్ని ప్రక్రియలలో అంటే పద్య కవిత్వం, గేయ కవిత్వం, వచన కవిత్వం అన్నీ ఒకటేసారి వచ్చాయి. గేయంమీద మక్కువ ఎక్కువ ఉన్న ప్రాంతం తెలంగాణ! నా అనుభవంలోంచి చెబుతున్నాను. ఇప్పటికీ గేయం కోస్తా, రాయలసీమలలో లేదు. పాట అన్నది తెలంగాణ తత్వం. ఇప్పుడు గద్దర్ ఒక హీరో అయ్యారంటే కేవలం పాట వలనే... సరే అది వేరే విషయం.

నారాయణరెడ్డిగారు ప్రత్యేకమైన ప్రాబంధిక శబ్దాలని సినిమాల్లోకి తెచ్చారు. జానపదాల్లో కానీ పౌరాణికాల్లో కానీ...! ఆయన విశ్వవిద్యాలయంలో బోధిస్తున్నవారు కాబట్టి ప్రబంధాల్లో ఉన్న పదాలు సినిమాల్లో తెచ్చారని నాకు అనిపిస్తుంది. తనదైన ఒక డిక్షన్ ఏర్పరుచుకున్నారు. ఇందరు దిగ్గంతులు ఉన్నప్పుడు తనదైన పదజాలాన్ని, ప్రయోగిస్తూ పాటకు అనుప్రాసల్ని, గేయగుణాన్ని ఇచ్చారు.

ఆత్రేయగారు ఒక వచనాన్ని కూడా పాట చేశారు 'మాను మాకును కాను రాయి రప్పను కాను మామూలు మనిషిని నేను' అని, మహదేవన్ చేతిలో అది బంగారం అయింది. మాత్రా ఛందస్సు చెడకుండా, అనుప్రాసలు చెడకుండా సినారె పాటలను రాశారు. అది ఈయన ప్రత్యేకత అని నాకు అనిపిస్తూంటుంది.

ఉదాహరణలు చాలా దొరుకుతాయి. పాటకున్న రహస్యాలు తెలిసినవారాయన. మిగతా వాళ్ళకు లేని అడ్వాంటేజ్ ఏమిటంటే స్వయంగా పాడుతారు కదా- అఫ్ బీట్ అంటే ఏమిటి, బిఫోర్ బీట్ అంటే ఏమిటి.... ఒక మాత్రను వదిలిపెట్టి చదవడం... ఇవన్నీ బాగా తెలుసాయనకు.

శాశ్వతంగా ఉండే పాటల్ని సంకలనం చేస్తే అందులో నారాయణరెడ్డిగారి పాటలు చాలా ఉంటాయి. సాంగ్స్ ఫరెవర్ అని అంటాం... అలాటివన్నమాట. ఎందుకంటే సినిమా ప్రవేశానికి ముందే ఆ మీడియాకు అనువర్తింపు కావడానికి కావలసిన సంసిద్ధత ఈయనకు బోలెడంత ఉంది. ఏమిటి ఆ సంసిద్ధత... అంటే... లలిత సంగీతంలో కూడా పాటలు రాశారు. గేయ కావ్యాలు రాశారు. రేడియో పాటలు రాశారు. 'సాగుమా ఓ నీల మేఘమా', 'ఈ నల్లని రాళ్ళలో ఏ కన్నులు దాగెనో', 'మబ్బులో ఏముంది' ఇవన్నీ ఎవరు మర్చిపోగలరు? ఇవన్నీ సినిమాకు ముందు రాసినవి వాటిని తర్వాత సినిమాకు ఎడాప్ట్ చేసుకున్నారు.

కరీంనగర్ జిల్లాల్లో ఉన్న జానపద గేయాల బాణీల్లో చాలా రాశారాయన అప్పటి సంగీత దర్శకులను ఒప్పించి. ఈయన పాడి వినిపించటం అనేది ఈయనకు పెద్ద అడ్వాంటేజ్ అని అనుకున్నాం కదా.

ఈయనకు వాయిదావేసే తత్వం లేదు. సద్యస్ఫూర్తి ఎక్కువ. సన్నివేశం అర్థం చేసుకుని వెంటనే చెపుతారు. మిగతా సినిమా కవులకు ఈయనకు భేదం ఏమిటంటే... మాటలకున్న పరిమళం కూడా తెలిసినవారీయన... కృష్ణశాస్త్రిగారి లాగ! మాటల్ని త్యాగం చేయరు. భావం, భాష రెండు సమతౌల్యంలో ఉండాలని అనుకుంటారు. గేయంలో, కవిత్వంలో లిరిసిజం అనే ఒక మాట ఉంది. పాటల్లో గాన గుణం, కవితాంశ ఆ రెండింటి కలయిక లిరిసిజం. లైయిర్ మీద వాయిస్తారు కాబట్టి లిరిసిజం అని పేరు వచ్చింది. మనం ఇప్పుడు లిరిక్స్ అంటే ఒట్టి పాటలు అని వాడుతున్నాం. లిరిక్ అంటే అంతకంటే పెద్ద మాట. అది కవిత్వపరమైందన్నమాట. అలా పాటల్లో గానగుణం, కవితాంశ జొప్పించిన వారు నారాయణరెడ్డి.

ఆయన చాలా సార్లు సభలలో, వ్యక్తిగతంగా కూడా చెప్పారు. ఎన్.టి.ఆర్ అనే నట సింహద్వారం గుండా నేను ప్రవేశించటం వల్ల నాకు ఇంత ప్రాధాన్యం వచ్చింది అని. మద్రాసులో... చలనచిత్ర పరిశ్రమలో

నిలదొక్కుకోవడమే కష్టం ఆ రోజుల్లో. పైగా పాటలు మొత్తం నేను రాయాలి అని పౌరుషం ముందే ఉండేది ఆయనకు. ఆ పౌరుషం ఎన్.టి.ఆర్ గారు తీర్చారు. ఎన్.టి.ఆర్ కూడా శబ్ద సౌష్టవాన్ని ఇష్టపడేవారు. 'గులేబకావళి కథ' లో దాదాపు అన్ని పాటలు హిట్ అయినాయి. ప్రజల మనసులకు పట్టుకున్నాయి. అంతకు ముందు మిగిలిన సీనియర్ కవులకు ప్రాసల మీద దృష్టిలేదు ఒక్క ఆరుద్రకి తప్పితే. ఆరుద్ర గారివి అంత్యప్రాసలు ఈయనవి అనుప్రాసలు.



నారాయణరెడ్డిగారికి స్టూడెంట్‌గా ఉన్న వాళ్ళలో నేను కొంచెం ఎక్కువ క్లోజుగా ఉండేవాణ్ణి. నేనంటే ఇష్టం ఆయనకు. కానీ ఆయన ఎప్పుడూ క్లాస్‌రూంలో సినిమా గురించి మాట్లాడేవారు కాదు.

టైమ్ మేనేజ్‌మెంట్ ఆయనను చూసి ఎవరైనా నేర్చుకోవాలి. ఒక దేశాధినేతకు దగ్గర ఉన్నంత టైమ్ మేనేజ్‌మెంట్ ఆయనకు ఉంది. శనివారం మద్రాసు వెళ్ళేవారు మళ్ళీ సోమవారం మార్నింగ్ ఫ్లైట్‌లో వచ్చి యూనివర్శిటికి వచ్చి పాఠాలు చెప్పేవారు. ఆ శనివారం, ఆదివారం మూడు, నాలుగు పాటలు రాసి వచ్చేవారు. ఓ సినిమా పాట రాయాలంటే అది ఓకే అయ్యేవరకు ఎన్నో వెర్షన్స్ రాయాలి, అవన్నీ ఆయన చేసేవారు. ఆ స్పీడ్ ఇప్పటికి ఉంది. కొత్తదనం మీద బాగా ఆసక్తి ఆయనకి, ఇదివరకు అన్న మాట మళ్ళీ అనకూడదు. ఏదన్నా కొత్తగా అనాలి. పోనీ పాతదే అనాల్సివస్తే కొత్తరకంగా అనాలి అనే పద్ధతి మొదటి నుంచి ఆయనకు ఉంది సృజనపౌరుషం అన్నమాట.

శారద గారికి మూడోసారి ఊర్వశి వచ్చినపుడు రైల్ కళారంగ్‌లో పెద్ద సన్మాన సభ జరిగింది. నేను కూడా ఆయనతో వెళ్ళాను. చాలా మంది ఉన్నారు పెద్దవాళ్ళు. శారద గురించి ఈయన మాట్లాడుతూ 'ఈ అమ్మాయి మహానటి, ఊర్వశి త్రయి. ఈమె పేరు మీద నేను ఒక పాట రాశాను. 'శారదా నను చేరగా', అందులో ఒక మాట వాడాను ఓ శారద శ్రావణ నీరద శారద' అని. దర్శకుడో ఎవరో నీరద అంటే ఏంటి గురువుగారు అని అడిగారు. నీరద అంటే మేఘం అన్నాను. ఇది వెళ్ళదు గురువుగారు జనంలోకి అని అన్నారు. నాకేమో ఆ మాట ఉండాలని ఉంది. వెళ్ళదంటున్నారు. నేను చమత్కారంగా- ఆమె కరుణాత్మక నటి, ఆమె కళ్ళు భవభూతి శ్లోకాల్లాంటివి నీరద అన్నప్పుడు ఆమె కళ్ళు చూపెట్టవయ్యా జనంలోకి వెళుతుందేమో అని అన్నాను. ఏమనుకున్నారో కానీ ఆ మాటల్ని అట్లాగే ఉంచారు' అని ఆయన ఆ సభలో చెప్పారు.

ఒక మాట సినిమా పాటలోకి వెళ్ళటానికి, వెళ్ళకుండా ఉండడానికి మధ్య బోలెడంత చర్చ జరుగుతుంది. కవికేమో తన మాటల మీద మోజు. మరి దర్శకుడికేమో అది ప్రజల్లోకి ఎట్లా వెళుతుంది అనే ఒక సంకోచం. వీటన్నిటి మధ్య పాట పలకాలంటే దానికి చాలా శక్తి కావాలి. మామూలు పాట రాయడం కన్నా సినిమా పాట రాయటం చాలా కష్టం. ప్రజలను మెప్పించాలి. అప్పటికప్పటికి అనుకొని బయటపడేది కాదు. అది వెంటాడుతుంది కూడా.

నారాయణరెడ్డిగారు బహుముఖ ప్రజ్ఞావంతుడు. ప్రముఖంగా కవి అయినప్పటికి మిగిలిన ప్రజ్ఞలు చాలా ఉన్నాయి ఆయనకు. మంచి వక్త, గాయకుడు. ధైర్యం చేసి గజల్స్ తెలుగులో పాడారాయన. పైగా ఎన్.టి.రామారావు గారిని ఎదురుగా పెట్టుకుని...!? ఎంత ధైర్యం ఉండాలి. ఆరోజు జనంతో రవీంద్రభారతి కిక్కిరిసిపోయింది. ఉర్దూ గజల్స్ స్థాయిలో ఆ రాగాలు అవీ ఆయనే ట్యూన్స్‌లో పెట్టి రిహార్సిల్స్ చేసి... నేను ప్రత్యక్షంగా చూసాను. ఒక గాయకుడుగా, స్వరకర్తగా, పదకర్తగా, ఆవిష్కర్తగా అది చాలా పెద్ద సాహసం.

ఆయన గురించి నా అభిప్రాయం ఏంటంటే- మన ఎదురుగా ఉన్నారు కాబట్టి ఆయన విలువ మనకు తెలియటం లేదు. రాజ్‌కపూర్ లాగా హి ఈజ్ ఎ షో మ్యాన్. షో మ్యాన్ అనేది మంచి పదం. ఆయనలాంటి వారు చాలా తక్కువ ఉంటారు. అదే యూపీలో పుట్టి ఉంటే ఆయన టాక్ ఆఫ్ ది నేషన్ అయ్యుండేవారు.

క్రియేషన్ ఈజ్ వన్ థింగ్, ప్రమోషన్ ఈజ్ అనదర్ థింగ్. రెండూ తెలియాలి కూడా. అది అందరికి సాధ్యం అయ్యేది కాదు. కానీ ఆయనకు సాధ్యం అయ్యింది. ఆయనకు ఉర్దూ రావడం అనేది ఒక అడ్వాంటేజ్. ఉర్దూ మీడియంలో చదువుకున్నారు కదా. కాబట్టి అక్కడక్కడ ఉర్దూ మాటలు పెట్టడం చేసేవారు. ఆయన ఒక పాట వినగానే అది తెలుగు కానీ, ఉర్దూ కానీ, హిందీ కానీ వెంటనే రాగాన్ని గుర్తుపట్టగలరు. ఆయన ఈ మధ్య అన్నారు 'నేను సంగీతం నేర్చుకోవాలనుకుంటున్నాను. కొన్ని రాగాలు గుర్తుపట్టగలను. ఇప్పుడు నేర్చుకుని ఇంకా ఎక్కువ రాగాలను గుర్తుపట్టాలని ఉంది' అని. 73 ఏళ్ళు దాటుతున్న ఈ వయసులో నేర్చుకునే గుణం ఉంది అంటే... ఆ ఫ్రెష్‌నెస్... తాజాదనం... దాన్ని ఆదర్శంగా తీసుకోవాలి మనం. ఎవరైనా ఆయనలాగే ఒక మెరుపులాంటి మాట అన్నా, ఫ్లాష్‌లాంటి భావాన్ని ఊదినా వెంటనే దానికి స్పందిస్తారాయన.

మొట్టమొదటిసారి తెలంగాణ మాండలికాన్ని సినిమా పాటల్లో ప్రవేశ పెట్టగలిగిన ధీశాలి ఆయన. అఖిలాంధ్ర స్థాయిలో ఆ రోజుల్లో తెలంగాణ మాండలికాన్ని సినిమా పాటలో చొప్పించటమంటే అంత సులభం కాదు. అందుకు తెలంగాణ ప్రజలందరూ చాలా సంతోషించారు. 'మాయదారి సిన్నోడు నా మనసే లాగేసిండు' లాటివి చాలా పెట్టారు. సమాసాలు ఆయనకు మైనపు ముద్దల్లా ఒదిగిపోతాయి. ఆయన సిద్ధ సమాసాలే కాకుండా... అంటే ఇదివరకు ఉన్న సమాసాలే కాకుండా... కొత్త సమాసాలు క్రియేట్ చేశారు. సిద్ధ సమాసాలను ప్రసిద్ధ సమాసాలు చేశారు. అది ఆయనలో ఉన్న ప్రతిభకు తార్కాణం.

ఎంతో ప్రజ్ఞావంతుడు. సాధన చేస్తున్నట్టు పైకి కనపడరు. తాజాగా మంచి లాల్చీ కట్టుకుని వస్తున్నట్టు ఉంటారు. లోపల మెంటల్ వర్క్ బాగా చేస్తారని నా అనుమానం. లేకపోతే ఇన్ని రోజులు ఈ రంగంలో నిలబడరు. నిత్య ప్రయోగశీలి, మానసికంగా నిత్య యౌవ్వనుడు. మనుమల మనవరాళ్ళ ప్రపంచంలో క్కూడా వెళ్ళిపోగలరాయన. వాళ్ళతోటి వాళ్ళ స్థాయిలో మాట్లాడగలరు! ఇటీవల ముత్తాత కూడా అయ్యారు. అయినప్పటికి ఆయన చాలా తాజాగా ఉన్నారు. ఇవాళ లేటెస్ట్ టీనేజర్స్

పిక్చర్ చూడాల్సి వచ్చినా ఒక కుర్రాడిలా చూస్తారు. సినిమా గురించి నాకు ఇంత తెలుసు అనేది మరిచిపోతారు. ఒక మామూలు ప్రేక్షకుడిలాగ చూస్తారు.

నారాయణరెడ్డిగారు వాగ్జీవి. వాక్‌జీవి అంటే ఓవైపు వాక్కు, ఇంకోవైపు వాకింగ్. అమెరికా వెళ్ళినా, ఆస్ట్రేలియా వెళ్ళినా తెల్లవారుఝామున ఏ పరిస్థితుల్లో ఉన్నా ఆయన వాకింగ్ ఆయన కోటా చేయాల్సిందే. ఒక గంటలో 6 కి.మీ. నడుస్తారాయన. ఆయన వెంట మనం నడువలేం. ఈ వయసులో కూడా స్పీడ్ వాక్ .... అందుకే హాయిగా తాజాగా ఉంటారు. ముసురు పట్టినప్పుడు గొడుగు పట్టుకుని వాకింగ్ చేసిన సన్నివేశాలు చూశాను. మరీ కుంభవర్షం కురిస్తే ఇంట్లోనే ఆ కోటా పూర్తి చేసే సన్నివేశాలు చూశాను. అదే ఆయన ఆరోగ్యాన్ని కాపాడింది .



కొందరిలో ఎట్లా వుంటుందంటే- జీవితాన్ని అనుభవించని చాలా రసహృదయులుంటారు. ఈయనలో అటు రసహృదయం ఉంది ఇటు దాన్ని కాపాడుకునే క్రమశిక్షణ ఉంది. కొంతమంది యోగులుంటారు ఏమీ అనుభవించరు... ఈయన అలాకాదు రాజ యోగిలాంటివారు. ఒక జీవితానికి కావలసిన అనుభవాన్ని పొందుతూ... కఠోరమైన క్రమశిక్షణతో ఉంటారు. అప్పుడప్పుడు ఆ క్రమశిక్షణని ఆత్మీయులకోసం త్యాగం చేసేంత మానవత్వం కూడా ఉంది. రిజిడ్‌గా ఉన్నట్టు కనిపిస్తారు. ఆత్మీయుల కోసం దాన్ని ఉల్లంఘిస్తారు. ఇప్పుడు ఆయన ఇంత తినాలనుకుంటారనుకోండి.. మనం ఆత్మీయతతో కొంచెం ఎక్కువ పెడితే... (నిజానికి ఆయన ఎక్కువ తినకూడదు) ఆయన మన ప్రేమకోసం తింటారు. తిని ఇంకో ఒక కిలోమీటర్ ఎక్కువ నడుస్తారు. అది ఆయనలో ఉన్న తత్వం.

నిలువెల్లా మానవీయత ఉన్న వ్యక్తి. అన్నింటికి మించి లోకజ్ఞుడు. ఆయన లోకజ్ఞుడు అన్న మాట చాలా గౌరవప్రదమైంది. లౌకికుడు అని కాదు. మానవ స్వభావాల గురించి బాగా తెలుసు ఆయనకి. ఎవరు ఏ పరిస్థితుల్లో ఉంటే ఎట్లా ఉంటారు అనే విషయాన్ని ఇట్టే గ్రహించగలరు. తన మిత్రులు ఎవరన్నా బ్యాడ్ షేప్‌లో ఉంటే తట్టుకోలేరు. వాళ్ళకు ఏం చేయాలీ అని వెంపర్లాడుతుంటారు. ఆయనకు ధనాశ కూడా లేదు. ఇల్లు తప్ప ఏమీ లేదు. ఎక్కువ డబ్బంటే చిరాకు. అవసరాలకు సరిపోవాలి. సినిమాలలో సంపాదించుకున్నది పిల్లల పెళ్ళిళ్ళకు సరిపోయింది. ఆయన ధనవంతుడు కాదు. పేదవాడు కూడా కాదు. పద సంపద మీద ఉన్నంత మోజు ధన సంపద మీద లేదు. తన అవసరాలకు, తన పద్ధతికి సరిపడా చాలు. అందుకే అంత ఫ్రెష్‌గా ఉన్నారు. తల్చుకుంటే సంపాదించుకునేవారు కానీ ఎందుకు అంటారాయన.

ఆయన సాహిత్య జీవితం కానీ, వ్యక్తిగత జీవితం కానీ, సామాజిక జీవితం కానీ వృత్తిగత జీవితం కానీ అన్నీ పరిపూర్ణమైనవి. టీచర్‌గా కూడా గొప్ప టీచర్. ఆయన టీచ్ చేస్తుంటే క్లాస్‌తో సంబంధం లేనివాళ్ళు కూడా వచ్చి వినేవారు. చాలా కష్టపడి చెప్పేవారాయన. అది ఆయనలో ఉన్న విశిష్ట గుణం చాలామందికి తెలియదు. ఆయన జ్ఞాపకశక్తి కూడా అపారమైంది. ఓ ఇరవై ఏళ్ళ తర్వాత ఒక వ్యక్తి కలిస్తే అతని పేరు వెంటనే చెపుతారు. ఒక చిన్న కుర్రాడు పోయెమ్ రాస్తే నీ పోయెమ్ చదివాను చాలా బాగుంది ఫలాన లైనులో అని అంటారు. అంత జ్ఞాపకశక్తి ఆయనది.

మీరు అయిందానికి కానిదానికి పీఠికలు అవీ ఎందుకు రాస్తారు అని ఆయన సన్నిహితులంటారు. రాయకపోతే ఎట్లా పాపం వాడికి ప్రోత్సాహం ఉండాలికదా. మనం రాస్తే బాగుంటుంది కదా. మనం చిన్నప్పుడు ఆ బ్యాక్‌గ్రౌండ్‌నుంచే వచ్చాం కదా అని అంటారాయన. గతాన్ని ఎప్పుడు మరచిపోలేదు.

ఆయనే అన్నారు ఒక సన్మానంలో... మనసుకి జిడ్డంటని నారాయణరెడ్డికి సన్మానం అని. ఈ సన్మానం ఎవరికి అని అంటే- మా ఊళ్ళో జానపదగేయాలకు ఈ సన్మానం. పేరులో రెడ్డి అనే పదం ఉన్నా కులం జిడ్డు అంటని నా మనసుకి ఈ సన్మానం అని అన్నారు. మనసును అలా క్లీన్‌గా ఉంచుకోవడం అందరికి సాధ్యం కాదు. ఆయన జనం మనిషి, జనం లేకుంటే ఆయన లేరు. జనం మధ్యనే ఉంటారు... విశిష్టంగా ఉంటారు.

ఎన్.టి.ఆర్ పక్కన స్టేజిమీద ఉండి ఆయనతో సమఉజ్జీగా ఉండడం అన్నది ఎంత కష్టం! అది సి.నారాయణరెడ్డిగారికి మాత్రమే సాధ్యమైంది. నేను విశ్వనాథ సత్యనారాయణగారి దగ్గరనుండి వ్యక్తిగతంగా అందర్నీ చూస్తున్నాను కదా నాకు ఆశ్చర్యం అన్నమాట. చిన్నగా ఒదిగిపోతారు, ఆకాశమంత ఎత్తు ఎదిగిపోతారు. ఈ రెండూ చేసేటప్పుడు కూడా ఆయన నిర్వికారంగానే ఉంటారు.

ఇపుడు మనం హనుమాజి పేటకు వెళితే తన చిన్నప్పటి ఫ్రెండ్స్‌తో వాళ్ళ లెవల్‌లోనే ఉంటారు. ఆయన ఎవరిని మర్చిపోలేదు మరువడం ఆయన జీవితంలో లేదు. అదీ ఆయనలో ఉన్న ప్రత్యేకత. చాలామంది మారిపోతారు... ఆయన ఎదిగిపోయారు కానీ మారిపోలేదు.

## ఘంటసాల క్విజ్ -4 విజేతలు

1. మొదటి బహుమతి - డి. ఎస్. శంకర్, వక్కలంక
2. రెండవ బహుమతి - ఎన్.ఎస్.కృష్ణమూర్తి, సికింద్రాబాద్.
3. మూడవ బహుమతి - ఎస్. హేమ, కర్నూలు

**కరెక్టు సమాధానాలు:**

1. వినవేబాల (పాతాళభైరవి)
2. మారిపోవురాకాలము (షావుకారు)
3. అత్తలేని కోడలుత్తమురాలు
4. రహస్యం
5. జంధ్యాల పాపయ్య శాస్త్రి (కరుణశ్రీ)

**బహుమతులు:**

| | | |
|---|---|---|
| 1. మొదటి బహుమతి | : | ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది. |
| | | బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది. |
| 2. రెండవ బహుమతి | : | 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది. |
| 3. మూడవ బహుమతి | : | ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి. |
| | | బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది. |

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



**10**

ఇలపావులూరి మురళీమోహనరావు

### హెచ్చరిక

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





### జరిగినకథ

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. ఎలుకలబోను పెడితే దాన్ని ఎలుక కొరికేస్తుంది. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. అది ఎలుకను పట్టకుండా పడినిద్రపోతూ ఉంటే వెంకట్రావు మండిపడతాడు. తిండిపెట్టక మాడుస్తాడు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లి కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పిల్లి సంసారాన్ని పోషించడానికి పాల ఖర్చు పెరుగుతుంది.

(ఇక చదవండి)

ఎలుక వచ్చె ఇల్లు భద్రం

సురేష్ పేపర్ చదువుకుంటున్నపుడు అమ్మలక్కల ముచ్చట్లు చెబుతున్నది రాధ. 'ఆహా... ఊహు...' అంటున్నాడు సురేష్. కొంచెంసేపు ఆగి భర్త చేతుల్లోని పేపర్ లాక్కొని 'నేను ముచ్చట్లు చెప్పడం ఆపి అరగంటయింది' గయ్‌మంది రాధ.
వెంకట్రావు కూడా ఇలాగే పరధ్యానంగా మాట్లాడి సుందరి చేత చీవాట్లు తిన్న వైనం ఈ సీరియల్‌లో చదవండి.

ఆఫీసుకు వెళ్ళగానే మేనేజర్ వెంకట్రావు పిలిచాడు.

"ఆ... రావోయ్ వెంకట్రావ్... ఎలా ఉంది మా బుజ్జితల్లి?" నవ్వుతూ అడిగాడు.

వెంకట్రావుకు మండిపోయింది. నిగ్రహించుకున్నాడు. రాని నవ్వు తెచ్చిపెట్టుకున్నాడు.

"హ...హ.. చాలా బాగుంది సార్. నిన్ననే కాన్పయింది. లక్షణంగా ఆరుగురు పండంటి బిడ్డలను ప్రసవించింది. తల్లీ పిల్లలు క్షేమం."

మేనేజర్ ముఖం మాడిపోయింది. అయినా నవ్వు పులుముకున్నాడు.

"గుడ్ గుడ్... ఎంత శుభవార్త చెప్పావయ్యా... ఈ సందర్భంలో నీకో ఇంక్రిమెంట్ రికమెండ్ చేస్తాను. పాపం ఖర్చు పెరుగుతుంది కదా!" సానుభూతి ప్రదర్శించాడు మేనేజర్.

"థాంక్యూ సార్... సార్..ఒక్కసారి పాపం తల్లీ పిల్లలను మీ ఇంటికి తీసుకొచ్చి మేడమ్‌గారికి చూపిస్తాను. మనవళ్ళను చూసి వారూ సంతోషిస్తారు." అన్నాడు వెంకట్రావు.

"వద్దు...వద్దు... అంతపని చెయ్యద్దు. చెప్పానుకదా తల్లిదండ్రులు గుండె రాయి చేసుకోవాలని. నేనే ఆ శుభవార్త మేడమ్‌కు చెబుతాలే... ఓ...కే... యూ క్యారీ ఆన్ వెంకట్...." తలను ఫైల్లో ముంచాడు మేనేజర్.

మేనేజర్‌ను మనసులో బండబూతులు తిట్టి బయటకొచ్చాడు వెంకట్రావు.

పనిచేస్తున్నాడనే గానీ ఆలోచనంతా పిల్లలమీదనే ఉన్నది వెంకట్రావుకు. ఒకదాంతోనే చస్తుంటే దానికి తోడు మరి ఆరు! చూస్తూ చూస్తూ రోడ్డుమీద పారేయడానికి మనసొప్పడం లేదు. ఇంట్లో భరించలేడు.




సాయంత్రం వెంకట్రావు రాగానే సుందరి ఓ దుర్వార్త చెప్పింది.

"అటకమీదినుంచి ఏదో కంపు కొడుతున్నది. కొంచెం చూడండి"

"స్నానం చేసి చూస్తాలే. బుర్ర వేడిగా ఉంది"

"చూసి స్నానం చెయ్యవచ్చులే. కంపు కొడుతున్నదంటే స్నానంచేసి చూస్తానంటారేంటి?"

"అబ్బబ్బ...నీ మతమే నీది కదా." విసుక్కుని స్టూలెక్కాడు వెంకట్రావు.

పిల్లుల దగ్గర్నుంచే వస్తోంది వాసన.

పిల్లి కూనలను కదిలించి చూసాడు. ఒక్కటి తప్ప మిగిలినవన్నీ కదులుతున్నాయి.

"ఔనోయ్. నీ అనుమానం నిజమే. ఒక కూన చచ్చింది"

"చచ్చిందా? ఎలా? పొద్దున, మధ్యాహ్నం పాలు పట్టానే?"

"పాలెక్కువై చచ్చుంటుంది. ఏం చేద్దాం ఇపుడు?"

"ఏం చేద్దామని నన్నడుగుతారేం?ముందా దాన్ని తీసుకెళ్ళి బైట పడేసిరండి. లేకపోతే రాత్రికి ఊరూవాడా అంతా కంపు లేస్తుంది."

"ఛీ... నేను పారేయ్యాలా?... నాకు వళ్ళు జలదరిస్తుంది. నువ్వే పారేయ్."

"ఛీఛీ... నాకు వాంతులొస్తాయి"

"నాకు కంపరమొస్తుంది.. నేను ముట్టుకోను"

"నాకు మూర్ఛ వస్తుంది. ముందు దాన్ని తీసెయ్యండి"

"వెధవ సలహా ఇచ్చింది నువ్వేగా. చీపురుతో నువ్వే తీసెయ్"

"మీరెం మగాళ్ళండీ. మన పక్కింటాయన్ని చూడండి. వాకిట్లో కుక్క ఛస్తే ఈడ్చి అవతల పారేశాడు. ఆడదాన్ని. నన్ను తియ్యమంటారేం?"

"అలా పోలికలు తెస్తే నాకు వళ్ళు మండుతుంది."

వీరి వాగ్యుద్ధం గోడచాటున నిలబడి ఆసక్తిగా వింటున్న ఆండాళ్ళమ్మ లోలోపల నవ్వుకుంటూ సుందరిని పిలిచింది.

"ఏంటండోయ్ సుందరిగారూ. మా తమ్ముడినేదో అంటున్నారు?" అడిగింది.

ఎలుక వచ్చె ఇల్లు భద్రం

"మీ కళ్ళు బాగానే ఉన్నాయి. అయినా చదలేక పోతున్నానంటున్నారేంటి?" అడిగాడు డాక్టర్.
"అవునండీ. ఎదుటివారు అగుపడుతుంటే చూడలేం కదా..." చెప్పింది సత్యవతి.
ఈ సీరియల్లోని ఆండాళమ్మ కూడా ఇదే బాపతు.

"చూడండి వదినెగారూ. దరిద్రపు ఎలుకను పట్టుకోవడానికి పిల్లిని తెమ్మంటే కడుపుతో ఉన్న పిల్లిని తెచ్చారు..."

"అయితే నేం? ఎలుకను చంపిందన్నారుగా?"

"చంపితే మాత్రం ఏంలాభం?....."

"మీరు మరీనూ... ఎలుకను చంపడంలో కూడా లాభాలు కావాలంటే ఎలా?"

"పూర్తిగా వినరేం? ఈ ముండమోపి పిల్లికి ఎపుడు కడుపొచ్చిందో తెలియదు కానీ........"

"దానికెపుడు కడుపొచ్చుంటుందో దానికే తెలియదండీ..."

"అబ్బా... నేను చెప్పేది వినండి. ఒకటి కాదు రెండు కాదు. ఏకంగా ఆరు కూనలను కన్నది...."

"పిల్లలంతేనండీ.. వాటికి పొట్టచిన్నదైనా ఒకేసారి పది మందికి జన్మనిస్తాయి."

"నిజమేనండీ... వీటికోసమని రోజూ లీటరు పాలు ఎక్కువ పోయించుకుంటున్నాం......"

"మంచిదే కదండీ. ఈ మాత్రం భూతదయ ఉండటం పుణ్యం."

"నా బొంద పుణ్యం. ఇవేళ వాటిలో ఒకటి పుటుక్కున చచ్చింది"

"అవ్వవ్వవ్వ.. పిల్లిని చంపారా! ఎంతఘోరం ఎంతఘోరం?" చెంపలు వాయించుకున్నది ఆండాళమ్మ.

"రామరామ. మేం చంపలేదండీ. అదే చచ్చింది."

"ఏ రాయైతేనేం పళ్ళు రాలగొట్టుకోడానికి?




మీరు చంపితేనేం? అది చస్తేనేం? మొత్తానికి పిల్లి చచ్చిందీ!? అయినా వాటికి తల్లి పాలుండగా మీరు పాలెందుకు పట్టారు? పాలెక్కువై చచ్చిఉంటుంది."

"పాలెక్కువై చావడమా?"

"ఏంటి సుందరిగారూ మరీ అంత అమాయకంగా మాట్లాడతారు? పాలుతాగే పసివాడికి పాలసీసా ఇవ్వాలి కానీ పాల గుండిగలో పడేస్తే చావకుండా ఉంటాడా? పాలెక్కువయ్యే చచ్చుంటుంది కూన."

"అయ్యయ్యో... ఇపుడెలాగా?"

"పిల్లిని చంపడం మహా పాపం. అందులోనూ పసిపిల్ల ఉన్న ఇంట్లో చావడం మరింత అరిష్టం. వెంటనే ఏదైనా శాంతి చేయించండి."




"ఈ మాత్రందానికి శాంతా?" ఆశ్చర్యంగా అన్నాడు వెంకట్రావు.

"లేకపోతే మీకు మనశ్శాంతి ఉండదు తమ్ముడూ. ఇంట్లో చచ్చిన పిల్లి ఆత్మ ఇల్లు దాటి పోదంటారు. ఎవరు చిన్నవాళ్ళుంటే వాళ్ళను ఆవహిస్తుందిట. మా తోడికోడలు గారింట్లో కూడా ఇలాగే ఒక పిల్లి చచ్చిపోయి వాళ్ళ చిన్న కూతుర్ను పట్టుకుందట. అప్పట్నుంచి ఆ అమ్మాయి మ్యావ్ మ్యావ్‌మంటూ 'నేను పిల్లిని నేను పిల్లిని' అంటుంటుంది. ఎవరైనా పిలిస్తే వస్తున్నా అనకుండా మ్యావ్ అంటుంది. పాపం ఆ పిల్ల గురించి వాళ్ళకు ఒకటే దిగులు"

దంపతుల శరీరంలోని నరాలన్నీ వణికాయి.

"హా... అంత పవరుందా పిల్లిలో..." వణుకుతూ అన్నది సుందరి.

"పెద్దలంటారు. అయినా ఈ రోజుల్లో ఎవరిష్టాలు వాళ్ళవి. మధ్యలో నాకెందుకు? మా అన్నయ్యగారు కాఫీ కాఫీ అని అరగంటనుంచీ అంబోతులా రంకెలు పెడుతున్నారు. వస్తాను."

వగలబడి నవ్వుకుంటూ లోపలికెళ్ళింది ఆండాళమ్మ.

దంపతుల శరీరాలు చెమటతో తడిసి పోయాయి.

"అంతా నీ వెధవ సలహావల్లనే వచ్చింది. బోడి ఎలుక వచ్చిందని ఇల్లంతా గుల్లచేశావు. ఎలుకమందు తెమ్మని పధ్నాలుగు వేలు వదిలించావు. ఇంట్లో సామానంతా పగలగొట్టావు. ఇపుడు మళ్ళీ ఈ శాంతి గింతి అంటే ఎంత వదిలిస్తాడో ఏమో బ్రాహ్మడు.." అరిచాడు వెంకట్రావు.

"బాగానే ఉంది, చెప్పినపుడు నోరు మూసుకుని వింటారు. ఏమన్నా అయితే మాత్రం నా మీద విరుచుకుపడతారు. మందు తెమ్మన్నానేగానీ పాపకు అందేట్లు పెట్టమన్నానా? పిల్లిని తెమ్మన్నాను కానీ పిల్లల తల్లిని తెమ్మన్నానా?" తానూ అరిచింది సుందరి.

"అంతా శని. దరిద్రం పట్టింది. పిల్లపోయినా పురిటికంపుపోనట్లు ఎలుక ఎప్పుడో చచ్చినా దాని తాలుకు శని మాత్రం వదల్లేదు. ఇక చేసేదేముంది? బ్రాహ్మడికి ఫోన్ చేస్తాను. ఆయన ఫోన్ నెంబరెంత?" అడిగాడు వెంకట్రావు.

చెప్పింది సుందరి. డయల్ చేశాడు వెంకట్రావు.

-(ఇంకావుంది)

# సరిగపదమని

## సముద్రాల స్పెషల్

కూర్పు : బి. బాలసుబ్రహ్మణ్యం

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | | 4 | | ■ | 5 |
| ■ | | ■ | | ■ | | ■ | 6 | |
| ■ | | ■ | | ■ | 7 | | ■ | |
| 8 | ■ | ■ | | ■ | ■ | ■ | 9 | |
| | ■ | 10 | | 11 | | | ■ | ■ |
| 12 | | | ■ | | ■ | ■ | 13 | 14 |
| ■ | ■ | 15 | 16 | | 17 | ■ | ■ | |
| ■ | 18 | ■ | | ■ | | ■ | 19 | |
| 20 | | | | | ■ | 21 | | ■ |

### జవాబులు

అడ్డం : 1. వినాయక చవితి 6. లవ 7. దాసు 9. నావ 10. సురవరులు 12. కావడి 13. మారే 15. లోకములే 19. పల్లె 20. సీతా రాముల 21. దాసి

నిలువు : 2. నాగయ్య 3. కచకతార 4.వినోదా 5. దేవదేవ 8. తారకా 10. సుడిలో 11. వరము 14. రేపల్లె 16. కరము 17. లేరు 18. మాతా 19. పసి

ఆధారాలు:

అడ్డం:

1. సముద్రాల దర్శకత్వం వహించిన చిత్రం (7)
6. రామాయణ కథను 3 గీతాలుగా సముద్రాల రాసిన చిత్రం పేరు తొలి సగం (2)
7. తాగిన ప్రతివాడూ తప్పనిసరిగా పాడుకునే పాటగల చిత్రం పేరులో రెండో సగం (2)
9. జగన్నాథ పదసేవ సంసార జలనిధిని దాటించే - ---- అని భక్త రఘునాథ్ లో సముద్రాల అన్నారు. ఏమిటో అది ? (2)
10. హిమగిరి సొగసులలో చెలులను సరాగాలతో చేరేవారు ఎవరు? (5)
12. కలిమిలేములు కష్టసుఖాలు కుండల వంటివట. ఎందులోని కుండలవి? (3)
13. దేవదాసు యొక్క తొలి చూపునాటి రూపు, ధోరణి గురించి చంద్రముఖి బాధ (2)
15. మురళీ కృష్ణుని మోహన గీతికి 'ఇవి' పరవశమైనవి అని విప్రనారాయణుడు దేవ దేవితో అన్నాడు.... ఏమిటవి? (4)
19. పారుని చూడాలంటే దేవదాసు పోవలసిన ప్రదేశం? (2)
20. తెలుగువారింట సంప్రదాయ వివాహాలు జరిగినంత కాలం విధిగా వినిపించే గీతంలోని తొలి అయిదు అక్షరాలు (5)
21. దశరథ సూనుడు లంకను ------ దశకంఠు తలలు కోసి అంటూ శ్రీరాముని చరితమును లవకుశులు గానం చేశారు (2)

నిలువు

2. సముద్రాల రూపకల్పన చేసిన త్యాగయ్య, పోతన, వేమన ఈయనే (3)
3. సముద్రాల వారి తొలిచిత్రం (5)
4. దేవదాసు నిర్మాణంలో సముద్రాల భాగస్వామ్యం పంచుకున్న సంస్థ (3)
5. ధవళాచల మందిరుణ్ణి రావణుడు స్తుతించిన పాట మొదలు (4)
8. ఓ ----- నవ్వులేలా నినూ గనీ    అంటూ చందీరాణి లో చందిని వర్ణించాడు నాయకుడు (3)
10. ఇందులో దూకిన తర్వాత మునకే సుఖమనుకోవాలట.... ఎందులో? (3)
11. కరుణా చూడవయా-------- లీయవయా అంటూ నారదుని చేత సముద్రాల దీపావళిలో గానం చేయించారు (3)
14. సముద్రాల జన్మించిన పల్లె (3)
16. ............... న ధనువు శరమును దాల్చిన జగదాభిరాముడు శ్రీరాముడే కదా (3)
17. కుశలవులకు సాటియైన సరివీరులు ధారుణిలో ఉన్నారా? (2)
18. పతి ఆనతి తలదాలిచి అగ్ని దూకె సీతా/ హుతవాహుడు చల్లబడి శ్లాఘించెను------ (2)
19. ................ కూన సిసలైన జాణ అయిందే అని పార్వతిని గురించి అన్నాడు దేవదాసు (2)

---

వలచే కోమలి వయ్యారాలకు
తలచే మనసుల తియ్యదనాలకు
కలవా విలువలు సెలవీయ

పాట పల్లవి : చిగురాకులలో చిలకమ్మా
సినిమా పేరు : దొంగరాముడు

బ్రతుకంతా పలు ప్రశ్నలమయమై
బ్రతుకును జన సముదాయం
బదులు కోసమై వెతకుట మాని
బ్రతుకుటయే న్యాయం

పాట పల్లవి : కనులకు దోచి చేతికందని
సినిమా పేరు : బాటసారి

## బాణీ ముత్యాలు



వేద శాస్త్రములు చదివిన వారే
ఎరుగరు సృష్టి విలాసం
అల్పబుద్ధితో జ్ఞానదాతకే
పలుకకు పరిహాసం

పాట పల్లవి : కనులకు దోచి చేతికందని
సినిమా పేరు : బాటసారి

సుడిలో దూకి ఎదురీదకా
మునకే సుఖమనుకోవోయ్

పాట పల్లవి : కుడి ఎడమైతే
సినిమా పేరు : దేవదాసు

"ఈ సారి 'హాసం'లో కొత్త గా ఏం పెడుతున్నారు?" అని అడిగారు కీరవాణి "సముద్రాల శత జయంతిని పురస్కరించుకుని ఓ మూడు నాలుగు కొటేషన్స్ 'బాణి ముత్యాలు ' పేరిట వేద్దామనుకుంటున్నాం" అంది 'హాసం' "కరెక్టే...ముత్యాలు దొరికేది సముద్రంలోనే కదా" అని చమత్కరించారు కీరవాణి వెంటనే

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | | |
|---|---|---|
| చిత్రం | : ప్రేమ్‌నగర్ (తెలుగు) | వసంతమాళిగై (తమిళం) |
| రచన | : ఆచార్య ఆత్రేయ | కణ్ణదాసన్ |
| సంగీతం | : కె.వి.మహదేవన్ | కె.వి.మహదేవన్ |
| గానం | : ఘంటసాల | టి.ఎమ్.సౌందర్‌రాజన్ |

ఒక భారతీయ భాషలో విజయవంతమైన చిత్రాన్ని మరొక భారతీయ భాషలో మళ్లీ నిర్మించడం అనే ప్రక్రియ మన చలన చిత్రాలు మాటలు నేర్చిన కాలం నుంచీ సాగుతూ వస్తున్నదే. ఇతర భాషలలో వచ్చిన చిత్రాలను తెలుగులో నిర్మించినట్టే తెలుగు చిత్రాలనూ తక్కిన భాషలలో నిర్మించారు. పాత రోజులలో కొందరు నిర్మాతలు ఒకే కథతో తెలుగు, తమిళం రెండు భాషలలోనూ ఒక్కసారిగా చిత్రాలు నిర్మించేవారు. ఒక పెద్ద చిత్ర నిర్మాణ సంస్థ కన్నడంలో విజయం సాధించిన ఒక చిత్రాన్ని తెలుగు, తమిళం, హిందీ భాషలలో ఒకేసారి పునర్నిర్మించి బాగా దెబ్బతిన్నది.ఒక భాషలో విజయవంతమైన చిత్రం మరొక భాషలో తీసినప్పుడు విజయం సాధించడం అరుదు.

తెలుగులో విజయం సాధించిన తమ 'ప్రేమనగర్' చిత్రాన్ని సురేష్ సంస్థ వారు తమిళంలో 'వసంతమాళిగై'గా నిర్మించారు. తెలుగు చిత్రానికి దర్శకత్వం వహించిన కె.ఎస్.ప్రకాశరావు తమిళ చిత్రానికీ దర్శకత్వం వహించారు. తెలుగు, తమిళ చిత్రాలు రెండిటికీ సంగీతం సమకూర్చినవారు కె.వి.మహాదేవన్.

తెలుగు చిత్రంలో ఆత్రేయ రాసిన పాటలను తమిళంలో కణ్ణదాసన్ రాశారు. తెలుగు చిత్రంలోని పాటలలాగా తమిళ చిత్రంలోని పాటలూ ప్రజాదరణ పొందాయి.

తెలుగు తమిళ చిత్రాలు రెండిటిలోనూ నాయిక వాణిశ్రీ. తెలుగు చిత్రంలో నాగేశ్వరరావు ధరించిన పాత్రను తమిళంలో శివాజీ గణేశన్ ధరించారు. తెలుగులో నాయకుడి పాత్రకు ఘంటసాల నేపథ్యగానం చేశారు. తమిళంలో నాయకుడి పాత్రకు నేపథ్యగానం చేసినవారు టి.ఎం.సౌందరరాజన్. "సన్నివేశానికి తగ్గట్టు భావయుక్తంగా పాడడానికి మీరు నాకు ఆదర్శం" అని సౌందరరాజన్ ఒకసారి ఘంటసాలతో చెప్పారట.

'ప్రేమనగర్' కథానాయకుడు పరిస్థితుల ప్రభావం వల్ల తాగుబోతు అవుతాడు. నాయిక కోసం తన పద్ధతి మార్చుకోవడానికి ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో నాయికను మరచిపోలేకా ఆమెను మరచిపోవడానికి తాగలేకా - మానసిక క్షోభ అనుభవిస్తాడు. కథా నాయకుడి ఈ క్షోభను ఆత్రేయ 'మనసుగతి ఇంతే' పాటలో ఎంతో గొప్పగా చిత్రించారు.

'మనసు కవి'గా ఆత్రేయకు పేరు తెచ్చిన మనసు పాటలలో ఈ పాట ఒకటి.

## 'ప్రేమనగర్' కోసం ఆత్రేయ రాసిన పాట:

సాకీ: తాగితే మరచిపోగలను తాగనివ్వదు
మరచిపోతే తాగగలను మరవనివ్వదు

మనసు గతి ఇంతే మనిషి బతుకింతే
మనసున్న మనిషికి సుఖము లేదంతే
ఒకరికిస్తే మరలిరాదు
ఓడిపోతే మరచిపోదు
గాయమైతే మాసిపోదు
పగిలిపోతే అతుకుపడదు ॥మనసు గతి॥
అంతా మట్టేనని తెలుసు
అదీ ఒక మాయే అని తెలుసు
తెలిసి తెలిసీ విలపించుటలో
తీయదనం ఎవరికి తెలుసు ॥మనసు గతి॥
మరుజన్మ ఉన్నదో లేదో
ఈ మమత లప్పుడేమవుతాయో
మనిషికి మనసే తీరని శిక్ష
దేవుడిలా తీర్చుకున్నాడు కక్ష ॥మనసు గతి॥



## వసంత మాళిగై చిత్రం కోసం కణ్ణదాసన్ రాసిన పాట :



'వసంత మాళిగై' చిత్రంలో శివాజీ గణేశన్, వాణిశ్రీ

సాకీ: కుడిప్పదఱ్కు ఒరు మనమిరున్దాల్ - అవళై
మఱన్దు విడలామ్ - అవళై
మఱప్పదఱ్కు ఒరు మన మిరున్దాల్
కుడిత్తు విడలామ్ - ఆనాల్
ఇరుప్పదో ఒరు మనదు - నాన్
ఎన్న శెయ్‌వేన్ ఎన్న శెయ్‌వేన్

ఇరణ్డు మనమ్ వేణ్డుమ్
ఇఱైవనిడం కేట్టేన్
నినైత్తువాడ ఒన్ఱు
మఱన్దు వాళ ఒన్ఱు ॥ఇరణ్డు॥
శిఱియ గాయమ్ పెరియ తున్బమ్
ఆఱుమ్ మున్నే అడుత్త గాయమ్
ఉడలిల్ ఎన్డాల్ మరున్దు పోదుమ్
ఉళ్ళమ్ పావమ్ ఎన్న శెయ్యుమ్ ॥ఇరణ్డు॥
ఇరవుమ్ పగలుమ్ ఒన్డానాల్ ఇరణ్డానాల్
ఇన్బమ్ తున్బమ్ ఇరణ్డానాల్
ఉఱవుమ్ పిరివుమ్ ఇరణ్డానాల్
ఉళ్ళమ్ ఒన్ఱు పోదాదే ॥ఇరణ్డు॥
కణ్ణిలిన్ దణ్డనై కాట్చివళి
కాట్చియిన్ దణ్డనై కాదల్ వళి
కాదలిన్ దణ్డనై కడవుళ్ వళి
కడవుళై త్తండిక్క ఎన్న వళి

తమిళ గీతానికి భావానువాదం ఇది:

తాగడానికి ఒక మనసుంటే - ఆమెను
మరచిపోవచ్చు - ఆమెను
మరవడానికి ఒక మనసుంటే
తాగేయవచ్చు - కాని
ఉన్నదో ఒక్క మనసు - నేను
ఏం చెయ్యను ఏం చెయ్యను

రెండు మనసులు కావాలి
దేవుణ్ణి అడుగుతాను
తలచి వగచేందుకు ఒకటి
మరచి బతికేందుకు ఒకటి

చిన్న గాయం చాలా దుఃఖం
ఆరే ముందే మరొక గాయం
శరీరానికంటే మందు చాలు
మనసు పాపం ఏం చేసేను

రాత్రీ పగలూ రెండయితే
సుఖమూ దుఃఖమూ రెండయితే
చెలిమీ ఎడబాటూ రెండయితే
మనసు ఒక్కటి చాలదే

కన్నులకు దండన దృశ్యం ద్వారా (దారిలో)
దృశ్యానికి దండన ప్రేమ ద్వారా (దారిలో)
ప్రేమకు దండన దేవుడి ద్వారా (దారిలో)
దేవుణ్ణి దండించడానికి ఏది దారి

ఆత్రేయ తెలుగు పాట 'సాకీ'లో చెప్పిన అభిప్రాయాన్నే తమిళ గీతంలో సాకీ ప్రతిధ్వనించినా - తెలుగు పాట సాకీ కన్నా తమిళగీతంలోని సాకీ పెద్దది. ఆ సాకీలోనే - ఒక మనసే ఉందని చెబుతూ - పల్లవిలో 'రెండు మనసులు కావాలి' (ఇరండు మనమ్ వేణ్డుమ్) అంటారు కణ్ణదాసన్.

"మనిషికి మనసే తీరని శిక్ష దేవుడిలా తీర్చుకున్నాడు కక్ష" అని ఆత్రేయ - 'ఒక మనసే మనిషికి శిక్ష' అంటే, కణ్ణదాసన్ - ఉన్న ఒక మనసు చాలదని మరొక మనసు కావాలని దేవుణ్ణి అడుగుతానని అంటారు.

తమిళ గీతానికి కావలసిన ప్రాతిపదిక అంతా తెలుగు పాటలో ఉంది. అయితే తమిళ గీతం కొంత భిన్నంగా సాగింది.

రెండు మనసులు కావాలట - తలచి వగచేందుకు ఒకటీ, మరచి బతికేందుకు మరొకటీ. రెండెందుకంటే జీవితం నిండా ద్వంద్వాలు కనిపిస్తాయి. రాత్రీ పగలూ, సుఖమూ దుఃఖమూ. కవి వాటికి చెలిమి (కలయిక), ఎడబాటు రెండిటినీ కలిపారు. ఈ ద్వంద్వాలను ఎదుర్కొనడానికి ఒక మనసు చాలదు. రెండు కావాలి.

'తనువుకొక్క గాయమైన మాసిపోవు చితిలోనైనా మనసుకొక్క గాయమైన మాసిపోదు ఏనాడైనా' అని మరొక తెలుగు చిత్రంలోని పంక్తులను తలపించేలా "శరీరానికి గాయమైతే మందు వేసుకోవచ్చు - మనసుకు గాయమైతే ఆ మనసు పాపం ఏం చేసుకోగలదు?" అని ప్రశ్నిస్తుంది తమిళగీతం.

కళ్లు చూస్తాయి. కనిపించే వాటివల్లే కళ్లకు ఇబ్బందులు. అవతలి వ్యక్తి గురించిన దృష్టిని బట్టే ప్రేమ పుడుతుంది. ఆ దృష్టిని ఆ ప్రేమే దండించే సందర్భమూ రావచ్చు. ప్రేమ విఫలం అయితే? ప్రేమను దేవుడు దండించినట్టు భావించాలని 'వసంతమాళిగై' నాయకుడి అభిప్రాయం. దృష్టి కళ్లను దండిస్తే ప్రేమ దృష్టిని దండిస్తుందట. ప్రేమను దేవుడు దండిస్తున్నాడట. 'మరి దేవుణ్ణి దండించడం ఎలాగా?' అంటాడు ఆ నాయకుడు. తెలుగు పాటలో దేవుడు మనిషికి వేసిన శిక్ష ప్రస్తావన కన్నా తమిళగీతంలోని దేవుడికి శిక్ష వేయడం ఎలాగా అన్న ప్రశ్న భిన్నంగా కనిపిస్తుంది.

రెండు మనసులు కావాలన్న కణ్ణదాసన్ రాసిన పాట ప్రభావంతో కావచ్చు- ఆ తర్వాత ఒక తెలుగు చిత్రంలో ఒక పాట వినిపించింది.

సన్నివేశం ఒకటే అయినా ఇద్దరు మహాకవులు ఎంత గొప్పగా ఎంత మౌలికంగా రాయగలరో చెబుతాయి - 'మనసుగతి ఇంతే' 'ఇరణ్డు మనమ్ వేణ్డుమ్' పాటలు.

తెలుగు పాటలో వినిపించిన వరసనే మహాదేవన్ తమిళగీతంలోనూ కొద్ది మార్పులతో వినిపించారు. ఘంటసాల పాటనూ సౌందరరాజన్ పాటనూ ఒకదాని తర్వాత మరొకటి వింటే ఎలా ఉంటుంది? 'రెండు చెవులు చాలవు నాలుగు కావాలి' అనే పల్లవితో మరొక పాట రాసుకోవాలి.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**



# విలక్షణ గళం అల్తాఫ్‌కే సొంతం




"అంఖ్‌హీ న రోయీహై... దిల్ భీ తెరె ప్యార్ మె రోయాహై'-
హమ్‌నె తేరి ఖాతిర్ అప్‌నా... సజనా... చైన్ సుకూన్ భీ ఖోయాహై"
"పహ్లేతో కభీ కభీ గమ్ థా-
అబ్‌తో హర్ పల్‌హీ తెరీ యాద్ సతాతీ హై"

'కనులే కాదు... నీకోసం నామనసుకూడా రోదిస్తోందన్న' మాట విన్న తర్వాత... ఆ మనిషిని, అతని బాధను ఒంటరిగా వదిలి ఎవరైనా తమదారిన తాము వెళ్ళిపోగలరా! 'అయ్యోపాపం.. అతని కష్టం ఏమిటో విందాం' అని అనుకోవటం సహజం కదా! ఆ బలహీనతే అల్తాఫ్‌రాజాకు వరమైంది. కేవలం మెదడుకు పట్టే పాటల్ని కాకుండా మనసుకు పట్టే విరహగీతాలకు తన విలక్షణ గళంలో అల్తాఫ్‌రాజా జీవం పోసాడు. ఆ పాటల్ని విన్నామంటే ఇక మనం నిద్రలేని రాత్రుల్ని గడపాల్సిందే. అయితే సంగీతప్రియులకు అదే శాపం, అదే వరం కూడాను.

ప్రియురాలి జ్ఞాపకాల సతాయింపును, వేధింపును అతను తలచుకుని పాడుతుంటే - ఆ వేదన, ఆ తీయని బాధ మనవిగానే మనం ఆ పాటల్ని విన్నప్పుడు భావిస్తాం. ఓ గాయకుడికి అంతకంటే కావాల్సింది ఏముంటుంది!

దాదాపు పదిసంవత్సరాలుగా భారతీయ సంగీత ప్రపంచంలో గాయకుడిగా రాణిస్తున్న అల్తాఫ్‌రాజాకు రావాల్సినంత గుర్తింపు, ప్రచారం రాలేదనే చెప్పాలి. ఇవాళ ఇండిపాప్‌లో ఒకే ఆల్బమ్‌తో రాత్రికిరాత్రి స్టార్ అయిపోతున్న గాయనీగాయకులు ఎందరో వున్నారు. 1997లో 'తుమ్ తో ఠహరె పరదేశీ' ఆల్బమ్ దాదాపు 20లక్షలకు పైగా అమ్మకాలు జరిపి రికార్డ్ సృష్టించినా- అల్తాఫ్‌రాజా పేరుకోసం, తనదైన స్థానంకోసం పాకులాడలేదు. పైగా అప్పట్లో ఎంటీవీ సినిమాయేతర పాటల ఆల్బమ్‌లో అత్యధిక అమ్మకాలు జరిపిన గాయకుడిగా అల్తాఫ్‌ని గుర్తించడానికి కూడా నిరాకరించింది. ఈవిషయంలోనూ అల్తాఫ్ నిరసన వ్యక్తం చేయలేదు సరికదా; 'అది వాళ్ళ నిర్ణయం - కాదని అనడమెందుకు' అని తేల్చేశారు. "వాళ్ళ దృష్టిలో నేను ఖవ్వాలి గాయకుడిని- ఈ రకమైన కేటగిరిలో చేర్చి నన్ను పక్కన పెట్టారు. ఖవ్వాలి, గజల్స్ కూడా అన్ని ప్రక్రియల్లాంటివే. ప్రతిభ వుంటేనే ఏ గాయకుడికైనా గుర్తింపు వస్తుంది. ఆ గుర్తింపు నాకు లభించింది.పైగా ఛానల్ వి అవార్డ్ నాకొచ్చింది. కాబట్టి బాధ పడలేదు" అని అల్తాఫ్ సర్దిచెప్పుకున్నారు.

గాయకుడిగా తన కెరీర్ ప్రారంభంగురించి ముచ్చటిస్తూ" కొంకణ్ ప్రాంతంలోని రత్నగిరి మా స్వస్థలం. మా అమ్మ రాణీరూపలత, నాన్నగారు

ఇబ్రహీం ఇక్బాల్. వాళ్ళిద్దరికీ సంగీతంలో ప్రావీణ్యం వుంది. ఖవ్వాలీ, గజల్స్ గానం చేస్తుండేవారు. అలా వాళ్ళ నుండేనాకు కాస్త సంగీత జ్ఞానం అబ్బింది. నేనైతే నాగపూర్‌లో పుట్టాను. ఆ తర్వాత మా కుటుంబం ముంబాయికి మారింది. విద్యాపరంగా ఆలోచిస్తే నేను చదివింది తక్కువే. పదవతరగతి వరకే చదివాను. అదీ పాస్ కాలేదు. మొదటనుండి నాకు సంగీతం పట్లే మమకారం వుండేది. అందువల్ల ఇవాళ టెన్త్ తప్పానని చెప్పుకోవడానికి నేనేమీ ఫీల్ కాను. జీవితం ఎన్నో విషయాలను నేర్పితే సంగీతం నాకు .జీవితాన్ని ప్రసాదించింది" అంటారు అల్తాఫ్‌రాజా.

సంగీతశిక్షణ గురించి చెబుతూ "అమ్మ, నాన్నలతో కలిసి 18 సంవత్సరాల వయస్సులోనే స్టేజ్ పెర్ఫార్మెన్స్ ఇచ్చాను. సంగీతం అనేది కేవలం జీవనాధారం అని మా తల్లిదండ్రులు ఎప్పుడూ అనుకోలేదు. అదే నా జీవితం అనీ, నా ఆలోచనా అదే అనీ గ్రహించగానే సంగీతంగురించి వాళ్ళకి తెలిసినందంతా నాకు నేర్పారు. 15సం॥రాల వయసులో ఇక్బాల్ ఖాన్ దగ్గర హార్మోనియం, ప్రకాష్‌శర్మ దగ్గర కీ-బోర్డ్, పండిట్ గోవిందప్రసాద్ దగ్గర శాస్త్రీయ సంగీతం నేర్చుకున్నాను. అలానే ఉర్దూ చదవడంకోసం ఎంత శ్రమపడ్డానో చెప్పలేను. ఎన్నో పుస్తకాల్ని, గీతాల్ని సేకరించాను. ఇప్పటికీ నాకు పుస్తకాలు చదవటమంటే పిచ్చి, సంపాదనలో అధికమొత్తాన్ని పుస్తకాలు కొనడానికే వెచ్చిస్తాను" అని చెప్పారు.

## వీనస్‌తో అనుబంధం

గాయకుడిగా విజయపథంలో సాగిపోతున్న అల్తాఫ్‌రాజాకు వీనస్ రికార్డ్ సంస్థతో అనుబంధం దశాబ్దానికి పైగా వుంది. ఆ వివరాలు చెబుతూ "మా గురువుగారు మహ్మద్ షఫీ నియాజీ దగ్గర శిష్యరికం చేస్తున్న రోజుల్లోనే ఆయన వీనస్ రికార్డ్స్ సంస్థకు నన్ను పరిచయం చేశారు. 1993లో నా తొలి భక్తిగీతాల ఆల్బమ్ విడుదలైంది. ఆ తర్వాత మరికొన్ని డివోషనల్ ఆల్బమ్స్ విడుదలై విజయం సాధించాక ఖవ్వాలి, గజల్స్ గీతాల ఆల్బమ్ 'తుమ్ తో ఠహరే పరదేశి' విడుదలైంది. ఇక అక్కడనుండి జీవితం మారిపోయింది. అయితే ఈ సక్సెస్ ఎప్పుడూ నేను తలకెక్కించుకోలేదు. ప్రేమ, సంతోషం.. వీటిముందు ధనానికి చోటులేదు. ఇవాల్టికి వీనస్ సంస్థలో నా అనుబంధం 10 ఏళ్ళగా కొనసాగుతోంది. వాళ్ళ కుటుంబసభ్యుల్లో నేనూ ఒక్కణ్ణి, నాకు గాయకుడిగా ఎవరూ అవకాశం ఇవ్వని రోజుల్లో వీనస్ సంస్థ నా మీద నమ్మకాన్ని వుంచింది. కాబట్టి ఆ నమ్మకాన్ని నేను చెడగొట్టను. నన్ను తిరస్కరించిన చాలా కంపెనీలు నా సక్సెస్ చూసి ఆ తర్వాత పెద్దమొత్తం పారితోషికాలతో నన్ను కలిశాయి. కానీ నామీద మొదటనుండి ప్రేమ చూపించిన సంస్థలోనే కొనసాగాలనే తలంపుతో ఆ అవకాశాలను వదులుకున్నాను. డబ్బుకంటే విశ్వాసం గొప్పదని నేను భావిస్తాను. మా అమ్మనాన్నల నుండి నేను నేర్చుకున్నది అదే" అంటారాయన.

నవరాత్రి సందర్భంగా 'మయ్యా మేరి ఝోలీ భర్ దే', సాయిబాబా భక్తిగీతాలు, పంగా లేలియా, 'తుమ్‌తో ఠహరె పరదేశి', దిల్ కె టుక్డే హజార్ హుయే... తదితర ఆల్బమ్స్ తర్వాత అల్తాఫ్ తాజాగా 'ఏక్ దర్ద్ సభీ కో హోతా హై'ను విడుదల చేశారు. బాలీవుడ్ కూడా అల్తాఫ్ విజయాలను గుర్తించింది. అమిర్‌ఖాన్ 'తుమ్‌తో ఠహరె పరదేశి' పాటను 'సర్ఫరోష్' చిత్రంలో ఉపయోగించు కోవాలనుకున్నారు. అదే కాకుండా 'శపథ్' చిత్రంలో అల్తాఫ్‌రాజా ఓ పాటను పాడటమే కాకుండా జాకీష్రాఫ్, మిథున్ చక్రవర్తిలతో కలిసి తెరమీద కనిపించారు కూడా. మరికొన్ని చిత్రాలకూ అల్తాఫ్ నేపథ్యగానాన్ని అందించారు.

## ఎందరో స్ఫూర్తి దాతలు...

తల్లిదండ్రులతో పాటు గాయకుడిగా తనకి స్ఫూర్తిదాతలు ఎందరో వున్నారని అల్తాఫ్ చెబుతుంటారు. మహ్మద్‌రఫీ, కిశోర్‌కుమార్, ముఖేష్, తలత్‌మహ్మద్, హేమంత్‌కుమార్, కె.ఎల్.సైగల్, నూర్జహాన్, లతా మంగేష్కర్, ఆశాభోంస్లే, గీతాదత్, ఉస్తాద్ బడేగులామ్ అలీఖాన్, ఉస్తాద్ నస్రత్ ఫతే అలీఖాన్... ఇలా ఎందరిదో ప్రభావం నామీద వుంది అని అన్నారు అల్తాఫ్.

భవిష్యత్ ప్రణాళికల గురించి చెబుతూ "రేపటి గురించి ఆశలు పెట్టుకోవటం అలవాటు లేదు. గాయకుడిగా పేరు తెచ్చుకున్నా నాకు సంగీత దర్శకత్వం వహించాలని మాత్రం వుంది. అయితే ఆ కల కూడా నిజం కాబోతోంది. మనీషా కొయిరాల నటిస్తున్న ఓ చిత్రానికి సంగీతం సమకూర్చే బాధ్యతని వీనస్ సంస్థే ఇచ్చింది. నెరవేరే లక్ష్యాన్ని పెట్టుకుని సాధించడానికి కృషి చేసే ఓ సామాన్య గాయకుణ్ణి నేను... అంతే" అంటారు అల్తాఫ్ రాజా.

ఆయన పాటల్లోని పదాలు పైకి సరళంగా కనిపించినా ఆ భావాల లోతుల్లోకి వెళ్ళితే గుండెల్ని పిండి చేస్తాయి... అందుకే విరహగీతాలాపనలో అల్తాఫ్ మకుటంలేని రాజు.

**- వి.అరుణ సత్యవతి**



| | | |
|---|---|---|
| ☛ | పుట్టిన నెల, సంవత్సరం | : అక్టోబర్, 1967 |
| ☛ | జన్మస్థలం | : నాగపూర్ (మహారాష్ట్ర) |
| ☛ | తల్లి దండ్రులు | : రాణీ రూపలత, ఇబ్రహీం ఇక్బల్ |
| ☛ | చదువు | : ఎస్.ఎస్.సి (ఉత్తీర్ణుడు కాలేదు) |
| ☛ | గాడ్ ఫాదర్ | : లేటు మహ్మద్ షఫీ నియాజీ |
| ☛ | సంగీత గురువులు | : ఇక్బల్ ఖాన్, ప్రకాష్ శర్మ, పండిట్ గోవిందప్రసాద్ జైపూర్‌వాలా, లేటు మహ్మద్ షఫీ నియాజీ. |
| ☛ | సాధించిన విజయం | : 'తుమ్‌తో ఠహరె పరదేశీ' ఆడియో 20లక్షలకు పైగా అమ్ముడుపోయి 1997లో రికార్డు సృష్టించింది. |
| ☛ | కోరిక | : సినిమాకు సంగీత దర్శకత్వం వహించటం (త్వరలో తీరబోతోంది) |



# బాపు విశ్వరూపం 16

ఇలస్ట్రేటర్ అయినవారికి వృత్తిరీత్యా అనేక కథలు చదవాల్సి వుంటుంది. అన్ని కథలూ బాగుండాలన్న రూలు లేదు కాబట్టి, చదివి చదివి కథలంటేనే విసుగుపుట్టే 'ఆక్యుపేషనల్ హజార్డ్' కూడా ఉంది వారికి. అలాటి పరిస్థితుల్లో ఓ మంచి కథ తారసిల్లితే వారికి ప్రాణం లేచివస్తుంది. కుంచెకు హుషారొస్తుంది. వృత్తిరీత్యా అనేక కథలు చదవడం వలన మంచికథలేవో, కాని కథలేవో ఇలస్ట్రేటర్లు సులభంగా చెప్పగలుగుతారు. వారి ఆమోదముద్ర పడిందంటే నిస్సందేహంగా అది మంచి కథేనని చెప్పుకోవచ్చు.

చక్కటి చదువరి అయిన బాపుకి కూడా నచ్చిన కథలుండి వుంటాయి. బహుశా వందల సంఖ్యలో ఉండి ఉంటాయి. వాటిని పాఠకులకు పుస్తకరూపంలో అందించాలన్న కోరిక కలిగిందాయనకు 1960లో. 1958 తర్వాత వెలువడిన కథలలో కొన్ని విశిష్టమైనవి ఎన్నిక చేసి, పదకొండు కథలను 'కథ' అనే పేరుతో సంకలీకరించి వేశారు 'కూర్పరి బాపు.'

రచయిత కావడం ఒక ఎత్తు. సంకలనకర్త కావడం మరో విద్య. కథలను ఎంపికచేయడమే కాదు, వాటిని పుస్తకరూపంలో తెస్తూ వాటి ఇలస్ట్రేషన్స్ అన్నింటినీ ఒకే మోడల్లో, ఒకే సైజులో ఉండేట్లా మళ్లీ 'డ్రా' చేసి పాఠకులకు కనువిందు చేశారు బాపు. బాపు అభిమాని, రచయిత డా.విజయమోహన రెడ్డి (అనంతపురం) పంపిన బాపు మరో పార్శ్వం - 'బాపు, ది ఎడిటర్!'














సీతాలు జడుపడ్డది

* పూసపాటి కృష్ణంరాజు



వరలక్ష్మినే వరుడు

*రుద్రాభట్ల నరసింగరావు



వర్షం * రాచకొండ విశ్వనాథశాస్త్రి



నల్లతోలు * సి.రామచంద్రరావు



మాడంత మబ్బు

*కళ్యాణసుందరీ జగన్నాథ్



మాయమైన మనీపర్సు

*రావి కొండలరావు

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



శాస్త్రి, సంగారెడ్డి

ప్ర: సినీ నటి కెవ్వున భయంతో అరిచేదెప్పుడు?

జ: తను వ్యాపార ప్రకటన ఇచ్చిన కంపెనీ సబ్బే తన బాత్‌రూమ్‌లో కనపడినప్పుడు.

ప్ర: పెళ్లాం వంటిమీద ఈగ వాలినా సహించలేని వాణ్ణేమనాలి?

జ: బెల్లం వ్యాపారి అనాలి

ప్ర: పూలమ్మిన చోటే కట్టెలమ్మడమంటే?

జ: కునుకు తీసిన కుర్చీలోనే పనిచేయాల్సి రావడం.

ప్ర: రిటైర్‌మెంట్ అంటే ప్రభుత్వ ఉద్యోగికి బెంగ ఎందుకు?

జ: ఇకపై పగటి నిద్రకి జీతం దొరకదని.

ప్ర: తెలివైన మేస్త్రీ?

జ: ఫ్లోరింగ్ సమంగా లేదేంటయ్యా అంటే, 'భూమి గుండ్రంగా ఉంది కదండీ' అనేవాడు.

## ఈ రూటేవేరు




Statue King = మూర్తి రాజు

- బి. శ్రీనివాసాచారి, హైద్రాబాద్

పేజీ = చెల్లించండీ

- డి. పద్మినీప్రసాద్, విశాఖపట్నం

మెండు = మగవాళ్ళు చేసేది (Men Do)

- బి.వి.ఆర్, రుద్రారం.



## పేరు - రిపేరు



టక్కరిదొంగ - చిక్కడు దొరకడు - ఛాలెంజ్ - పట్టుకోండి చూద్దాం

ముద్దుబిడ్డ - నీకోసం - 9 నెలలు - వేచివుంటా - ప్రేమతో - అమ్మ

- శ్రీ, మానెంవారి పాలెం, ఆచంట

త్రిశూలం - ఈశ్వర్ - ఆయుధం

- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ

## చిలిపి లిపి



URA ★ = నువ్వు ఒక తార

ICU = నేను నిన్ను చూస్తున్నా

-శాస్త్రి, సంగారెడ్డి

Tongue Tour = టంగుటూరు

-మేడా మస్తాన్ రెడ్డి, పూణె

## డబుల్ రోల్



ఈ పూట 'నెయ్యి' లేదు. తినకపోతే మా'నెయ్యి'.

**- సోమయాజుల సాయిప్రసాద్, ఒనకఢిల్లీ(ఒరిస్సా)**

ఆ 'ముని'కి తెలియదా 'రాముని' శక్తి!?

**- టి.ఎల్.ప్రసాద్, విశాఖపట్నం**

'కని'పెంచే అమ్మానాన్నలే 'కని'పించే దైవాలు

**- ఎల్. శ్రీనివాస్‌రెడ్డి, కొంగర్‌కలాన్**

## చిలిపి కవిత



ఆమెది అందమైన ఫేసు
వళ్లంతా తెగ గ్రేసు
అయినా నా ప్రేమ ప్రయత్నం స్లో రేసు
ఎందుకంటే ఆమె ఆడ పోలీసు

**- డా॥ నెల్లుట్ల, సికింద్రాబాద్**

## పేరడీ పేరేడ్



ప: కరిచిందిలే కరిచిందిలే
పొరుగింటి ఆ కుక్క కరిచిందిలే
చ: నను చూసి కనుగుడ్లు తిప్పిందిలే
వెనువెంటనే పైకి దూకిందిలే ॥నను॥
ఏముందిలే ఇంకేముందిలే ॥2॥
తృటిలోనె తొడ కండ ఊడిందిలే... ఊడిందిలే ॥కరిచిందిలే॥
చ: పదునైన దంతాలు గల కుక్కది
ప్రతిరోజు నను చూసి మొరిగేదది ॥పదునైన॥
పట్టిందిలే పగ పట్టిందిలే ॥2॥
అయ్యారే! నాదుంప తెంపిందిలే... చంపిందిలే ॥కరిచిందిలే॥
చ: బోర్లంత నా బ్లడ్డు పోయిందిలే
బొడ్డంత చిరు జల్లెడయ్యిందిలే ॥బోర్లంత॥
కుక్కేమిటో ఈ కాటేమిటో ॥2॥
మతిపోయి మంచాన పడిఉంటినే... చెడిఉంటినే
॥కరిచిందిలే॥

**-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.**

(రాముడు భీముడు చిత్రంలో "తెలిసిందిలే... తెలిసిందిలే" పాటకు పేరడీగా)

## షార్ట్‌కట్స్




లంక గాయత్రి = లంగా
గంధం పరిమళ = గంప
పాలడుగు పిచ్చయ్య = పాపి

**- బోడపాటి కృష్ణవేణి, చెన్నై**





నలభై ఏళ్ళుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది

# నవ్వించగల సెన్సార్రథం-2

**ఓ** బొంగరాల బుగ్గలున్న దానా నీ హంగు చూసి పొంగి పోతి జాణ నీ తస్సదియ్య తాళలేనే' అనే పాట -డాక్టర్ చక్రవర్తి సినిమాలోది. దాశరథి గారు రాశారు. ఆ పాట చూసి, విని సెన్సారు వారు 'తస్సదియ్యా' అన్నమాట తీసెయ్యమన్నారు. అది అనభ్యమూ అనహ్యమూ అయిన మాట అన్నారు. 'తస్సదియ్య' అనేది మామూలు ఊతపదం అనీ, దాంట్లో అసభ్యత లేదనీ, 'తస్స' అన్న మాటకి డిక్షనరీలో అర్థం చూసుకుంటే 'దుర్మాంసము' అని వుంటుందనీ దాశరథి గారు, దర్శక నిర్మాతలూ వాదించి నిఘంటువుతో నిరూపిస్తే సెన్సారు వారు ఒప్పుకున్నారు మొత్తానికి.

కొంతకాలం క్రితం సెన్సార్ రూళ్ళ(క్ర)లో ఒక రూలుండేది. పెళ్ళికాని పిల్ల గర్భవతి కాకూడదు అని. ఈ రూలు వాహిని వారు బి.ఎన్.రెడ్డి దర్శకత్వంలో తీసిన "దేవత" (1941) సినిమా నాటికి లేదు. అందులోని హీరోయిన్ వివాహం కాకుండానే గర్భవతి అవుతుంది. 1962 ప్రాంతాల, 'పూజాఫలం' సినిమాకు ముందు అదే దేవత కథని మళ్లీ సినిమాగా తీయాలని ఆయన ఆలోచన చేసారు. ఈ ఇరవై ఏళ్లలో సెన్సార్రూళ్లు మారాయి. పెళ్లికానిదే గర్భం ధరించరాదన్న రూలు వచ్చేసింది. కథలోని పాయింటు దాని మీదే వుంది కనుక, సినిమా తీయడం ఇబ్బంది అవుతుందే అని- బి.ఎన్.రెడ్డి గారు, అప్పటి సెన్సారు అధికారి జి.టి.శాస్త్రిని వెళ్లి కలిసారు. తన కథలోని సమస్యని చెప్పారు."సెన్సారుకి ఒక రూలుండదు. ఇది కోర్టు చట్టంలాంటిది కాదు. ఇవాళ వున్న రూలు రేపు, రేపున్న రూలు ఎల్లుండీ వుండదు."ఒకరు చేసిన కర్మవారనుభవించకా" అన్నట్టు ఒకరేదైనా రూలు ఉల్లంఘిస్తే అది అందరిమీదా పడుతుంది. పైగా ప్రాంతీయంగా కూడా రూళ్లలో మార్పులుంటాయి. హిందీ సినిమాలకీ, తెలుగు సినిమాలకీ రూళ్లలో భేదాలుంటాయి- సెన్సారు బోర్డు కేంద్రీయమైనదైనా " అని శాస్త్రి గారు బి.ఎన్.గారితో చెప్పి ఆ కథని మానేయమన్నారు. బి.ఎన్.రెడ్డి గారి చివరి చిత్రం "బంగారు పంజరం" ఆయన ఎప్పుడూ గొప్పగా చెబుతూ వుండేవారు-" నాటి, నా 'వందేమాతరం' సినిమా నుంచి, 'బంగారు పంజరం' వరకూ ఏ సినిమాలోనూ కూడా సెన్సారు కట్ లేదు. అన్నీ క్లీన్ సర్టిఫికేట్లే వచ్చాయి" అని, దానికి, ఇంకో ప్రసిద్ధ నిర్మాత పి.పుల్లయ్యగారు స్పందించారు. "అదేం గొప్ప! సినిమా అలా తియ్యడంలో త్రిల్లేదీ? టెన్షన్ ఏదీ?" అని వ్యాఖ్యానం చేసారు. ఆయన తీసిన అన్ని సినిమాల్లోనూ కట్స్ పడ్డాయిట-"శ్రీ వెంకటేశ్వర మహత్యం"లో కూడా.



'దేవత' (1941) చిత్రంలో కుమారి, నాగయ్య

1957లో "శోభ" అనీ, ఓ సినిమా వచ్చింది. అందులో ముక్కామల, రాజసులోచనల మధ్య ప్రణయ సన్నివేశంలాంటిది ఉంది. రాజసులోచన పడుకుని వుండగా, ముక్కాముల మంచం మీద కూచుని మాట్లాడుతూ వుంటారు. రాజసులోచన నజిషన్‌లోని ఒక షాటుని సెన్సారు వారు కట్ చెయ్యమన్నారు-ప్రణయ పరంగా అదోలా వుందని. సినిమా ఆఖర్లో వచ్చే ఇంకో సన్నివేశంలో కూడా అదే యాంగిల్‌లో షాట్ వుంటుంది. అయితే అది ప్రణయ సన్నివేశం కాదు, ఆమె మరణ సన్నివేశం. సెన్సారు వాళ్లు ఆ షాట్‌ని ముట్టుకోలేదు. "రెండు షాట్లూ ఒకేసారి, ఒకే యాంగిల్‌లో తీసాం కదా, ఇది వుంచుతున్నప్పుడు అది ఎందుకు వంచరూ?" అని అడిగితే, "అది ప్రణయ సన్నివేశంగదాని షాటుని మాత్రం తీసిపారేశారు.

నిర్మాతల్లో కొందరు తెలివైన వాళ్లుంటారు. సెన్సారు వాళ్లు లాగేసిన కొన్ని షాట్లని, "ఆఁ -చూడొచ్చారా ఏమిటి?"అని అటూ ఇటూ చూసి కలిపేస్తారు. ఒకసారి ఒక సెన్సార్ అధికారికి అలా కలిపేసిన విషయం చెప్పగా-ఆయన అన్నార్ట-''అది మా పరిధిలోకి రాదు. తొలగించడం వరకే మా డ్యూటీ. అలా దొంగతనంగా కలిపితే, పట్టుకోవలసినది పోలీసులు!" అని సమాధానం ఇచ్చార్ట. సినిమాలో సెన్సారు వాళ్లు కట్ చేసినది ఏమిటో, ఒక లిస్ట్ ఆ సినిమా ప్రదర్శింపబడుతున్న థియేటర్ గుమ్మంలో అతికించాలని ఒక రూలు. ఇ ప్రకారం ఆ షాట్లు గాని, సన్నివేశాలుగాని సినిమాలో వుంటే, పోలీస్ వారికి ఫిర్యాదు చేయ్యాలిట. మరి, అలాంటి 'లిస్టు' చూసిన వాళ్లెవరైనా వున్నారా అని!

విజయా సురేష్ పేరిట రామానాయుడు గారు 'పాపకోసం' తీసారు 1968లో. అందులో ఇద్దరు



బ్రాహ్మణులు వుంటారు. (తెలుగు భాషలో ఓ ఇబ్బంది ఉంది."బ్రాహ్మణ పాత్రలు" అని అంటే 'వుంటాయి'-అనాలి. బ్రాహ్మణులు అంటే 'వుంటారు' అనాలి) ఈ పాత్రలు రెండూ రైల్లో ప్రయాణిస్తూ ఉంటాయి. ఒక బ్రాహ్మణుడు (నేను వేసాను. ఇంకోటి అల్లు రామలింగయ్య గారు) ఓ డైలాగ్ అంటాడు :"ఇంకా ఎక్కడుందయ్యా బ్రాహ్మణ్యం? ఎప్పుడో పోయింది" అని. ఈ డైలాగు ప్రమాదకరమైందనీ, మొత్తం బ్రాహ్మణ జాతి కదిలొచ్చి గందరగోళం సృష్టిస్తుందనీ, అంచేత నిర్దాక్షిణ్యంగా నరికి పారేయాలనీ తీర్మానించారు సెన్సారు వారు. నిర్మాతలు వాదించారు. "అయ్యా! ఈ డైలాగు వల్ల ఏ ముప్పూ వుండదు. ఆ డైలాగు రాసిన వారు బ్రాహ్మణులు(ఆత్రేయ), వేసిన వారు బ్రాహ్మణులు(రావికొండలరావు), తీసిన వారు బ్రాహ్మణులు (జి.వి.ఆర్.ఆదిశేషగిరిరావు) అంచేత ఏ ఇబ్బందీ రాదు- మాది పూచీ" అన్నారు. "అలాగయితే ఆ ముగ్గుర్నీ ఇక్కడికి రప్పించండి. ఆ డైలాగు వల్ల బ్రాహ్మణవర్గానికి ఎలాంటి అభ్యంతరమూ వుండదనిన్నీ, వుంటే సెన్సారు వారికేమీ సంబంధంలేదనిన్నీ, వారిదే బాధ్యతనిన్నీ పూచీకత్తు రాసి ఇవ్వమనండి. ఆ డైలాగుని ఆటే పెడతాం" అని ఒకరకంగా దారికొచ్చారు సెన్సారు వారు. "కచ్చితంగా మాదే పూచీ, మాదే బాధ్యత" అన్నారు ఆ డైలాగుకి బాధ్యత వహించిన ముగ్గురూ ముక్తకంఠంతో. అయితే, పూచీ రాయలేదుగాని, అంత గ్యారంటీగా చేప్పే సరికి, "సరే" అనేసి డైలాగు వుంచేసి ఊరుకున్నారు-సెన్సారువారు.

"మనుషులు-మమతలు" అని, 1965లో వచ్చింది. అంతకుముందు 'వక్త్' అని, హిందీ సినిమా వచ్చింది. అందులో సాధనకి స్విమ్మింగ్ దుస్తులు వేసారు. అవి బాగున్నాయనీ, ఆ దుస్తుల్లో ఆమె అందంగా వుందనీ అలాంటి దుస్తులే'మనుషులు-మమతల్లో' నాయిక జయలలితకి వేశారు. సెన్సారు వారు పూర్తిగా తిలకించి, పులకించాక తొలగించాలని "కాట్" అనీ, 'నో' అనీ కేకలు వేశారు; "అసభ్యంగా వుంది-ఈత దుస్తులు" అన్నారు. "అయ్యా సెన్సారు వారూ! స్విమ్మింగ్ చేసేటప్పుడు స్విమ్మింగ్ డ్రెస్ వేసుకుంటారు గాని, పట్టుచీరలు కట్టుకుంటారా" అని అడిగారు నిర్మాతల పక్షంవారు. ఆ పక్షం వారు వినలేదు. "వక్త్ సినిమాలో ఇదే డ్రస్సు వుంది కదండీ" అని వాదించినా ప్రయోజనం లేదన్నారు. "అది నార్త్. ఇది సౌత్. అక్కడి వారి దుస్తులు వేరు, మన దుస్తులు వేరు" అని సెన్సారు వారు, ఆ దుస్తుల్నయినా తొలగించమన్నారు, దృశ్యాన్నయినా తొలగించమన్నారు. చివరకు వారే దృశ్యాన్ని తొలగించి, పైగా సినిమాకి 'ఎ' సర్టిఫికేట్ ఇచ్చారు! పెద్దవాళ్లే చూడాలన్నారు. కాని చిన్నవాళ్లు చూశారు. 'ఎ' సినిమాలు కొన్ని "ఎయు' అని కొన్నీ వుంటాయి. 'ఎయు' అంటే పెద్దవాళ్లు పక్కన వుండగా పిల్లలుకూడా చూడతగ్గ సినిమాలు. ఇందులో అంతరార్థం ఏమిటో అర్థం కాదు మరి. పక్కనే వున్నపెద్దవాళ్లు-పిన్నలు చూడకూడని దృశ్యాలు రాగానే కళ్లు మూయ్యాలని కాబోలు. అయితే ఇవాళ 'యు' సినిమాలనిండా భయంకరమైన దృశ్యాలు, ముద్దులు, పొట్టలు, తొడలూ, నీళ్లలో స్నానాలూ అన్నీ విరివిగా, విచ్చలవిడిగా వుంటున్నాయి. 'ఎ'లూ, 'ఎయు'లూ, 'యు'లూ అన్నీ ఒకటే- సర్టిఫికేట్లు తేడా గాని! "అయితే ఇవాళ అన్నీ అడల్ట్స్ సినిమాలే. పిల్లలకి కావల్సినవి అని ఏమున్నాయి గనుక? " అని ఒక గృహిణి అన్నారు. "పిల్లల కోసం అని ప్రత్యేకంగా సినిమా తీస్తే పిల్లలు చూడక చూడరు. పెద్దవాళ్ల సినిమాలే వీళ్లూ చూస్తారు. అందుకే పిల్లలకోసం అని ప్రత్యేకంగా సినిమాలు రావడం మానేసాయి." అని ఇంకో గృహిణి అన్నారు. ఇవాళా సెన్సారు బోర్డు వుంది- అన్ని సినిమా నిర్మాణ కేంద్రాల్లోనూ. అయితే బోర్డు మాత్రం వుంది-వేల్లాడుతూ.

విశేషం: ఒక నిర్మాత కష్టపడి, కృషిచేసి చర్యలు చేసి బాలలకోసం అని ప్రత్యేకంగా 'బాలల చిత్రం' అని పేరు పెట్టి ఒక సినిమా తీసాడు. సెన్సారు వారు ఆ సినిమాకి 'అడల్ట్ సర్టిఫికేట్' ఇచ్చారు! తప్పెవరిదో కనిపెట్టగలరా?

# 'సం' గీతా రహస్యాలు

**బి.ఎన్.రెడ్డిగారు చెప్పినది:**

"మల్లీశ్వరి షూటింగ్ జరుగుతోంది. కొన్ని పాటలు రికార్డయినాయి. ఇంకా కొన్ని చెయ్యాలి. వియోగానంతరం మల్లి, నాగరాజులు తుంగభద్ర ఒడ్డున కొలను దగ్గర కలుసుకునే దృశ్యం తియ్యలేదు. అక్కడ పాట పెట్టాలని ఆలోచిస్తున్నారు. అది చాలా హాయిగా వుండే చల్లని పాటగా వుండాలని ఆలోచన.



షూటింగులో లైటింగు అవుతూవుంటే, నేను(బి.ఎన్.రెడ్డి) కూచున్నాను, నా పక్కనే భానుమతి. తనేదో 'హమ్' చేస్తోంది. ఎందుకనో నాదృష్టి అటువెళ్లి, 'ఏమిటమ్మా, ఏదో ట్యూన్ అంటున్నట్టున్నావు. ఏమిటది?" అని అడిగాను. "జయదేవ అష్టపది- ధీరసమీరే...." అని చెప్పి నెమ్మదిగా పాడింది. అదే! అంతే! అలాగే వుండాలి నా పాట..... వెంటనే రాజేశ్వరరావుని పిలిపించాను. "అమ్మా- అదొక్కసారి పాడు" అన్నాను. 'ధీరసమీరే యమునా తీరే...' అని (యమునా కల్యాణి రాగంలో) తక్కువ స్థాయిలో నెమ్మదిగా హమ్ చేసింది.

'అలావుండాలి రాజేశ్వరరావు మనపాట' అన్నాను. అయితే ఆ పాటని 1937 ప్రాంతాల్లో వింజమూరి అనసూయ గ్రామఫోన్ రికార్డుగా ఇచ్చిందని తెలిసి, ఆమెను పిలిపించి పాడించాము. ఆ పాట స్పీడుగా, మామూలుగానే వుందిగాని, హాయిగాలేదు. కృష్ణశాస్త్రిగారు 'మనసున మల్లెల మాలలూగెనే' అంటూ రాశారు.

'ధీరసమీరే'కి దగ్గరగానే వున్నట్టు అనిపించినా, చల్లగా, మధురంగా హాయిగా స్వరపరిచాడు రాజేశ్వరరావు. అలా పుట్టిందా పాట!"

(సూర్యకుమారి పాడిన గ్రామఫోన్ రికార్డు "శ్రీలు పొంగిన జీవగడ్డలు...." (రాయప్రోలు సుబ్బారావు) వరసకూడా అలా, దగ్గరగానే వినిపిస్తుంది.

- ఆర్కే

# అయోమయ జగన్నాథం

- డా॥ శ్రీమతి కొరారి వాణీచలపతిరావు




"నమస్కారం జగన్నాథం గారూ...."

"ఎవరు?"

"నేను... ప్రకాశరావుని... మీ ఇంట్లోనే అద్దెకుంటున్నాను కదండీ-"

"ఓహో! అలాగా ఎన్నాళ్ళనుంచి అద్దెకుంటున్నారు మా ఇంట్లో-?"

"ఆరు నెలలనుంచీ-"

"ఎక్కడ పనిచేస్తారు?"

"స్టేట్ బ్యాంక్‌లో'

"పిల్లలు ఎంతమంది?"

"ఒక బాబు"

"ఓహో- అలాగా- రెంట్ ఎంతిస్తున్నారేమిటి?-"

ఆశ్చర్యంలో తలమునకలయ్యాడు ప్రకాశరావు.

"మూడు వేలండీ-"

"ఓహో! ఇల్లు సౌకర్యంగా ఉందా? ఇబ్బందులేమీ లేవుకదా-" పరామర్శించాడు జగన్నాథం.

వచ్చిన అవకాశాన్ని పోనిచ్చుకోకుండా "ఆ- పరవాలేదులెండి- ఏవో చిన్న చిన్న మార్పులు, రిపేర్లు వుంటే మేడమ్‌కి చెప్పాను. చేయిస్తానన్నారు గానీ ఇంతవరకూ-" అని గొణిగాడు ప్రకాశరావు.

"ఆ- ఆ- ఆ విషయాలన్నీ ఆవిడే చూసుకుంటుంది.... మీకింకా పెళ్ళి కాలేదని అన్నారు కదూ... మంచి సంబంధం ఒకటుంది చూస్తారా?"

"ఒక బాబు కూడా ఉన్నాడని అన్నానండీ-"

"ఓహో... అయితే... భార్య మాత్రం... ఇంకా రాలేదన్న మాట... మరి ఆ సంబంధం చూడండి మీరు... అమ్మాయి బాగుంటుంది..."

'మహాప్రభో' అని మనసులో అనుకుని "ఇంక నాకు శలవు ఇప్పించండి. అర్జంటుపని ఉంది-" అంటూ వెళ్ళబోయాడు ప్రకాశరావు.

"ఇదిగో ప్రసాద్‌రావ్-"

"ప్రకాశరావండీ-"

"ఆ- అదే - ప్రకాశరావు... మీరు రెండునెల్ల అద్దె బకాయి వున్నట్టున్నారు..."

తెల్లముఖం వేశాడు ప్రకాశరావు. "లేదండి... ప్రతినెలా... అద్దె.. ఠంచన్‌గా ఫస్టు తారీఖుకు

తెచ్చి మీ శ్రీమతిగారి చేతిలో పెడుతుంటాను-"

"అలాగా... అయితే మీరు కాదేమో... ఇంత కు ముందున్న వాళ్ళు అయి ఉండవచ్చు..."

ఇక లాభంలేదు.... అనుకుంటూ ప్రకాశరావు పరుగులాంటి నడకతో అక్కడినుంచి బయటపడ్డాడు.

వెళుతున్న ప్రకాశరావు వంక అయోమయంగా చూస్తూ 'ఏం మనిషో పట్టి వెర్రిబాగులవాడిలా ఉన్నాడు. ఏదో కొంపలంటుకుపోయినట్టు మాట్లాడుతూ మాట్లాడుతూ ఉన్నవాడు అలా పరుగు తీస్తూ వెళ్ళాడేమిటి? మా ఇంట్లోనే అద్దె కుంటున్నానంటాడు... ఎప్పుడూ ఒక్కసారి కూడా చూసినట్లు గుర్తుకురావడం లేదే ఇంతకూ అసలు ఎవర్నో చూసి ఎవరో అనుకుని నన్ను పలకరించలేదు కదా ఈ తిక్కమనిషి...' అని సీరియస్‌గా ఆలోచిస్తూ ముందుకు అడుగులు వేశాడు జగన్నాథం.

బస్‌స్టాండ్‌లో నిల్చుంటే పక్కనే కూరల దుకాణం కనిపించింది. అప్పుడుగానీ గుర్తుకురాలేదు.... బయటికొస్తున్నప్పుడు 'వచ్చేటప్పుడు కూరగాయలు పట్రండి' అని భార్య చెప్పిన విషయం.

వెంటనే కూరలదుకాణం ముందు నిలబడి "అమ్మాయ్... దొండకాయలెట్లా ఇస్తావ్?" అని అడిగాడు.

"కిలో పన్నెండు రూపాయలు సార్" అంది కూరలమ్మాయ్.

"చీపే" అని మనసులో అనుకుని "ఓ రెండు కిలోలు ఇవ్వు" అన్నాడు.

చకచకా తూకం వేసి జగన్నాథాన్ని ఉద్దేశించి "బ్యాగు ఉందా సారూ?" అని అడిగింది.

అప్పుడు గుర్తొచ్చింది జగన్నాథానికి ఇంటి దగ్గర బయలుదేరే ముందు ఇల్లాలు ఓ పల్చటి గుడ్డ సంచిని తన బొడ్లో దోపి పంపిన విషయం. ఆ సంచీని చూసినప్పుడయినా కూరలు తేవాలన్న విషయం గుర్తొస్తుందని ఆమె నమ్మకం.

"ఉంది" అంటూ సంచీ తీసి పట్టుకున్నాడు జగన్నాథం.

"టమాటాలు ఎంత?"

"చానా చీపు సార్ - కిలో 8 రూపాయలే?"

"అలానా! అయితే అవీ ఓ రెండు కిలోలు ఇయ్యి"

''ఇదేదో మంచి బేరం లాగుంది...'' అనుకుంటూ టమాటాలు తూచి సంచీలో పోసింది కూరలమ్మ.

''ఆలుగడ్డ ఓ కిలో ఇవ్వు... పచ్చి మిరపకాయలు కూడా ఓ కిలో... పాలకూర ఓ మోపెడు..."




"మోపెడేంది సారూ.... గిదేమన్నా గడ్డినా...?"

"అయితే అది కూడా తూకమేనా?"

అనగానే కిసుక్కున నవ్వింది కూరలమ్మాయి.

"రూపాయికి మూడు కట్టలు" అంది నవ్వును బలవంతాన ఆపుకుంటూ.

"అయితే ఓ పది రూపాయలది ఇవ్వు" అన్నాడు జగన్నాథం మనసులో పది ఇంటూ మూడు.... పది మూళ్ళు ముప్పయ్ అని ఎక్కాలు లెక్కిస్తూ.

"రేపు మనింట్లో ఏదన్నా పంక్షనా సార్?" అని అడిగింది కూరలమ్మాయి.

"మనిల్లా.... మనిల్లేంటి... అది మా ఇల్లు కదా?'' అయోమయంగా చూసాడు జగన్నాథం.

ఈసారి అతని వంక అయోమయంగా కూరలమ్మాయి చూసింది.

"ఉట్టినే మాటవరసకి అన్న సారూ... పంక్షనా?"

"ఫంక్షనా? లేదే? నాకు తెలియకుండా మా ఇంట్లో ఏం ఫంక్షనవుతుంది...?"

'ఈయనెవరో ఎతిమతం మడిసిలాగున్నాడు. ఇంకాసేపు మాట్లాడితే నాకు పిచ్చెక్కేలా వుంది' అనుకుని మారుమాట్లాడకుండా గమ్మునుండి పోయింది కూరలమ్మాయి.

పడుతూలేస్తూ... మోయలేక.. మోయలేక కూరల సంచీ మోస్తూ బస్టాండుకు వచ్చి నిల్చున్నాడు జగన్నాథం.

వేగంగా దూసుకొచ్చి... స్టాండులో ఆగీ ఆగకుండానే స్టార్ట్ అయ్యే బస్సులు కొన్ని, స్టాండుకు ఆమడదూరంలో ఆగి వెయిట్ చేస్తున్న వాళ్ళు పరుగెత్తుకుంటూ రాగానే వాళ్ళకి అందకుండా ఊరించి పరుగులెత్తే బస్సులు కొన్ని.. వీటితో కూరల సంచీతో సహా అటూ ఇటూ ఉరికి బస్సులతో 'ముట్టించుకునే' ఆట ఆడుకుని ఓడిపోయాడు జగన్నాథం. ఒక పక్కన చెయ్యి లాక్కొస్తోంది, కాళ్ళు పీకుతున్నాయి రన్నింగ్ చేసీ... చేసీ.... ఇక లాభం లేదని ఎదురుగా వున్న ఆటోని పిలిచి అందులో ఎక్కి కూర్చున్నాడు.

"ఎక్కడికెళ్ళాలి సార్?" ఆడిగాడు ఆటోవాలా.

"తిలక్‌రోడ్" అంటూ ఎక్కి కూర్చున్నాడు జగన్నాథం.

అరగంట ప్రయాణం చేసాక తిలక్‌రోడ్ వచ్చింది. అప్పుడు మీటర్ ముప్పయి అయిదు రూపాయలు.

"ఇదేంటి ఇక్కడికి తీసుకొచ్చావ్?"

"తిలక్‌రోడ్ ఇదే కదాసార్"



"తిలక్‌రోడ్ కాదు తిలక్ నగర్ వెళ్ళాలి నేను"

"మరి అలా చెప్పారేంటి?"

"రెండూ ఒకటే అనుకున్నాను. తిలక్‌రోడ్ అనేది వేరే వుందా?"

"ఉండబట్టే కదా తీసుకొచ్చాను"

"ఆ విషయం నేను ఆటో ఎక్కగానే చెప్పొచ్చుగా?"

"మీ ఇంటికి దారి మీకు తెలియదని నాకేంతెల్సు... వేరే ఎన్నో బజార్లలో పడి ఊరంతా ఊరేగుతా వస్తున్నాకూడా మీకు చీమకుట్టినట్టు లేకపోయే..."

"భలేవాడివే... ఉట్టి అయోమయం మనిషిలాగున్నావేవయ్యా నువ్వు..." అన్నాడు జగన్నాథం ఆటోఅతన్ని ఉద్దేశించి.

"నేను అయోమయం మనిషినా?!" ఆశ్చర్యపోయాడు ఆటో అబ్బాయి.

"కాకపోతే ఏంటి? రోజూ ఆటో తోలుతూ ఊరంతా తిరిగేవాడివి. ఏ బజారు ఎక్కడుందో బాగా తెలిసినవాడివి. కాస్త కన్‌ఫ్యూజ్‌గా వున్నపేర్లు వచ్చినప్పుడు 'మీరు ఎక్కడికెళ్ళాలి సార్? తిలక్‌రోడ్...తిలక్‌నగర్ అని ఈ ఊళ్ళో రెండున్నాయి' అని స్పష్టంగా అడగొద్దూ.... మీటర్‌పెంచి, డబ్బులు గుంజే వ్యవహారం కాకపోతే..."

"సార్! అనవసరంగా.... నన్నంటే నేను పడనుసార్... నా మీటర్ డబ్బు పడేయ్యండి నేను వెళ్ళిపోతాను..."

"తీసుకో... వెళ్ళు... వెళ్ళు... దేశంలో నీదొక్కటే ఆటోనా? మరో ఆటో పిల్చుకుంటాను...." అంటూ విసురుగా కూరల బరువుతో ఆటోదిగి, మరో ఆటో పిల్చి అందులో కూర్చున్నాడు జగన్నాథం.

ఇంటి ముందు ఆటో ఆగిన శబ్దం వినిపించగానే 'ఎవరొచ్చారబ్బా' అనుకుంటూ గేటు దగ్గరికి వచ్చి నిల్చుని బయటకు చూసింది కామాక్షమ్మ. చేతిలో సంచితో ఆటో దిగుతున్న భర్తను చూసి "అదేంటి? వాకింగ్‌కని బయల్దేరి ఆటోలో వస్తున్నారు!" అంది ఆశ్చర్యంగా.

అప్పుడు గుర్తొచ్చింది జగన్నాథానికి తాను బయల్దేరింది వాకింగ్‌కని. వెళ్ళేప్పుడు వాకింగ్ చేసుకుంటూనే వెళ్లాడు... వచ్చేటప్పుడే - దారిలో ఆ ప్రసాదరావో, ప్రకాశరావో కనిపించి పలకరించటంతో వచ్చిన పని మర్చిపోయి ముందు బస్టాండులో నిల్చుని, ఆ తరువాత ఆటోలో ఇంటికి చేరుకున్నాడు. నెత్తి పట్టుకున్నాడు జగన్నాథం.

"ఆటోలో వాకింగ్ చేస్తున్నావా నాన్నా?" అని పడి పడి నవ్వింది పన్నెండేళ్ళ కూతురు పావని.

దాంతో వళ్ళు మండిపోయి అది కోపం రూపేణా బయటికి వచ్చి భార్య మీద విరుచుకు పడింది.

"అసలు ఇదంతా నీ మూలంగానే... వాకింగ్ కెళుతున్నప్పుడు నాకు పనులు చెప్పొద్దని నీకు వందసార్లు చెప్పాను. కూరలు తెమ్మని చెప్పావ్... ఆ పనిలో పడి... 'వాకింగ్' సంగతి మధ్యలో మర్చిపోయాను."

"ఏవి కూరలు?"

"ఇవిగో!"

"ఏమిటి అవన్నీ కూరలే!"

"కూర'లే'.... అని దీర్ఘం తీస్తావేమిటి?... కూరలే మరి... 'ఇవిగో చూసుకో..." అని బడబడా సంచీ కింద గుమ్మరించాడు జగన్నాథం.

ఆశ్చర్యంతో బుగ్గలు నొక్కుకుంది కామాక్షమ్మ.

పావని మళ్ళీ పకపకా నవ్వింది.

"ఇవేం కూరలు... ఇదేం సంగతి... ఉన్నది ముగ్గురం... ఏదో సంతర్పణ చేస్తున్నట్లు మూటెడు కూరలు తెచ్చారేంటి? ఆ దొండకాయలు వరసబెట్టి ఎన్ని రోజులు తింటే తరగాలి? టమాటాలు అడుగున వేసుకుంటాడా ఎవడైనా? సంచీలోనే అవన్నీ వచ్చడయిపోయాయి... అన్ని వచ్చి మిరపకాయలేంటి? పాలకూర మోపెడు తెచ్చారు.. ఇంట్లో పశువు కూడా లేదే మేపటానికి... ఏం చేయను దాన్ని? " అని వరసబెట్టి చదివింది కామాక్షమ్మ.

తిక్కరేగింది దాంతో జగన్నాథానికి.

"అదే... అదే... అందుకే నాకు చెప్పవద్దంటాను. 'కూరలు తెండి' అని మాటలు కూడా పొదుపుగా వాడి ఒక్క ముక్కలో చెప్పావుగానీ.. ఏవి ఎంత తేవాలో చెప్పావా?-"

"ఈ విషయం కూడా తెలియని ఇంత అమాయక చక్రవర్తులు మీరని నాకేం తెలుసు? ఇంతకూ ఆటోకు ఎంత తగలేసారేంటి?"

"వాడు నీలాంటోడే... నాకు ఎవరు దొరికినా ఇలాంటోళ్ళే దొరుకుతారు.... తిలక్‌నగర్.. తిలక్‌రోడ్.. రెండు బజార్లు తిప్పి ముప్పయి అయిదు ప్లస్ ముప్పయ్ మూడు మొత్తం అరవై యెనిమిది రూపాయలు వదిలిచ్చారు.... ఇద్దరు ఆటోవాళ్ళూ కలిసి..."

మూర్ఛవచ్చినంత పనయింది కామాక్షమ్మకు.

"ఏంటి ఆటోకు అరవైఎనిమిది రూపాయలు తగలేసారా? అవసరం పడే కూరలు పోను అధిక కూరలకు మరో నలభై అయినా తగలేసి వుంటారు. మీ మూలంగా ఈరోజు అంతా లాసే. ఇక నుండి ఇంటిముందు ఎక్కువ ధర పెట్టయినా కూరలు కొనుక్కుంటానుగానీ ఇంకోసారి మిమ్మల్ని మాత్రం తెమ్మనను. **ఇలా అయితే మనం పిల్ల పెళ్లి చేసినట్టే!** బుద్ధి తక్కువై ఇవ్వాళ ఒక్కరోజు చెప్పాను..."

"నీకు బుద్ధి 'తక్కువ' గాక 'ఎక్కువ' ఎప్పుడు ఏడ్సింది గనుక! ఏ పనికి... ఎప్పుడు - ఎవరిని - ఎలా - పంపించాలో తెలియని ఆయోమయం మనిషివి. **నా చేత అనవసరంగా ఖర్చు చేయించి పైగా నన్నంటావ్**" తన ధోరణిలో తాను చెప్పుకుంటూ వెళ్ళిపోతున్నాడు జగన్నాథం.

కామాక్షమ్మ తలపట్టుకుని 'హతోస్మి' అనుకుంటూ- గుమ్మంలో కువ్వలా కూలబడిపోయింది.

అమ్మ, నాన్న,... ఇద్దరిలో ఎవరు అయోమయం మనుషులో అర్థంకాక క్వశ్చన్ మార్క్ ముఖం పెట్టి అలాగే నిల్చుండిపోయింది పావని.

* * *

అనలే అయోమయం మనిషయిన జగన్నాథానికి అధికంగా మాట్లాడటం అదనపు అలవాటు. దాంతో మరిన్ని తప్పులు జరిగిపోతుంటాయి. ఎదుటపడ్డ మనిషిని అమాంతం మీదపడి కావిలించుకున్నంత పనిచేసి ఆప్యాయంగా, నోటినిండా పలకరిస్తాడు. ఆ ఆవేశంలో, ఆ ఉద్వేగంలో అయాచితంగానే ఏవేవో మాటలు అనాలోచితంగా అతని నోటి నుంచి విడుదల అవుతాయి. దాంతో పలకరించబడ్డ వ్యక్తి ఖంగారు పడిపోవటమో, ఠారెత్తి పోవడమో జరిగి వెర్రిముఖమేసుకుని, పిచ్చి చూపులు చూస్తాడు. హడావుడిగా ఆలోచించి అప్పుడు తానెక్కడో పొరపాటు



చేసానన్న విషయాన్ని ఆలస్యంగా తెలుసుకుని దాన్ని సవరించుకునే ప్రయత్నంలో మరిన్ని తప్పులు చేస్తాడు జగన్నాథం.

ఆరోజు ఆఫీసుమెట్లెక్కుతూవుంటే, మెట్లుదిగి కిందికొస్తున్న రామారావు కనిపించాడు. బక్క పలచగా, పొట్టిగా ఉండే రామారావు ఈ మధ్య సిక్ లీవ్‌లో వుండి... ఓ నెల ఇంట్లోనే రెస్ట్ తీసుకుని ఆరోజే మళ్ళీ ఆఫీసుకు వచ్చాడు.

అన్నిరోజుల తర్వాత రామారావును చూసిన ఆనందం తట్టుకోలేక... దగ్గరికెళ్ళి చేతులు పట్టుకుని "ఏమండోయ్ భామారావు గారూ అంతా బాగున్నారా...? ఎప్పుడొచ్చారు... ఈ మధ్య మీరు స్వర్గస్థులయ్యారట కదా..." అని పలకరించాడు.

జగన్నాథం అయోమయత్వం ఎరిగున్నవాడే గనుక అంతగా ఖంగారు పడకపోయినా అది మరీ ఇంత ప్రకోపించిందని అప్పుడే తెలిసి ఆశ్చర్యపోయాడు రామారావు.

"జగన్నాథం గారూ, నా పేరు భామారావు కాదు రామారావు. నాకు తెలిసిన కొద్దిపాటి తెలుగు పరిజ్ఞానాన్ని బట్టి నాకు అర్ధమయింది ఏమిటంటే... 'స్వర్గస్థులవటం' అంటే 'చనిపోవటం'. నేను నిక్షేపంగా మీ ఎదుటే నిల్చున్నాను కదా నా కాళ్ళు కూడా ముందుకే ఉన్నాయి చూడండి" అన్నాడు నవ్వుతూ.

జరిగిన పెద్ద పొరపాటుకు నాలుక కరుచుకుంటూ అప్పటికప్పుడు దాన్ని ఎలా కవర్ చేసుకోవాలా అని ఆరాటపడ్డాడు జగన్నాథం.

"ఓ! సారీ... మీ నాన్నగారు ఈ మధ్య స్వర్గస్థులయ్యారని తెలిసి పొరపాటున..."

"మా నాన్నగారు చనిపోయి ఆరునెలలయింది. పన్నెండోరోజు మీరు మా ఇంటికొచ్చి నన్ను పలకరించి భోజనం కూడా చేసి వెళ్ళారు."

"అవును కదూ... మర్చేపోయాను. పెద్ద వయసులో మీ అమ్మగారికి పాపం చాలా కష్టమొచ్చింది...."

"మా అమ్మగారు కాలం చేసి ఏణ్ణర్ధం అయిందండీ-"

"ఓ! వెరీ... వెరీ సారీ.. ఏమిటో ఈ మధ్య నాకు కాస్త మతిమరుపు వచ్చింది... ఏమీ అనుకోకండి... వస్తాను. మళ్ళీ కలుద్దాం... ' అంటూ హడావుడిగా తన సెక్షన్ వైపు నడిచాడు జగన్నాథం.

"కాస్త మతిమరుపా?.... దీన్ని కాస్త అంటారా..." అని పిచ్చివాడిలా తనలో తనే గొణుక్కుంటూ ఫస్ట్‌ఫ్లోర్‌లోని తన సెక్షన్‌కు వెళ్ళిపోయాడు రామారావు.

అంత అయోమయం మనిషయిన జగన్నాథం ఆఫీసుపని ఎలా చేస్తాడన్నది అతన్ని గురించి తెలిసిన వాళ్ళందర్నీ వేధించే సమస్య.

అదంతా చెప్పాలంటే... భారతంలో ఉద్యోగపర్వమంత అవుతుంది. ఏ ఫైల్ ఎక్కడ పెట్టిందీ గుర్తుండదు. జి.వో నెంబర్లు అస్సలు గుర్తుండవు. కస్టమర్స్ పేర్లు ఇటువటూ అటువిటూ తారుమారు అవుతుంటాయి. ఒకసారి ఒక ఆఫీసరుకు అఫిషియల్ లెటర్ ఒకటి రాసి కింద తను సంతకం చేయాల్సిన స్థలంలో 'జగన్నాథం' బదులు 'విశ్వనాథం' అని సైన్ చేశాడు. ఆఫీసులో అందరూ ఒకటే నవ్వటం. ఒక్కోసారి ఏ లంచ్‌కో వెళ్ళివచ్చేటప్పుడు తన సెక్షన్‌లోకి రాబోయి పక్క సెక్షన్‌లోకి వెళ్ళి మరెవరి కుర్చీలోనో కూర్చోవటం కూడా జరుగుతుంటుంది.

"సారీ! జగన్నాథం గారూ... దిసీజ్ మై సీట్..." అని సదరు సీటు తాలూకు ఎంప్లాయ్ వచ్చి రిక్వెస్ట్ చేస్తే అప్పుడు తెలుసుకుని, ఖంగారుగా లేస్తూ "సారీ! ఈ ఆఫీసులో అన్ని సీట్లూ, అన్ని సెక్షన్‌లూ ఒక్కతీరుగానే ఏడ్చి చస్తాయి. రేపటినుంచీ అందరి సీట్ల టేబుళ్ళ మీదా నేమ్‌బోర్డ్ ఒకటి పెట్టించమని పై అధికారికి చెప్పాలి. ఈ ఆఫీసులో ఒక పద్ధతీ పాడూ ఏడుస్తే కదా... "అంటూ నెపం అధికార్లమీద వేస్తూ అక్కడినుంచి లేచి వెళ్ళిపోతాడు.

ఇదంతా చూసే జగన్నాథం పేరు ముందు 'అయోమయం' అనే ముద్దు పేరును చేర్చారు తోటి ఉద్యోగస్థులు.

'ఆ మనిషే తమాషాగా ఉంటాడు... ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్నట్లు నిరంతరం దేనికోసమో వెతుక్కుంటున్నట్లు కనిపిస్తాడు.

ఎదుటివాళ్ళు చెప్పేది శ్రద్ధగా వినడు.

సంగతి, సందర్భాల మీద ఏకాగ్రత వుండదు.

జరిగింది గుర్తుండదు. జరుగుతున్న ప్రస్తుతం మీద శ్రద్ధ వుండదు.

కలవరపాటు, తొందరపాటు, దేనికో అనవసర ఆరాటం, ఖంగారు ఇవన్నీ జగన్నాథాన్ని నలుగురిలో నవ్వులపాటు చేస్తున్నాయి. ఎక్కడ అతను ఉంటాడో అక్కడ ముసిముసి నవ్వులు ఉంటాయి.

'అదిగో అయోమయం జగన్నాథం వస్తున్నాడు' అన్న గుసగుసలు వుంటాయి.

అయినా 'పాపం జగన్నాథం' అన్న సానుభూతి మాటలు కూడా వినిపిస్తుంటాయి. అతని పరిస్థితిని అర్థం చేసుకున్న వాళ్ళనోటి నుంచి 'ఇంత అయోమయం, మతిమరుపులతో ఎలా గెటాన్ అవుతున్నాడో పాపం... కష్టమే.' అని జాలిపడుతూ వుంటారు.

అలాంటి వాళ్ళే.... జగన్నాథానికి ఆఫీసు పనుల్లో సహాయం చేస్తుంటారు. పై అధికారి సైతం కాస్త మనసున్న మనిషి కావటంతో **సీనియారిటీ ప్రకారం ఈయవలసిన ప్రమోషన్ ఇవ్వకపోయినా** సెక్షన్‌లోని ఇతర ఉద్యోగస్థులకు చెప్పి 'కాస్త అతన్ని చూస్తుండండి, అతనికి సహకరించండి' అని అలా తన ఔదార్యాన్ని చాటుకుంటూ వుంటాడు. అందుకే అక్కడ నెగ్గుకు రాగలుగుతున్నాడు జగన్నాథం.

******

జగన్నాథానికి అది వాకింగ్ టైమ్.

తలవంచుకుని రోడ్డుమీద నడుస్తున్నాడు ఏదో ఆలోచిస్తూ. నిటారుగా నిల్చుని, చేతులు వెనక్కూ, ముందుకూ కదిలిస్తూ వాకింగ్ చేయాలని ఇంతకుముందు చాలామంది చాలా సార్లు చెప్పారు. అయినా తనకు అలవాటయిన పద్ధతిలోనే నడుస్తాడు గుర్తుండక.

ఉన్నట్టుండి ఏదో గుర్తు వచ్చింది జగన్నాథానికి.

తలఎత్తి... ఎదురుగా కనిపించిన షాపులోకి అడుగుపెట్టి

"ఓ కిలో చింతపండు ఇవ్వవయ్యా మంచ్చిది" అన్నాడు.. 'మంచిది' అన్నమాటను వత్తిపలుకుతూ. అంతే! అందరూ ఘల్లున నవ్వారు.

ఎందుకు నవ్వుతున్నారో అర్థంకాక అయోమయంగా చుట్టూ చూసాడు జగన్నాథం. అప్పుడు అర్థం అయింది అది మెడికల్ స్టోరని. మందుల దుకాణానికి వచ్చి చింతపండు



అడిగితే జనం నవ్వారంటే నవ్వరూమరి. సిగ్గుతో చితికిపోయాడు.

ఇంట్లో కూర్చుని దర్జాగా 'అవితెండి... ఇవితెండి' అని పనులు పురమాయించే ఇంటి ఇల్లాలిమీద చెప్పలేనంత కోపం వచ్చింది. 'ఇక నుంచి ఏం తెమ్మన్నా ఛస్తే తీసుకెళ్లను' అని ఒట్టుకూడా పెట్టుకున్నాడు. ఆ కోపంలో పెద్ద పెద్ద అంగలేస్తూ, చేతులూపుకుంటూ పరుగులాంటి నడక ప్రారంభించాడు.

ఇల్లు ఇంకో పదడుగుల దూరం ఉందనగా జగన్నాథానికి దారిలో కోడిగుడ్లు అమ్మే దుకాణం కనిపించింది. షాపు బయటి బోర్డును, షాపులోపల తెల్లగా ప్లాస్టిక్ ట్రేల్లో అమర్చబడిన గుడ్లనూ బాగా చూసి మరీ లోపల అడుగుపెట్టాడు ఈసారి. వాటిని చూడగానే కోడిగుడ్డు పులుసు చేయించుకుని తినాలన్న కోరిక పుట్టింది.

దర్జాగా... ఫుల్ కాన్ఫిడెన్స్‌తో "ఓ అరడజన్ ఎగ్స్ ఇవ్వవయ్యా" అని అడిగాడు.

పల్చటి పాలిథిన్ కవర్‌లో గుడ్లు జాగ్రత్తగా పెట్టి ఇచ్చాడు షాపతను. అవి తీసుకుని ఊపుకుంటూ ముందుకు నాలుగు అడుగులేసాడు. వెనకనించి షాపతను "సార్! డబ్బులు!" అని పెద్దగా అరిచాడు. "ఓ! సారీ" అంటూ వెనక్కు వచ్చి డబ్బులిచ్చి వెళ్లాడు.

ఈసారి తనమీద తనకే కోపం వచ్చింది జగన్నాథానికి.

ఎంత జాగ్రత్తగా వుందామనుకున్నా... తన విషయంలో ఎందుకిలా జరుగుతుందో అతనికి అర్థం కావటం లేదు.

అడుగడుక్కి అలా అపహాస్యం పాటు కావలసి రావటం అతనికీ చిరాకుగా అనిపిస్తోంది. మధ్యాహ్నం రామారావుని పట్టుకుని 'మీరు స్వర్గస్థులయ్యారట కదా' అని అడిగిన సంఘటన గుర్తువచ్చి సిగ్గుతో చితికిపోయాడు. 'నేనెందుకు ఇలా చేస్తున్నాను? నా 'అయోమయం' ఎంతమందిని ఇబ్బంది పెడుతోంది... మరెంతమంది ముందు నన్ను చులకన చేస్తోంది. దీనికి మందు లేదా?' అని మొదటిసారి తన గురించి తాను ఆలోచించటం మొదలు పెట్టాడు జగన్నాథం.

"చింతపండు తెమ్మంటే గుడ్లు తెచ్చారేమిటి?" అని అడిగింది కామాక్షమ్మ భర్త గుమ్మంలోకి అడుగుపెట్టగానే.

"గుడ్డు పులును తినాలనిపించింది... వండు..." అన్నాడు చేతిలోని క్యారీబ్యాగు భార్య చేతిలో పెడుతూ.

'చింతపండు లేనిదే పులుసేం చేయను' అని స్వగతంలా అనుకుంటూనే "చేతులూపుకుంటూ వచ్చారేమో గుడ్లు మొత్తం పగిలిపోయాయి. ఇంక పులుసేం చేయను నా ముఖం. ఆమ్లెట్ వేస్తానులెండి ఒక్క పనీ సరిగా చేయరు కదా.." అంటూ లోపలికి వెళ్ళిపోయింది కామాక్షమ్మ.

ఆ ఆఖరిమాటలకు ఏడుపొచ్చినంత పనయింది జగన్నాథానికి.

******

"మీనాక్షీ-"

'నా పేరు కామాక్షి. రానురాను మీకు మతిమరుపు ఎక్కువైపోతోంది. కట్టుకున్న పెళ్ళాం పేరు కూడా మర్చిపోయే స్థితికి వచ్చారు. ముందు ముందు ఆఫీసు నుంచి ఇంటికొస్తూ మనిల్లు అనుకుని పక్కింటికెళ్ళే ప్రమాదం కూడా రావచ్చు ఏదో ఒకరోజు నిజంగా అలా జరిగితే వాళ్ళు హడలి చస్తారు...'' అంది కామాక్షమ్మ భర్తనుద్దేశించి.

ఆ మాటలకు... చటుక్కున అప్పుడే ఏదో గుర్తొచ్చినట్లు.....

"ఆఫీసంటే గుర్తొచ్చింది... పావని ఏదీ.... ఇంటికొచ్చిందా?" అని ఆరాటంగా ప్రశ్నించాడు జగన్నాథం.

"రోజూ ఆరున్నరకల్లా ఇంటికొచ్చేది ట్యూషన్ నించి. ఈరోజు బస్సులు స్ట్రయిక్ అట కదా.... ఇంకా రాలేదు మరి! నేనూ అదే చూస్తున్నాను...."

"అరె....రే... మర్చిపోయాను. పావని ఆరుగంటలకు నాకు ఆఫీసుకు ఫోన్‌చేసి... 'నేను మీ ఆఫీసు పక్కనే ఉన్న బస్టాపులో వున్నాను. మీరూ ఎలాగూ ఇంటికెళ్ళే టైమే కదా... ఆటో తీసుకుని వెళ్తూ నన్ను పికప్ చేసుకుని వెళ్ళండి' అని చెప్పింది. నేనే మర్చిపోయి ఏదో ఆలోచనలో సీదాగా ఇంటికొచ్చేసాను. పాపం అది అక్కడ ఎంతసేపటినుంచి వెయిట్ చేస్తుండాలి..." అంటూ చకచకా వంకీ నుంచి షర్టు తీసి వేసుకున్నాడు జగన్నాథం.

"ఇప్పుడు మళ్ళీ అంత దూరం వెళ్ళాలంటే ఆటోకు కాస్తాకూస్తా అవుతుందా ? అది ఎంతసేపని అక్కడ వుంటుంది... మీ సంగతి తెలిసిందే గనుక చూసి... చూసి... అదే వచ్చేస్తుందిలెండి ఈపాటికి'' అంటుండగానే మాటల్లోనే వచ్చేసింది పావని. వస్తూనే చిందులు తొక్కుతూ...

"ఏంటి నాన్నా. నన్ను పికప్ చేసుకుంటానని చెప్పి మీరు ఇంటికొచ్చేసారు...? వెయిట్ చేయలేక... ఇంటికి రాలేక ఎంత ఇబ్బంది పడ్డానో తెల్సా? అంతసేపు అలా రోడ్డు పక్కన... బస్సులు లేనిరోజు బస్సు కోసం నిల్చుంటే దారిన పోయే ప్రతి వాడూ నా వంక అదోలా చూట్టమే. చీకటి కూడా పడుతుండటంలో ఇద్దరు ముగ్గురు రౌడీలు నా పక్కన చేరి.... అసభ్యంగా మాట్లాడటం మొదలు పెట్టారు. దాంతో విసిగిపోయి ఆటో తీసుకుని ఇంటికొచ్చాను. ఆ ఆటోలో కూర్చున్నా భయంతో గుండెలు పీచు పీచుమన్నాయి.... వాడు ఎటన్నా తీసుకెళ్ళిపోతాడేమోనని..."

పావని ప్రతి మాటలో అంతవరకు ఆమె పడిన మానసిక క్షోభ స్పష్టంగా కనిపిస్తోంది. దాంతో తండ్రిగా జగన్నాథం హృదయం విలవిలలాడిపోయింది. తన మీద తనకే విపరీతంగా, ఇంతకుముందెప్పుడూ రానంతగా కోపం వచ్చింది.

ఆ రాత్రి ముద్ద మింగుడు పడలేదు. 'ఈరోజు ఇదయింది.... రేపు ఇంకేదయినా అవుతుంది. చిన్న చిన్న పొరపాట్లే ఒక్కోసారి తిరిగి సవరించుకోలేని పెద్దపెద్ద తప్పులకు, ప్రమాదాలకు దారి తీస్తాయి' అని పదే పదే ఆలోచిస్తోంది అతని మనసు.

ప్రతి ప్రవర్తనకూ వెనక కారణాలు ఏవో వుంటాయి. చిన్నతనంనుంచే తనలో చోటు చేసుకున్న అలసత్వం, అశ్రద్ధ, ఏ పనీ ఏకాగ్రతతో చేయని నిర్లక్ష్య వైఖరి ఇవన్నీ వయసుతో పాటు పెరిగి పెరిగి ఈనాడు తనను ఈస్థితికి తీసుకొచ్చాయి. 'ఏ పని చెప్పినా నీకు ఇంత బద్ధకం ఏమిటిరా? ఇప్పుడే ఇలా అయితే ముందుముందు జీవితం అంతా ఎలా?' అని



ఎప్పుడూ మెత్తగా మందలిస్తుండేది తల్లి.

'నీకు చదువు మీద శ్రద్ధలేదు. జీవితానికి ఒక లక్ష్యం, ఆశయం అంటూ లేవు. ఇలా అయితే నీ జీవితం ఒంటెద్దు బండిలా నడుస్తుంది. ఎలాగోలా బ్రతకం కాదు జీవితం అంటే' అని చీవాట్లు పెట్టేవాడు తండ్రి.

అప్పుడు ఆ మాటలను పెద్దగా పట్టించుకోలేదు. అందుకే పెరిగి పెద్దయి అయోమయం జగన్నాథంగా, మతిమరుపు మనిషిగా అందరి అవహేళనలకు, అపహాస్యానికి గురవుతున్నాడు. తనిప్పుడు తల్లిదండ్రుల చాటు బిడ్డ కాదు. బాధ్యత కలిగిన ఓ భర్త, ఓ తండ్రి, ఓ కుటుంబ పెద్ద. ఇప్పటికయినా తనను తాను సరిదిద్దుకోకపోతే...**రావలసిన ప్రమోషన్లు రావు. తన కూతురిపెళ్లికి డబ్బు ఆదా చేయనూలేడు.** తన జీవితానికి ఒక అర్థం, పరమార్థం వుండవు...' అనుకున్నాడు జగన్నాథం తనను తాను విశ్లేషించుకుంటూ.

ప్రతిసమస్యకూ ఒక పరిష్కారం తప్పనిసరి వుంటుంది. వ్యక్తిగత లోపాలు సాధనతో సవరించుకోవడం చిన్నపనే కానీ బ్రహ్మవిద్య ఏంకాదు. కనుకనే ఆ దిశలో ఆలోచించాడు జగన్నాథం.

'రేపటినించీ ఎదుటివాళ్ళు ఏదయినా మాట్లాడుతున్నప్పుడు ఆ మాటలను శ్రద్ధగా వినాలి. మనసుకు పట్టించుకోవాలి. ఆచి, తూచి ఆలోచించి... తొందరవడకుండా, తొట్రుపడకుండా చెప్పదలుచుకున్న విషయాన్ని స్పష్టంగా, దృఢంగా, ఆత్మవిశ్వాసంతో చెప్పగలగాలి. నేను ఇవన్నీ చేయగలగాలంటే నన్ను నేనే కౌన్సిలింగ్ చేసుకోవాలి. సాధనతో ఈ పనిని సాధించగలిగితే.... తనూ కామాక్షిలా అందంగా గలగలా... చమత్కారంగా సంభాషించగలుగుతాడు. ఆఫీసులో కొలీగ్ రామారావులా గంభీరంగా.... ఇన్‌ఫర్‌మేటివ్‌గా... ఎదుటివాళ్ళని మాటలతో కట్టిపడేసేటంత ఆకర్షణీయంగా మాట్లాడగలడు...' అనుకుంటూ ఆరోజు కోసం కలలుగనటం మొదలుపెట్టాడు జగన్నాథం. ఇంతలో

"ఏమండీ!" అని పక్కన పడుకున్న భార్య పిలవటంతో అటు తిరిగి చూసాడు.

"ఒకమాట చెబుతాను మీరు ఏమీ అనుకోనంటే...."

"చెప్పు..."

"మీరు జీవితాన్ని సీరియస్‌గా తీసుకోవటం లేదు. ఈ ఆషామాషీతనం ఎన్ని సమస్యలకు దారి తీస్తుందోనని ఆందోళనగా వుంది..." అంది కామాక్షమ్మ.

తన భార్య కూడా తనలాగే ఆలోచిస్తోందని గ్రహించి "నేనూ అదే అనుకుంటున్నాను కామాక్షి" అన్నాడు జగన్నాథం భవిష్యత్తు గురించి భరోసా ఇస్తున్నట్లు.

కామాక్షి తృప్తిగా నిట్టూర్చింది- ఆమెకు తెలుసు తన భర్త మనసులో ఆ మాత్రం చలనం వస్తే చాలని....!!

■

---




# నవ్వుల సందడి



**ఈ సంకలనంలో దాదాపు 39 మంది కార్టూనిస్టులు చిత్రించిన సుమారు 120 కార్టూన్లు, ఓ నాలుగు పుంజీల జోకులూ వున్నాయి. ఇవి కాక ప్రఖ్యాత కార్టూనిస్టు జయదేవ్ గారితో 'ఇంటర్వ్యూ' గూడా వుంది. ఈ ఇంటర్వ్యూలో '2డి యానిమేషన్, ఫ్లాష్, 3డి' రంగాల్ని 'కెరియర్' గా మలుచుకోదలుచుకున్నవాళ్ళకి ఉపయుక్తమైన సమాచారం వుంది.**

ఏవరైనా విసుగ్గా వున్నప్పుడు 'నారాత' అనుకుంటారు. ఒక్కోసారి 'నాగీత' అని గూడా అనుకుంటారు ఇక్కడ 'రాత' అన్నా 'గీత' అన్నా ఒకటే. ఎందుకంటే బ్రహ్మదేవుడి రాత అంతా గీతల రూపంలో వుంటుంది కాబట్టి. కార్టూనిస్టులూ సృష్టికర్తలే! వాళ్ళ రాతలు వాళ్ళు గీచిన గీటు దాటగూడదు. ఇదే 'గీతారహస్య' ఒక కార్టూన్ తాలూకు కాప్షన్ చదివితే, ఇహ కార్టూన్ కేసి చూడకుండానే మనకి విషయం యావత్తూ బోధపడిపోతే, అది కార్టూన్ కాదు. 'సచిత్ర' జోకు. అలాంటివి, కొద్దిగానే అయినా ఈ సంకలనంలో వున్నాయి. రాబోయే 'సీరీస్'లో బహుశా అలాంటివి మనకి కనపడవని ఆశిద్దాం! ఇక పుస్తకం లోపలికి వెళితే.....

ఎవరి అక్షరాలు తెలుగు లిపికి 'ఛందస్సు' గా మరి 'బాపూ ఫాంట్ పేరిట ఓ 'వర్ణకావ్యం' రూపుదిద్దుకుందో, ఎవరి బొమ్మ సౌందర్యానికి లక్ష్యప్రాయమైందో ఆ బాపూగారి రెండు కార్టూన్లతో పుస్తకం ప్రారంభం కావడం శుభసూచకం.



మొదటి కార్టూన్లో ఇద్దరు మునులు తపస్సు చేసుకుంటూ వుంటారు. 'గొంతు కాస్త తగ్గించు సామీ, మేమూ చేసుకోవాలి తపస్సు' అంటాడు ఒక ముని రెండో మునితో. బిగ్గరగా 'ఓంకారం' ఉచ్చరిస్తోన్న ముని ఓ విచిత్రమైన 'యోగి భంగిమ' లో వుంటాడు. తన భంగిమలో తనే ఇరుక్కుపోయి గిల గిల లాడుతూ బిగ్గరగా అరుస్తున్నాడన్న 'సజెషన్' వుంది కార్టూన్లో. సర్వసంగ పరిత్యాగులుగా వుండాల్సిన వాళ్ల ప్రచారాడంబరం మీద దెబ్బ వుంది. ఏకాగ్రత లోపించిన కపట భక్తిపై విసురూ వుంది. అలా హాస్యం, వ్యంగ్యం, అద్భుతంగా మేళవించిన కార్టూన్ ఇది.



రెండో కార్టూన్లో ఓ ఆసామీ 'షేవ్' చేసుకుంటూండగా పక్కనించి వాళ్ళావిడ "అచ్చం చిరంజీవిలా వున్నానంటే ఎందుకుండరూ? అటున్నది చిరంజీవి ఫోటో. అద్దం ఇటే వుంది. తిప్పి చూసుకోండి" అంటుంది. తను అచ్చం చిరంజీవిలా వున్నానని మురిసిపోయే ఆసామికి గుమ్మడికాయంత బొజ్జ చూపిస్తారు బాపూ ఒక్క గీతతో. దీన్నే 'స్ట్రోక్ ఆఫ్ జీనియస్' అంటారేమో! హాట్సాఫ్ టు బాపూ!

**-నిశాపతి**

బాపురమణీయం
Bapu Ramaneeyam

**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజీకి ముకుతాడు వేస్తాడు. అతని కుమార్తె సరళ మంచిదని తెలిసి ప్రేమిస్తాడు. విజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో విజయ్ స్థానంలో అజయ్ తప్పనిసరి పరిస్థితుల్లో తన సంతకం తనే ఫోర్జరీ చేసి జైలుపాలవుతాడు. ఈ లోగా భానోజీ చేతికి తాళంచెవులు చిక్కడంతో ఇనప్పెట్టె తెరిచి అజయ్, విజయ్‌లో ఒప్పందం సంగతి తెలుసుకుంటాడు. ఏమీ తెలియనట్టు నటిస్తూ విజయ్, సరళల వివాహం ఏర్పాటుచేస్తాడు. అతని గుట్టుబయటపెట్టాలని విజయ్ సమ్మతిస్తాడు కూడా.

(ఇక చదవండి)

అన్నపూర్ణావారి

# ఇద్దరు మిత్రులు



## సీరియల్ - నవల 21

**రచన: ముళ్లపూడి వెంకటరమణ**

"ఇన్‌స్పెక్టరుగారూ, నా నేరాలన్నీ ఒప్పుకుంటున్నాను. త్వరగా నన్నిక్కడినుంచి తీసుకు వెళ్ళండి" అంటూ బయటకు చరచర నడచి వెళ్ళిపోయాడు భానోజీగారు.



సరళ కళ్లు వత్తుకుంది.

అజయ్‌కి నమస్కరించింది. "మా నాన్న చేసిన ద్రోహానికి నేను సిగ్గుపడుతున్నాను. నన్ను క్షమించండి" అంది.

"అదేమిటి సరళా ఊరుకో. క్షమించడానికి ఇందులో నీతప్పేముంది?" అన్నాడు అజయ్.



కమీషనర్ పాడిదగ్గు దగ్గి అజయ్ భుజం తట్టాడు.

"మిష్టర్ అజయ్, లవకుశల్లాగా ఇద్దరూ బాగా కుదిరారు. నా సర్వీసులో ఇలాంటి విచిత్రమైన సంఘటన ఎన్నడూ చూడలేదు. మీ డబ్బు మీరే దొంగతనం చేసి జైల్లో కూర్చున్నారన్నమాట. మొదటిసారి కాబట్టి క్షమిస్తున్నాం. మళ్ళీ మీరిలాంటి నాటకం ఆడితే, ఇద్దరినీ ప్రాసిక్యూట్ చెయ్యాల్సి ఉంటుంది, వస్తాను" అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

అజయ్, విజయ్‌కేసి చూచాడు. అతనిమనసు కృతజ్ఞతతో నిండిపోయింది.

"విజయ్! నీలాంటి మిత్రుడు దొరకడం నిజంగా నా అదృష్టం. కంగ్రాచ్చులేషన్స్" అంటూ, విజయ్ హస్తాన్ని గ్రహించి గాఢంగా అదిమి తన చేతుల్లో పొదువుకున్నాడు.

విచిత్రపరిస్థితులలో తటస్థపడిన విచిత్రమిత్రుల అద్భుత ప్రయోగం ఉభయతారకంగా జయప్రదం అయింది. ఇద్దరూ గెలిచారు. ఓడారు. అందరూ ఇంటగెలిచి రచ్చగెల్వమంటే, వాళ్ళు వారింట వీరూ, వీరింట వారూ గెలిచారు.



ఆ ఉదయం, అప్పటి పరిస్థితులను బట్టి కఠినంగా ఆడినమాటలకు విజయ్ క్షమాపణ చెప్పుకున్నాడు అత్తయ్యకి.

"నా కర్తవ్యాన్ని పాటించడంలో ఏమైనా పొరబాట్లు చేస్తే క్షమించండి!" అన్నాడు వినయంగా.

అత్తయ్య, విజయ్ శిరస్సు నిమిరింది.

"లేదు - విజయ్! నువ్వేపొరపాటూ చెయ్యలేదు. నీ ఆంతర్యం తెలియక, నేనే నిన్ను అనుమానించాను - అవమానించాను."



"కాదత్తయ్యా, నా రహస్యం కడుపులో పెట్టుకుని కాపాడారు. సొంతబిడ్డలా చూచుకున్నారు. నేను వచ్చిన పని పూర్తిఅయింది. ఇక నాకు సెలవిప్పించండి!" అంటూ వందనం చేసి లేచాడు విజయ్.

"వెళ్ళిపోతావా, నాయనా!" అందావిడ భారంగా.

"విచారించకండి, అత్తయ్యా! అప్పుడప్పుడు వచ్చి, మీ దర్శనం చేసుకుని, మీ ఆశీర్వాదం పొందుతూనే ఉంటాను."

"ఎక్కడికి వెళ్తానంటున్నావ్ విజయ్?"

విజయ్ పక్కకు తిరిగాడు. అడిగినవాడు అజయ్‌బాబు.

"మన గడువు పూర్తిఅయిందిగా అజయ్‌బాబూ" అన్నాడు విజయ్ నవ్వి.

"రా మీనా, రామ్మా..." అంటూ చెల్లెల్ని తీసుకుని బయలుదేరాడు. వున్నకొద్దీ బయల్దేరడం మరింత బాధ, తుంచుకొని పోకతప్పదు.

"మీనా!" అన్నాడు అజయ్.



మీనా ఆగిపోయింది. కాలు ముందుకు సాగలేదు. దీనంగా వెనక్కు తిరిగి చూసింది. ఉత్తరక్షణంలో రివ్వున వరుగెత్తి అన్నయ్య కౌగిలిలో తలదాచుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

విజయ్‌కి ఆ సన్నివేశం చూడగానే కంట నీరు తిరిగింది. ఆనందోద్వేగంతో, కంఠం గద్గదమైంది.

"చూశావా అజయ్‌బాబూ, ఒక్క ఏడాదిలో నా చెల్లెలికి మీ రెంత ఆప్తులయ్యారో- మా పేద కుటుంబాలలో వుండే మమతలూ, అనుబంధాలూ అలాటివి. మాకున్న ఐశ్వర్యం అదే" అన్నాడు.



అజయ్, ఆప్యాయంగా చెల్లెలి తల నిమిరాడు. కన్నీరు తుడిచాడు.

"విజయ్, ఇంత సంపదవుండి నేను ఎప్పుడూ అనుభవించని ఆత్మీయత, అనురాగం ఈ ఒక్క యేడాదిలో పొందగలిగాను...అది కూడా నాకు దక్కనీయవా?" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

"విజయ్, నడిసముద్రంలో నావలావున్న ఈ యింటి వ్యవహారాలన్నీ ఒక్క గట్టుకు చేర్చావు,మాలో ఒకడివై మసిలావు. ఇపుడు మమ్మల్ని వదలి వెళ్ళిపోతావా" అంది అత్తయ్య.

"ఎక్కడికి వెళ్తాదత్తయ్యా" అన్నాడు అజయ్ ధీమాగా, చనువుగా, చొరవగా, "ఏఁ విజయ్. నువు చేసిన సహాయం మరిచిపోతాననుకున్నావా! నేనంత కృతఘ్నుడిననుకున్నావా...? నా ఆస్తిని నిలబెట్టింది నువ్వు. ఆ ఆస్తిని అనుభవించే అర్హత నాతోపాటు నీకూ వుంది. ఇందులో సగభాగం నీకు సంతోషంతో ఇస్తున్నాను...ఏం అత్తయ్యా?"

"అంతకంటేనా అజయ్" అంటూ, మనసారా ఆమోదించిందావిడ.



"విజయ్ మన కుటుంబానికి చేసిన మేలుకు ఎంత ఇచ్చినా ఇంకా రుణపడే వుంటాం. ఈనాటి నుంచీ నాకు మేనల్లుడు ఒకడు కాదు. ఇద్దరు. నేను కళ్లులేని కబోదినని దయతలచి భగవంతుడు మీ యిద్దరినీ నాకు రెండు కళ్లుగా ప్రసాదించాడు" అంది. ఈ అపేక్షకి, విజయ్ కృతజ్ఞతతో తల వంచుకున్నాడు.

విజయ్ విడుదలయ్యాడని తెలిసి పద్మ, ప్రకాష్ వచ్చారు.

"రా వదినా!" అంది మీనా.



ఆ వదిన ఎవరో అత్తయ్యకి అంతకుముందే తెలిసింది. అజయ్ చేసుకొనే దాక మానేజరు కూతుర్నా అన్న అత్తయ్య, చివరకతను ఒక మెకానిక్ చెల్లెల్ని పెళ్ళాడుతున్నాడని తెలిసినా, మనసారా మన్నించింది.

"నువ్వూ వచ్చావా అమ్మా కూర్చో. ఈ రోజు ఎంత మంచిరోజు. మిమ్మల్నందరినీ చూసి ఆనందించడానికి భగవంతుడు నాకు కన్నులు ప్రసాదించలేదు...మీ వివాహాలకు వెంటనే ముహూర్తం పెట్టిస్తాను" అంది అత్తయ్య.

*****

కుశలవుల్లాటి పెళ్ళికొడుకులిద్దరూ ఒక్కలాగే ముస్తాబయ్యారు.



బుజ్జి కళ్లు నులుముకుని మరీ మరీ చూసినా ఎవరెవరో తేలలేదు. పెళ్ళికూతుళ్ళను వేదికకు తీసుకువెళ్తున్న బృందంలో మీనాను చూచి పక్కకి పిలిచాడు.

"బావ ఎవరో నాకే ఆనమాలు చిక్కడంలేదు. పొరబాటున పెళ్లికూతుళ్లు కంగారుపడి.."

పెళ్ళికూతుళ్లు తికమకే పడ్డారు. పూలమాలలు వేసేవేళ ఇద్దరికీ చేతులాడలేదు. అజయ్ విజయ్‌లు కూడబలుక్కున్నట్టు కదలక మెదలక నిల్చున్నారు.

"మీనా, మీ అన్నయ్య ఎవరు?" అంది పద్మ- మార్గాంతరం తోచక.



మీనాకి ఇద్దరూ అన్నయ్యలే!

"ఏమో నాకూ తెలీయడంలేదు వదినా-" అంది.

ఈ మాట అత్తయ్యకి వినపడింది. ఆవిడ అనుకుంటూనే ఉంది. ఈ సమస్య వస్తుందని.

"పిచ్చి పిల్లల్లారా! ప్రేమించి పెళ్ళి చేసుకుంటున్నారే! ఆ మాత్రం పోల్చుకోలేరూ... ఉండండి!" అంటూ ముందుకు వెళ్ళి, తన మేనల్లుళ్ళిద్దరి చెంపలూ ప్రేమగా నిమిరింది.

"అజయ్!...విజయ్!" అంది - క్షణంలో వారిద్దరినీ పోల్చుకుని.

అజయ్, విజయ్‌లు చిరునవ్వులు ప్రసరించారు.

ఆ మూడుముళ్లూ పడడానికి ఇహా నాలస్యమేవిఁటి? ఏఁవుంది పెద్దలు వచ్చి కూర్చుని శుభం అనడమే. రావలసిన పెద్దలు ఇంకా రాలేదు. అందుకే భక్త రామదాసుగారు గుమ్మంలో తారాట్లాడుతున్నారు. ఆ యొక్క శ్రీరామచంద్రుడు వెన్ను నిమిరిన ఉడతలా, ఉత్సాహంగా, గర్వంగా సింహద్వారం దగ్గిర నిలిచాడాయన. మీనామీద నిందవేసిన రామలక్ష్మమ్మగారు, గుమ్మంలో అడుగుపెడుతూనే ఆయన్ను చూసి గతుక్కుమంది ఏవంటాడోనని.



"రావఁలక్ష్మమ్మా! అబ్బాయి పెళ్ళి..." అన్నాడాయన.

"చాలా సంతోషం అన్నయ్యా."

"పెద్ద ముత్తయిదువి. గంధం తీసుకో," అంటూ మర్యాదచేసి లోనికి పంపాడు.

ఆ వెనక ఇంకో 'కొత్త ముత్తయిదు' సిగ్గు పడుతూ వచ్చింది. పరకాయించి చూసి 'ఎవరూ?' అన్నాడు రామదాసుగారు.

"నేను బావా! పరంధామయ్యని" అందా శాల్తీ సిగ్గుపడుతూ.

"ఏవిటీ! బుర్రమీసాల పరంధామయ్య బావగారే! సామెత జెప్పినట్టు ఏవిటీ అవతారం, నిమ్మకాయలు నిలబెట్టిన నిక్షేపంలాంటి మీసాలు!"

"శ్రీమతే రామానుజాయనమః" అంటూ పైనున్న వాడికో నమస్కారంపారేసి, "తీసేశాను" అన్నాడాయన ముసిముసి నవ్వులు నవ్వుతూ. "నువ్వూ నీ కొడుకూ నీ అల్లుడూ మీరంతా కలిసి నా కోరలు

లాగేశారుగా. పౌరుషంకాస్తా పోయింతరవాత ఇంకా మీసాల్లో ఏముంటుంది?"

"అంతా ఆ రాములవారి దయ. రా బావా రా. నువ్వులేకపోతే పెళ్ళికి నిండే వుండదు. రా రా" అంటూ వియ్యంకుడిని తీసుకుని వేదిక వేపు వెళ్లాడు రామదాసుగారు.

మంగళసూత్రధారణం ముగిసింది.

మంగళహారతి పాడాలని రామదాసుగారికి



ఉత్సాహం పుట్టింది.

"పవమాన సుతుడు బట్టూ
పాదారా వింద ములకూ-" అన్నాడు. బావగారు అందుకొన్నారు. తోటివారు శ్రుతి గలిపారు-

"నీ నామ రూపములకూ
నిత్యజయమంగళమ్"

(సమాప్తం)

---

మనసినిమావాళ్లకు బొత్తిగా ఒరిజినాలిటీ లేదనీ, మన సరుకులో బాగున్నదేదైనా ఉంటే దాని మూలం బెంగాలీలోనో, తమిళంలోనో దొరుకుతుందనీ మనలో చాలామందికి గట్టి నమ్మకం. మూలచిత్రం చూడకపోయినా సరే, పేరు కాస్త చూచాయిగా తెలిసినా చాలు, వాళ్లు రెచ్చిపోవడానికి. ఇన్స్పిరేషన్‌కు మాత్రమే దాన్ని వాడుకున్నారేమో, లేకపోతే ఇంత తెలుగుతనం ఎలావస్తుంది అన్న సందేహం కూడా రాదు వారికి.

'ఇద్దరు మిత్రులు' వంటి చక్కని చిత్రం కూడా బెంగాలీ సినిమాకి 'పచ్చి' కాపీ అనుకుని వాపోయేవాళ్లున్నారు కాబట్టి మూలచిత్రం వీడియోకై అన్వేషణ సాగింది. కలకత్తా వాసి, 'హాసం' అభిమాని శ్రీ ఎన్.ఎల్.బుద్ధా సహకారంతో 'తాషేర్‌ఘర్' సినిమా వీడియో సంపాదించి చూశాక మూలకథ 'హాసం' పాఠకులతో పంచుకోవాలనిపించింది. శ్రీ బుద్ధాగారికి కృతజ్ఞతలతో ముందుగా కథ గురించి -



అజయ్‌మిత్రా అనే ధనవంతుడు, వినయ్‌దత్తా అనే బీదవాడు అనుకోకుండా తెలుగు సినిమాలో లాగానే తారసిల్లుతారు. అజయ్ గాథ - తల్లిదండ్రులు లేరు. గుడ్డిమేనత్త ఉంది. డబ్బుంది. పార్ట్‌నర్‌గా ఉన్న మజుందార్ గారమ్మాయి పెళ్లాడమని వెంటబడుతోంది. (భానోజీ నయవంచకత్వం, నగలదోపిడీ, దొంగవిల్లు, చివరిలో అగ్రిమెంటు విషయం తెలుసుకోవడం వంటి డ్రమెటిక్ ఎలిమెంట్స్ ఏమీ లేవు).



ఇక వినయ్‌కి తల్లితండ్రీ లేరు. పెళ్లికాని చెల్లెలు మీనా వేరేవారి ఇంట్లో ఉండి చదువుకుంటోంది. అయిదేళ్లుగా ఉద్యోగం లేదు. ఒకరింట్లో అద్దెకుంటూ వాళ్లబ్బాయికి ట్యూషన్ చెబుతున్నాడు.



దరిద్రం అంత భయంకరమైనది కాదని, ఆత్మహత్య చేసుకోవలసిన అవసరం లేదని అజయ్ వాదిస్తాడు. ఛాలెంజ్ చేస్తాడు. ఇద్దరూ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించు కున్నారు. (షేక్‌హాండ్ దృశ్యం చిత్రీకరించిన విధం చూడండి). అగ్రిమెంటు రాసుకుని కవర్లోపెట్టి అజయ్ లాయర్‌కి పంపారు.



అజయ్ స్థానంలో వచ్చిన వినయ్ తబ్బిబ్బుపడకుండా వ్యవహారాలు బాగా చూసుకోసాగేడు. మజుందార్



మెచ్చుకుని తన కూతుర్ని పెళ్లి చేసుకోమని తనే ఆఫర్ చేశాడు. వినయ్‌కూడా ఆమెతో ప్రేమలో



పడ్డాడు. ఇతనికి ఏ ఇబ్బందీ లేనట్టే!

వినయ్‌స్థానంలో వచ్చిన అజయ్ ఇంటివారమ్మాయి సానుభూతి చూరగొన్నాడు. ధైర్యం చేసి ప్రేమ వెల్లడించాడు. ఆ అమ్మాయికీ ఇష్టమే. ఆమె తల్లిదండ్రులు వేరే సంబంధం చూసినా వద్దని ఇతని ఉద్యోగం గురించి వెయిట్ చేస్తానంది.



చెల్లెలు మీనాకి ఆశ్రయం ఇచ్చిన వారబ్బాయి మంచి గాయకుడు. రేడియోలో ఛాన్సుకై ప్రయత్నిస్తూంటాడు. అతనివద్ద సంగీతం నేర్చుకుంటూ మీనా ప్రేమలో పడింది. దానికి అతని తల్లికూడా ఆమోదం తెలిపింది.



తిరగ్గా, తిరగ్గా అజయ్‌కు మెకానిక్‌గా ఉద్యోగం వచ్చింది. మీనా ప్రియుడికి పాటపాడే అవకాశం వచ్చింది. మొట్టమొదటి రోజు రికార్డింగులోనే పాటపాడి కూలిపోయాడు. టి.బి.అన్నారు. వైద్యానికి డబ్బు కావాలి.



ఎంతమంది వద్ద అడిగినా అజయ్‌కి అప్పుపుట్టలేదు. దెబ్బకి దరిద్రం దెబ్బ ఎలాటిదో తెలిసివచ్చింది.



పాతడ్రస్ వేసుకుని ఆఫీసుకెళ్లి చెక్కు తీసుకుని బ్యాంకుకెళ్లి సంతకం పెట్టి డబ్బు తీసుకున్నాడు. వైద్యం కోసం డాక్టరుకి ఇచ్చాడు.



మర్నాడు అజయ్ స్థానంలో ఉన్న వినయ్‌కి 'ఫోర్జరీ' సంగతి తెలిసింది. వెంటనే తనే పోలీసులకు ఫోన్ చేసి ఫోర్జరీ చేసినతని అడ్రసు ఇదీ అని తన పాత అడ్రసు ఇచ్చాడు. పోలీసులు



అజయ్‌ను అరెస్టు చేశారు. ఇంటివాళ్లమ్మాయి, చెల్లెలు ఇదేమిటంటే 'అది నా డబ్బేలే' అన్నాడు అజయ్ మిస్టీరియస్‌గా.

లాకప్‌లో ఉన్న అజయ్‌ను వినయ్ కలిశాడు. (ఇద్దరికీ పోలికలున్నాయని ఇన్‌స్పెక్టర్ కనిపెట్టలేదు!) 'పేదరికంతో రొమాన్సు తీరిపోయిందా?' అని ఎద్దేవా చేశాడు. అజయ్ నవ్వి ఊరుకున్నాడు.





మీనా వినయ్‌ను కలిసింది. (ఆమె మాత్రం పోలిక గుర్తు పట్టి ఉలిక్కిపడింది) ఆమె మాటలద్వారా అజయ్ మీనా కోసమే ఫోర్జరీ చేసినట్లు వినయ్‌కి తెలియవచ్చింది. పశ్చాత్తాప పడ్డాడు.



పోలీసుస్టేషన్‌కి వెళ్లాడు. లాయర్ని రమ్మన్నాడు. ఆయన చేత సీల్డ్‌కవరు ఇప్పించి చదివించాడు. కేసు విత్‌డ్రా చేసుకున్నాడు.

అందరూ కలిసి ఇంటికి వెళ్లారు. పేదరికం బాధాకరమే అయినా పేదవారిలో ఆప్యాయతానురాగాలు చూశానని అజయ్ అంటాడు. అక్కడకు చేరిన మజుందార్ గారమ్మాయి బీదవాడైనా సరే, వినయ్‌ను చేసుకుంటానంది.

ఇదీ 'మూలకథ'! చిత్రీకరణకూడా చీకట్లో, కన్నీళ్లు, కడగండ్ల మధ్య దారిద్ర్యపుకష్టాలను వివరిస్తూ, కాస్త నీరసంగా, సాగుతుంది. కామెడీ జోలికి పోలేదు. డబ్బున్నవాళ్ల జీవితంలో ఏ కష్టాలూ ఉండవని చెప్పినట్టనిపిస్తుంది. ఆ పాత్రలో హీరోయిజమ్ బొత్తిగా లేదు.



నటనపరంగా అందరూ బాగా నటించారు. టైటిల్స్‌లో ఉత్తమ్‌కుమార్ పేరుతో బాటు అతని తమ్ముడు తరుణ్‌కుమార్ (బెంగాలీ నాటకరంగంలో ప్రసిద్ధుడు, పోలికలుంటాయి) పేరు కనబడింది. ద్విపాత్రాభినయం దృశ్యాలలో వాడుకున్నారేమో! ఇతర తారాగణం - సావిత్రి, సబితా, దేవయాని, చంద్రావతి, అర్పణ, రబీన్, ప్రహార్, మిహిర్. కథ రాసెబిహారీలాల్ దయితే స్క్రీన్‌ప్లే, దర్శకత్వం మంగళ్‌చక్రవర్తివి. సాంకేతికంగా చెప్పుకోవడానికి ఏమీ లేదు. ఈ సినిమా చూసి, బీంట్లోంచి మంచి సినిమా తీయవచ్చని గ్రహించడం చెప్పుకోదగ్గ విషయమే!

- ఎస్వీయస్ ప్రసాద్

---

# ఘంటసాల క్విజ్

**మొదటి బహుమతి : రూ. 250/-**
**రెండవ బహుమతి : రూ. 200/-**
**మూడవ బహుమతి : రూ. 150/-**
మరియు ఘంటసాల కలర్ ఫోటో

క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ
డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-6

1. ఘంటసాల సంగీత దర్శకత్వంలో చిత్తూరు వి. నాగయ్య పాడిన చిత్రం?
జ: ..........................
2. ఘంటసాల పాడిన 'నారాణి కనులలోనే' పాట ఏ నటుడి మీద చిత్రీకరించబడినది?
జ: ..........................
3. ఘంటసాలను మద్రాసు రమ్మని ప్రోత్సహించినది ఎవరు?
జ: ..........................
4. ఎవరి సిఫారసు మీద విజయా అధినేతలు ఘంటసాల గారిని షావుకారు సినిమాకు సంగీత దర్శకునిగా నియమించారు?
జ: ..........................
5. భానుమతి, ఘంటసాల మరియు పిఠాపురం నాగేశ్వరరావు కలిసి పాడిన చిత్రం?
జ: ..........................

పంపినవారి పేరు : ____________________

చిరునామా : ____________________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 31-7-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**
'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

జూలై 31 రఫీ వర్ధంతి సందర్భంగా...

# గానంలో గంధర్వుడు గాయకుల్లో ఋషితుల్యుడు మహమ్మద్ రఫీ



**బహారో ఫూల్ బరసావో**
అని పాడిన ఆ కంఠం మూగపోయి 23 వసంతాలు గడిచిపోయాయా?

**సావన్ కే మహీనేమే**
అని పాడిన ఆ కంఠం నిలిచిపోయి 23 వర్షరుతువులు గడిచిపోయాయా?

**చౌధ్వీ కా చాంద్**
పాడిన ఆ గొంతు ప్రత్యక్షంగా వినిపించకుండా ఎన్ని చవితి వెన్నెలలు పరిగెత్తిపోయాయో.

**సుహానీ రాత్ ఢల్ చుకీ- నజానే తుమ్ కబ్ ఆవోగే**
పాడిన కంఠం అమరమై పోయి ఎన్ని వేల రాత్రుళ్ళు కరిగిపోయాయో.

మరిచిపోదామన్నా మరిచిపోలేని జ్ఞాపకాలు రఫీ మిగిల్చినవి. 1924 డిసెంబరు 4వ తేదిన పుట్టి, 1980 జులై 31 వ తేదిన మరణించిన మహమ్మద్ రఫీ తన 56 ఏళ్ళ జీవితంలో, 40 ఏళ్ళ సినీ గాయక జీవితంలో ఎందరు అభిమానులను సంపాదించుకున్నాడో, అతను మరిణించిన రోజున బొంబాయి వీధుల దృశ్యాన్ని ఒక్కసారి తలుచుకుంటే అర్థమవుతుంది. కుండపోతగా వర్షం కురుస్తున ఆ రోజున బాంద్రాలోని జుమ్మా మసీదు నుంచి ప్రారంభమైన రఫీ ఆఖరి ప్రయాణానికి కన్నీళ్ళలో తడుస్తున్నారో, వర్షంలో తడుస్తున్నారో తెలీని అసంఖ్యాకమైన అభిమానులు బారులు తీర్చి నించుని వీడ్కోలు చెప్పిన ఆ దృశ్యం ఏ సినిమాలోని క్లయిమాక్సుకూ తీసిపోదని ప్రత్యక్షంగా చూసిన వారు అంటారు.

అతని అకాల మరణం, మరీ ముఖ్యంగా కిశోర్ వైభవంతో కొన్ని నాళ్ళ నిర్బంధప్రవాసం ఏర్పడిన తర్వాత మళ్ళీ పూర్వస్థానాన్ని, తనకే చెందాల్సిన హోదాని పొందుతున్న తరుణంలో మరణించాడు. కొన్ని గంటల క్రితం మాత్రమే 'ఆస్ పాస్' చిత్రానికి పాట రికార్డు చేసిన రఫీ, అకస్మాత్తుగా, ఏ హెచ్చరికా ఇవ్వకుండా, తన అభిమానులను, భక్తులను విడిచివెళ్ళి సరిగ్గా 23 ఏళ్ళు.

ఈ 23 ఏళ్ళలో చాలా మంది రఫీ అనుకర్తలు వచ్చారు. ఇంకా వస్తున్నారు. మహమ్మద్ అజీజ్, షబ్బీర్‌కుమార్ వంటి వాళ్ళు పెద్ద ముద్ర వేయలేకపోయారు. అన్వర్, రఫీకి దగ్గరగా వచ్చినా ఏ కారణంగానో నిలబడలేకపోయాడు. ఇప్పుడు సోనూ నిగమ్ రఫీని తలపిస్తూనే, రఫీ అనుకరణ వల్ల తను నిలబడలేడనీ, అతనితో పోల్చి చూస్తే తేలిపోక తప్పదనీ త్వరగానే తెలుసుకుని, స్వంత శైలిని ఏర్పరచుకుని విజయం సాధిస్తున్నాడు. మన బాలూ కూడా రఫీ అనుకరణ నుంచి త్వరగానే బయటపడి, స్వంత గొంతుతో అసామాన్య గాయకుడిగా ఎదిగారు. రఫీ ప్రభావం అలాంటిది. కొత్తగా పాడాలనుకున్న ప్రతి గాయకుడు రఫీలా పాడగలనేమో అని ప్రయత్నించడం ఈనాటికీ జీటీవి 'సరిగమపా' చూస్తే తెలుస్తుంది.

ఎన్ని తరాలు గడిచినా, ఎంత మంది కొత్త కొత్త గాయకులు వచ్చినా రఫీని మరిపించలేక పోవడానికి కారణమేమిటి? ఇతరులలో లేనిది అతనిలో ఏముంది? కనీసం ఇతరులకంటె ఎక్కువగా అతని గానంలో ఉన్న గుణాలేమిటి? సంగీతాన్ని ఎంతగా విశ్లేషించినా ఒక్క పాట విన్నప్పుడు కలిగినంత అనుభూతిని, ఆనందాన్ని కలిగించలేదు. అయినా, రఫీ ప్రత్యేకతను అర్థం చేసుకోడానికి కనీసం ప్రయత్నించాలి. అతను రంగం మీదికి వచ్చినప్పటికీ సైగల్, పంకజ్ మల్లిక్, శ్యామ్, సురేంద్ర, తలత్, ముకేష్ మొదలైన వారున్నారు. వీరిలో కొందరు మంచి గాయకులు; కొందరు గొప్ప గాయకులు. అలాగే అతనితో పాటు ఎదిగిన గొప్ప గాయకులు, మన్నాదే, కిశోర్ కుమార్, హేమంత్ కుమార్. అందరు చక్కని ఒరిజినాలిటి ఉన్నవారు. కానీ వీరందరి సమక్షంలో కూడా, కొన్ని దశాబ్దాల పాటు రఫీ మకుటం లేని మహారాజుగా వెలగడానికి కారణం?

ఆ స్వరంలో మార్దవం, గాంభీర్యం, ప్రౌఢత్వం, లాలిత్యం, సాంద్రత, ఒదిగే గుణం. వ్యాపక గుణం..... ఇలా ఎన్ని విశేషణాలు చెప్పుకున్నా ఒకే వ్యక్తి గొంతులో ఇన్ని లక్షణాలుండడం బహుశా ఒక్క రఫీలోనే కనిపిస్తుంది (తెలుగులో ఘంటసాలను మినహాయిస్తే). ఏ పాట పాడినా, ఏ నటుడి కోసం పాడినా, ఏ సందర్భం కోసం పాడినా, ఏ భావం పలికించినా, ఏ సంగీత దర్శకుడి కోసం పాడినా అన్ని అతికినట్లు, అలాగే ఉండాలన్నట్టు పాడడం అతనికే సాధ్యం.

రఫీ పాటలో కొన్ని గొప్ప లక్షణాలున్నాయి. హిందీ సినిమా పాటలో మొదటిసారి పూర్తిస్థాయి నాటకీయత (dramatisation) తీసుకు వచ్చిన గాయకుడతను. సినిమా చూడకపోయినా, ఆ దృశ్యంలో నాయకుడి హావభావాలను మనం కేవలం రేడియోలో రఫీ పాట వింటూ పసికట్టవచ్చు. ఆ సినిమాలో నాయకుడెవరో తెలీకపోయినా, రఫీ పాడే విధానాన్ని బట్టి నాయకుడిని ఊహించడం ఎంతోమందికి అనుభవమే! ఒక్కోసారి రఫీ పాటలో తీసుకు వచ్చిన గాఢతను తెరపై నాయకుడు తీసుకురాలేకపోవడం కూడా మనకు తెలుసు. (ముఖ్యంగా బి గ్రేడు సినిమాల్లో) పాటను కేవలం పాటగా కాక, ఒక అనుభవంగా పలికించగలిగిన గొప్పదనం రఫీది. ఒక్కొక్క హీరోకు ఒక్కొక్క ఉదాహరణ తీసుకున్నా ఈ మాటల్లో నిజం వెల్లడవుతుంది.

**కోయీ సాగర్ దిల్ కో బహలాతా నహీ (దిల్ దియా దర్ద్ లియా)**
అంటున్నపుడు దిలీప్,
**మై జిందగీ కా సాథ్ నిభాతా చలాగయా (హమ్ దోనో)**
అంటున్నపుడు దేవ్ ఆనంద్,
**తెరి ప్యారీ ప్యారీ సూరత్ కో కిసీకీ నజర్ నలగే (ససురాల్)**
అంటున్నపుడు రాజేంద్రకుమార్,
**బహుత్ శుక్రియా బడీ మెహర్‌బానీ (ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా)**
అంటున్నపుడు జాయ్ ముఖర్జీ,
**యే దునియా అగర్ మిల్ భి జాయే తో క్యా హై (ప్యాసా)**
అంటున్నపుడు గురుదత్,
**తా...రీఫ్ కరూఁ క్యా ఉస్‌కీ (కాశ్మీర్ కీ కలీ)**
అంటున్నపుడు షమ్మీకపూర్,
**మస్త్ బహారోంకా మై ఆశిక్ (ఫర్జ్)**
అంటున్నపుడు జితేంద్ర,

**ఆప్ కే పెహలూమె ఆకర్ రోదియే (మేరా సాయా)**
అంటున్నపుడు సునీల్ దత్
**హమ్ ఇంతిజార్ కరేంగే (బహూ బేగం)**
అంటున్నపుడు ప్రదీప్ కుమార్
**నాచే మన్ మోరా మగన్ (మేరి సూరత్ తేరీ ఆంఖే)**
అంటున్నపుడు అశోక్ కుమార్
**ఓ దునియా కే రఖ్‌వాలే (బైజు బావరా)**
అంటున్నపుడు భరత్ భూషణ్
**గున్ గునారహేహైం భవర్ ఖిల్ రహీ హై కలి కలీ (ఆరాధన)**
అంటున్నపుడు రాజేశ్ ఖన్నా
**తెరీ బిందియారే (అభిమాన్)**
అంటున్నపుడు అమితాబ్ బచ్చన్
**ఖిలోనా జాన్ కర్ తుమ్ తో (ఖిలోనా)**
అంటున్నపుడు సంజీవ్ కుమార్
**ఏక్ థా గుల్ ఔర్ ఏక్ థీ బుల్ (జబ్ జబ్ ఫూల్ ఖిలే)**
అంటున్నప్పుడు శశికపూర్
**సర్ జో తేరా చకరాయే (ప్యాసా)**
అంటున్నప్పుడు జానీ వాకర్
**హమ్ కాలే హైతో క్యా హువా దిల్‌వాలే హై (గుమ్‌నామ్)**
అంటున్నప్పుడు మెహమూద్
**ఇక్ హసీ శామ్‌కో దిల్ మేరా ఖో గయా (దుల్హన్ ఎక్ రాత్ కీ)**
అంటున్నప్పుడు ధర్మేంద్ర
**దర్దె దిల్ దర్దె జిగర్ (కర్జ్)**
అంటున్నపుడు రిషికపూర్

.... ఇలా చెప్పుకుంటూ పోతే, ఒక్కొక్క నటుడి నటనకూ రఫీ చేసిన దోహదం ఏమిటో అర్థమవుతుంది. ఆ నటుడి మనస్థితి, అతనున్న సన్నివేశం, ఆ దర్శకుడి ఉద్దేశం, సంగీత దర్శకుడి పథకం, గీత రచయిత లక్ష్యం - అన్నిటికీ పూర్తి న్యాయం చేయడం రఫీ గానం ప్రధాన లక్షణం.

ఇందులోంచే రఫీ వ్యక్తిత్వంలోని మరో ప్రత్యేకత మనకు గుర్తుకు వస్తుంది. రఫీకి పెద్ద బ్యానర్లు గొప్ప సంగీత దర్శకులు, దండిగా డబ్బులు ఏనాడు ముఖ్యం కాదు. తను అగ్ర స్థానంలో ఉన్నపుడు, తను కోరినంత డబ్బు వసూలు చేయగల హోదాలో ఉన్నపుడు కూడా, 50 రూపాయలకు, ఊరు పేరూ లేని సంగీత దర్శకులకు పాడి, ఆ సినిమాలో అదొక్కటే ప్లస్ పాయింట్ అని ప్రేక్షకులు భావించేందుకు సహాయపడిన గొప్ప మనసు రఫీది.

ఈ 50 రూపాయల పాట పండిత్ శివరామ్ సంగీత దర్శకత్వంలో 'ఊంచే హవేలీ' సినిమాకోసం పాడింది - 'దౌలత్ కే ఝూటే నషేమే హో చూర్ - గరీబోంకి ధునియాసే రెహతే హై దూర్ - అజి ఐసా భీ ఎక్ దిన్ ఆయెగా జబ్ మాటీ మే సబ్ మిల్ జాయేగా' సూపర్ హిట్టయి, ఈనాటికి రేడియో సిలోన్ 'పురానీ ఫిల్మోంకీ గీత్‌'లో తరచుగా వినిపిస్తుంటుంది. 'ఖోజ్' అనే సినిమా కోసం రఫీ ఒక్క రూపాయి తీసుకుని కూడా పాడాడు. ఇలా జి.ఎస్. కోహ్లి, సి. అర్జున్, ఎస్.మొహిందర్, సోనిక్ ఓమి, బాబుల్, సర్దార్ మల్లిక్, సపన్ జగ్‌మోహన్ వంటి (హోదాలో) చిన్న సంగీత దర్శకులకు పాడినపుడు కూడా, తనకు గురువైన నౌషాద్‌కు పాడినంత శ్రద్ధతో, మనసంతా పెట్టి పాడడం రఫీ ఔన్నత్యానికి, తన వృత్తిపట్ల అతనికున్న గౌరవానికి తార్కాణం.

రఫీ మరణానంతరం నౌషాద్‌ని ఒక ఇంటర్వ్యూలో 'మీరెందుకు ఇటీవల ఎక్కువగా సంగీతం ఇవ్వడానికి సిద్ధంగాలేరు?' అంటే అందరు పాతకాలం సంగీత దర్శకుల్లా 'ఇప్పటి గోల సంగీతం నేను చెయ్యలేను' అనక, 'నా బాణీలు పాడ్డానికి రఫీ లేడు. ఇంకెవరి గొంతులోను ఆ బాణీలు రాణించవు' అన్నారు. లక్ష్మీకాంత్ ప్యారేలాల్ కూడా 'మాకు ఇదివరకు ఎంత క్లిష్టమైన బాణి వేసినా రఫీసాబ్ ఉన్నారు పాడ్డానికి అనే ధైర్యం ఉండేది. ఇప్పుడు గాయకులు పాడగలిగిన బాణీలే వెయ్యాలి' అన్నారు. రఫీ చనిపోయిన వార్తను షమ్మీ కపూర్‌కు ఒకరు ఇలా అందించారు 'సార్. మీ కంఠం మరణించింది'.

ఒక పాటకు రఫీ స్వరం, పాడే పద్ధతి వల్ల ఎంత అందం వచ్చేదో అంచనా వేయాలంటే, లతాతో పాడిన డబుల్ వెర్షన్ పాటల్ని గుర్తు తెచ్చుకుంటే చాలు. వీళ్ళిద్దరూ పాడిన పాటలు దాదాపు అన్ని రఫీ పాడిన వెర్షనే హిట్టయ్యాయంటే అతిశయోక్తి కాదు. 'మేరే మెహబూబ్ తుఝే (మేరే మెహబూబ్), ఎహసాన్ తేరా హోగా ముఝ్‌పర్ (జంగ్లీ), తేరీ ఆంఖోంకే సివా దునియామే (చిరాగ్), తుమ్ ముఝే యూ భులాన పావోగే (పగ్లా కహీకా), దిల్ జో న కెహ సకా (భీగీ రాత్), ఒ మేరే శాహేఖుబా (లవ్ ఇన్ టోక్యో).... ఇలాంటివెన్నో. కొన్ని పాటలైతే, లతా పాడినట్లు కూడా చాలామందికి తెలీదు.

రఫీ గురించి ప్రపంచానికి తెలీని విశేషాలు చాలానే ఉన్నాయి. అతని గురించిన అంచనాలు ఇంకా సరిగ్గా జరగనేలేదు (రాజు భరతన్ వంటి పాత్రికేయుల కృషి ఇందులో చెప్పుకోవాలి). లతా, రఫీల మధ్య 1960 దశకంలో విభేదాలు వచ్చినప్పుడు, మదన్‌మోహన్, శంకర్-జైకిషన్ వంటి లతా అభిమానులు కూడా లతా కోసం రఫీని వదులుకోడానికి బదులు, రఫీ కోసం లతను వదులుకుని, తమ యుగళ గీతాలను రఫీతో ఆశాకు, సుమన్ కళ్యాన్‌పూర్‌లకు ఇచ్చినట్లు చరిత్ర చెబుతుంది. రఫీ-లతా కంటే ముందే 25 వేల పాటలు పాడారు. అదికూడా రికార్డు కాలేదని రఫీనే ఒక్కసారి ఏదో ఇంటర్వ్యూలో అన్నారు. అయితే అతను ఇలాంటివి పెద్దగా పట్టించుకున్న వ్యక్తి కాదు. అతని పాటలే అతని జీవితం. నిజజీవితంలో అతి నిరాడంబరంగా, నిదానంగా, కోపతాపాలు, ఈర్ష్యాద్వేషాలు లేని నిండు హృదయం కలవాడిగా, దైవ చింతనకూ, నిష్కల్మషానికీ పేరుపొందిన వాడిగా అందరికీ తెలిసిన రఫీ, తన పాటల్లో అన్ని రుచులనూ, రసాలనూ, అనుభూతులనూ అద్భుతంగా పలికించి, పాటల్లోనే నవరసాత్మకమైన జీవితాన్ని జీవించాడు.




మన మనస్సులోని ప్రతి అనుభూతినీ వ్యక్తీకరించే పాటను అతను పాడాడు. హిందీ చిత్రసీమలోని ప్రతి నాయకుడికీ పాడాడు. తెలుగు చిత్రసీమలో కూడా ఎన్.టి.ఆర్.కు సూపర్‌హిట్ పాటలు పాడాడు. ప్రైవేట్ రికార్డులలో కూడా 'బాపూజికి అమర్ కహానీ' వంటి పాటల ద్వారా 'పావ్ పడూ తోరే శ్యామ్' వంటి భజన గీతాల ద్వారా సినిమా పాటలు వినని వారికి కూడా ప్రియతముడయ్యాడు.

మనసు బాగా లేనపుడు
మన్‌రే, తూ కాహె నధీర్ ధరే
కభీ ఖుద్ పే, కభీ హాలాత్ పే రోనా ఆయా
జిందగీ భర్ గమ్ జుదాయి కా ముఝే తడపాయేగా
బిచ్ డె సభీ బారి బారీ
యె మెహలో యె తఖ్తో యె తాజోం కి దునియా
దిన్ ఢల్ జాయే హాయే రాత్ నజాయ్

లాంటి పాటలు వినండి. కళ్లలో నీళ్లు తిరుగుతాయి. కానీ వాటిలో మన మనఃస్థితిని ప్రతిబింబించే బాధకు ఆనవాళ్లతో పాటు, ఒక గొప్ప అనుభవం పొందిన ఆనందబాష్పాలు కూడా ఉంటాయి. అదే రఫీ స్వరంలోని మహిమ.

**-మృణాళిని**




నిర్మాణ కాలంలోను, విడుదలయిన కొన్ని రోజుల వరకు మాత్రమే కాకుండా-దశాబ్దాలు దాటిన తర్వాత కూడా సదుపమానంగా ఉదహరించుకునే రీతిలో , ఉన్నత ప్రమాణాలతో చిత్రాలను నిర్మించిన ప్రతిష్ఠాత్మకమైన అన్నపూర్ణా సంస్థ నుండి వెలువడిన మరో మణిపూస




1959లో విడుదలయిన ఈ చిత్రంలోని పాటలు - వాటి ఆవిర్భావానికి కారకులైన వారందరి పేరు ప్రతిష్ఠలను శ్రోతల హృదయాలలో మరింత పటిష్ఠం చేస్తూ నేటికీ అలరిస్తున్నాయి. ఏ రాగాన్ని తీసుకున్నా అందులో తనదైన శైలిని, ముద్రని పూర్తిగా ప్రతిబింబించేటట్టుగానే కాకుండా- అనుకరించలేనంత అనన్య సాధ్యంగా స్వరపరచటం కూడా మాస్టర్‌వేణు ప్రత్యేకతల్లో ఒకటి. ఆయన సంగీతాన్ని సమకూర్చిన ఈ చిత్రంలో గల తొమ్మిది గీతాలలో ఓ నాలుగు పాటలు ఈ సంచికలో...

హాయిగా ఆలూ మగలై కాలం గడపాలి ॥హాయిగా॥
వేయేళ్లు మీరనుకూలంగా ఒకటై బ్రతకాలి
హాయిగా చేయి చేయిగా ఆలు మగలై కాలం గడపాలి
సతిధర్మం పతిసేవేయని పతి భక్తిని చూపాలి
అనుదినము అత్తామామల పరిచర్యలనే చేయాలి
పతి ఇంట్లో బంధు జనాల అభిమానం పొందాలి ॥పతి॥
పదిమందీ నీ సుగుణాలే పలుమార్లు పొగడాలి ॥హాయిగా॥
ఇల్లాలే ఇంటికి వెలుగని ఎల్లప్పుడు తెలియాలి
సంసారపు బండికి మీరే చక్రాలై తిరగాలి
శరీరాలు వేరేగాని మనసొకటై మసలాలి ॥శరీరాలు॥
సుఖమైనా కష్టమైనా సగపాలుగా మెలగాలి ॥హాయిగా॥
ఇరుగమ్మలు పొరుగమ్మలతో ఇంటి సంగతులు అనవద్దు
చీరలు నగలిమ్మని భర్తను చీటికిమాటికి అడగొద్దు
అత్తింటను అదరిపాటుతో పుట్టిందని పొగడొద్దు ॥అత్తంటి॥
తరుణం దొరికిందే చాలని 'తలగడ మంత్రం' చదవొద్దు॥హాయిగా॥



ఈ పాటను శ్రీ శ్రీ రాశారు. సుశీల, సరోజిని ఆలపించగా తెరపై అభినయించిన వారిలో అలనాటి ప్రముఖ నటి పుష్పవల్లి కుమారుడు, ఈనాటి ప్రసిద్ధ నటి రేఖ సోదరుడు అయిన మాస్టర్ బాబ్జీతో పాటు బేబీ శశికళ, కన్నాంబ, జి.వరలక్ష్మి మరి కొందరు బాల కళాకారులు ఉన్నారు. శ్రీ శ్రీ ఆ రోజుల్లో డబ్బింగ్ చిత్రాలలో బిజీగా ఉండేవారు. 'మీకైతే ప్రత్యేకంగా రాస్తాను' అని నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు గారితో చెప్పి ఈ చిత్రంలో

అయిదు పాటలను రాశారాయన. ఈ పాట సన్నివేశాన్ని వివరించి పిల్లలకు అనుకూలంగా ఉండేటట్లు రాయమన్నారు మధుసూదనరావు. 'పెద్దవాళ్లకు కూడా పనికొచ్చేటట్లు రాస్తాను' అంటూ పై విధంగా రాశారు శ్రీ శ్రీ. చివరి చరణంలో 'తలగడ మంత్రం' అంటూ శ్రీ శ్రీ చేసిన చమత్కారానికి యూనిట్‌లో అందరూ ముసిముసిగా నవ్వుకున్నారట. ఖచ్చితంగా వేరుచేసి, వ్యత్యాసాన్ని చూపలేనంత దగ్గరగా కాఫీ, పీలూరాగాలను మిశ్రమం చేసుకుంటూ మాస్టర్ వేణు స్వరపరిచారీ గీతాన్ని.

తెలియని ఆనందం నాలో కలిగినదీ ఉదయం
పరవశమై పాడే నా హృదయం ॥తెలి॥
కలకలలాడెను వసంతవనము
మై మరిపించెను మలయానిలము ॥కల॥
తీయని ఊహల ఊయల లూగి
తేలే మానసము-ఏమో ॥తెలి॥
రోజూపూసే రోజాపూలు ఒలికించినవి నవరాగాలు... ॥రోజా॥
పరిచయమైన కోయిల పాటే
కురిసే అనురాగం -ఏమో ॥తెలి॥
అరుణ కిరణముల గిలిగింతలతో
కరిగిన తెలిమంచు తెరలే తరలి ॥అరుణ॥
ఎరుగని వింతలు ఎదుటే నిలచి
వెలుగే వికసించే-ఏమో ॥తెలి॥



ఈ పాటను సుశీల పాడగా సావిత్రి, అక్కినేని అభినయించారు. శ్రీ శ్రీ రాయగా దేశ్, తిలక్ కామోద్ రాగాలలో మలచబడ్డ ఈ పాట ఈ నాటికీ సుశీల క్రెడిట్స్‌లో ఒకటిగా నిలిచిపోయింది. 'రోజూపూసే రోజాపూలు' చరణంలో 'ఒలికించినవి నవరాగాలు' తర్వాత దేశ్ రాగంలో సుశీల చేసిన ఆలాపన మనసుని ఎంతగానో ఉత్తేజపరుస్తుంది. అలా లీనం చేసుకుంటూ ఉత్తేజపరిచే గుణం ఉండబట్టే ఇవాళ మనం వింటున్న 'బజే సర్‌గమ్ హర్ తరఫ్‌సే' దేశభక్తి గీతానికి దేశ్ రాగాన్ని ఎన్నుకున్నారేమోననిపిస్తుంది. ఈ 'తెలియని ఆనందం' పాటను నిజానికి ఊటీలో కొన్ని సన్నివేశాలతో పాటు చిత్రీకరించ వలసిఉంది. 40 రోజులపాటు షూటింగ్ ప్లాన్ చేసుకుని యూనిట్ మొత్తం అక్కడకు వెళ్లి ఎనిమిది రోజుల పాటు షూటింగ్ చేశాక ఎడతెరిపిలేని వర్షం మొదలయి షెడ్యూల్ అంతా క్యాన్సిల్ అయింది. సెప్టెంబరులో అయితే అక్కడ వర్షాలు ఉండవని అప్పుడు తీసుకుందామని వెనక్కి వచ్చేశారు. సెప్టెంబరులో తనకు నెలలు నిండుతాయని చెబుతూ తాను గర్భవతినన్న శుభవార్తను తెలియజేసింది సావిత్రి. దాంతో ఊటీలో తీసిన సన్నివేశాలను తిరుపతి సన్నివేశాలుగానూ, కొంత కథ తిరుపతిలో జరిగినట్టుగానూ మార్చి వాహినీ స్టూడియోలో ఈ పాటకోసం ప్రత్యేకంగా సెట్ వేసి తీసారు.

తిరుపతి వెంకటేశ్వరా! దొరా! నీవె
దిక్కని నమ్మినామురా
ఉన్నవాళ్ళు నీకోసం పుణ్యానికి వస్తారు
కడుపుచూపి యాచిస్తే కసరి తిట్టి పోస్తారు ॥తిరుపతి॥
మిట్టరాళ్ళ దారి పోయి సిమెంటురోడ్డు వెలిసింది
కాలినడక మారిపోయి కార్ల వసతి కలిగింది
వచ్చే పొయ్యే వారికెల్ల వసరు బాగ కుదిరింది
బిచ్చగాళ్ళ బొచ్చెలోన గచ్చకాయ పడింది ॥తిరుపతి॥
పొంగల్ పులిహోర బూంది అట్టు
చక్కెర పొంగల్ వడ లడ్డు బొబ్బట్టు
ఆరగించని నీ పేరున అర్పణ చేస్తుంటారు
ప్రసాదాలు వంతులేసి పంచుకొని తింటారు
నీకు మాకు సున్నయేనయో! నీవైనగాని
నిగ్గదీసి అడగవేమయో! ॥తిరుపతి॥
ఉన్నది చాలదని హుండీలో డబ్బువేసి
వరములెన్నో కోరుకుంటారు
మేము జానెడు పొట్టకని బిచ్చం ఎత్తామని
ఉరిమిచూసి తరుముకొస్తారు
పోలీసుల పిలిపిస్తారు - వ్యానులోన
పొలిమేరల దాటిస్తారు ॥తిరుపతి॥
ఆపదలో మొక్కువారె అసలు భక్తులనుకోకు
ఆకలితో కొల్చు మమ్ము అన్యులమని యెంచకు
భేదాలకు తావులేక ఆదరమ్మున చూచుకో
సర్వసముడవన్న పేరు సార్థకమ్ము చేసుకో
దైవమన్న పేరు నిలుపుకో - ఈ పేదవాళ్ళ
కడుపుమంట తీర్చి యేలుకో ॥తిరుపతి॥



ఈ పాటను కొసరాజు వ్రాయగా జమునారాణి ఆలపించారు. సుకుమారి అనే నటి నృత్యం చేసి అభినయించింది. ఈ సుకుమారి తర్వాతి రోజుల్లో 'లవ-కుశ' చిత్రంలో 'విరిసె చల్లని వెన్నెల' అనే పాటకు నృత్యం చేసి ఎంతోమంది ప్రేక్షకుల చేత 'సుకుమారి అంటే ఈవిడే' అన్న గుర్తింపును తెచ్చుకుంది. కాలక్రమేణా మలయాళ చిత్ర పరిశ్రమకు వెళ్ళిపోయింది. ఆ తరువాత నాగార్జున నటించిన 'రక్షకుడు' సినిమాలో సుస్మితాసేన్‌కి బామ్మగా నటించి మళ్ళీ తెలుగు ప్రేక్షకుల కంటబడింది. ఆ తరువాత ఎన్నో ఛానల్స్ ప్రసారం చేసిన పెక్కు డబ్బింగ్ సీరియల్స్‌లో కనబడింది. ఈ పాటలో ఇంకో విశేషం కూడా వుంది. ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వం వహించిన సినిమాలకు ఎడిటర్‌గా పనిచేసి, తర్వాత రోజుల్లో ఉపాయంలో అపాయం, ఖైదీబాబాయ్, మంచి బాబాయ్ చిత్రాలకు దర్శకత్వం వహించిన టి.కృష్ణ ఈ పాటలో తెల్ల చొక్కా వేసుకుని, కళ్ళజోడు పెట్టుకుని, రేలంగి పక్కన నిలబడి ఓ ప్రేక్షకుడిగా కనిపిస్తారు.

ఇక సాహిత్య పరంగా ఎన్నదగిన విశేషం ఒకటుంది ఈ పాటలో. మొత్తం సాహిత్యమంతా అవలోకించి చూడండి... 24 ఏళ్ళ తర్వాత కూడా ఇవాళ్టికీ పరిస్థితులు అలాగే ఉన్నాయేంటి అని అనిపించే విధంగా రాసిన కొసరాజు దార్శనికతయే ఈ పాటలోని విశిష్టత. గీత రచయితలకు ఆ స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలను ఇచ్చి వారి ప్రతిభ మీద నమ్మకంతో వేచి వుండే రోజులవి. అందుకు తగ్గట్టుగానే కొసరాజు వంటి రచయితలు కూడా తగు క్రమశిక్షణతో స్పందించేవారు.

**అ: చెక్కిలి మీద చెయ్యి జేర్చి చిన్నదాన**
**నీవు చింత పోదువెందుకే ఇంతలోన**
**నీ చిక్కులన్ని తీరిపోయె చిటికెలోన**
**ఆ: చేసిన మేలు మరువలేను చిన్నవాడ**
**నీకు చేతులెత్తి మొక్కుతాను వన్నెకాడ**
**నా జీవితమె మారిపోయె నేటితోడ**
**అ: ఆడదాని బ్రతుకంటె తీగ వంటిది**
**బాగా నీరు పోసి పెంచకుంటె సాగనంటదీ**
**ఆడదాని బ్రతుకంటె తీగ వంటిది**
**బాగా నీరు పోసి పెంచకుంటె సాగనంటదీ**
**మగతోడు ఉంటేనే జోరుగుంటది**
**అది మూడుపువులారు కాయలౌతుంటది ॥చెక్కిలి॥**
**ఆ: చదువు సంధ్యాలేని చవటను గానోయ్**
**నీ చాతుర్యమంతా నే కనిపెడితినోయ్**
**చదువు సంధ్యాలేని చవటను గానోయ్**
**నీ చాతుర్యమంతా నే కనిపెడితినోయ్**
**మగవారి నాటకాలు వినియుంటినోయ్**
**వారి మోజులెంత బూటకాలో తెలుసుకొంటినోయ్ ॥చేసిన॥**
**అ: ఒంటిగానె బతుకంత నడుపుకొందువా**
**అబ్బ జంట జోలి లేకుండ జరుపుకొందువా**
**ఒంటిగానె బతుకంత నడుపుకొందువా**
**అబ్బ జంట జోలి లేకుండ జరుపుకొందువా**
**లోకులంటె కాకులని మరచిపోదువా**
**ఈ లోకమంటె లెక్కలేక ఎగిరిపోదువా ॥చెక్కిలి॥**
**ఆ: ఊక దంపు నీతులన్ని ఆలకిస్తినోయ్**
**నీ ఊహలోని కిటుకంతా విప్పి చూస్తినోయ్ ॥ఊక॥**
**సూటిపోటి మాటలన్ని కట్టి పెట్టవోయ్**
**ఇంక చాటుమాటు చూపులన్ని దాచిపెట్టవోయ్ ॥చేసిన॥**









ఈ పాటను మాధవపెద్ది సత్యం, జిక్కి పాడగా రేలంగి, రాజసులోచన అభినయించారు. జానపద బాణీలో సాగే ఈ పాటను ఆ రకం గీతాలకు పేరెన్నికగన్న కొసరాజు రాశారు. జానపద గీతాలు ఎక్కువగా వినిపించే హరికాంభోజి రాగానికి జన్యమైన నారాయణి అనే రాగానికి కుండే స్వరాల మధ్య ఈ పాట సంచరించిదని చెప్పవచ్చు. పల్లవిలో కొసరాజు పదాలెంత ఛమక్కునిచ్చాయో మాధవపెద్ది గళం అంతటి ఝులక్ నిచ్చిందని చెప్పడానికి ఓ చిన్న పిట్ట కథ ఉంది.

'మాంగల్యబలం' చిత్రాన్ని తమిళంలో 'మంజిల్ మహిమై'గా ఏకకాలంలో తీసారు. తమిళ గీతాలకు రచయితగా ఉడుమలై నారాయణ కవిని ఎన్నుకున్నారు. ఆయనకు సంగీతంలో కూడా ప్రవేశం ఉంది. ఉడుమలై శరభమ్ ముత్తుస్వామి కవి వద్ద శిష్యరికం చేసి ఆయన మీద గౌరవంతో తన పేరుకు కూడా 'ఉడుమలై' అన్న పదాన్ని చేర్చుకున్న సంస్కారి ఆయన. కొన్ని వ్యక్తిగత కారణాల వలన 'చెక్కిలి మీద చెయ్యిజేర్చి' పాట తమిళ వెర్షన్‌ను రాయలేక పోవటంతో ఆయనకు అసిస్టెంట్‌గా ఉన్న కె.యస్.గోపాలకృష్ణ చేత ఆ తమిళ గీతాన్ని రాయించడం జరిగింది. తర్వాత కాలంలో ఈ కె.యస్.గోపాలకృష్ణ దర్శకునిగా ప్రసిద్ధుడైనారు కూడా. 'ఆనదు అచ్చి పొనదు పొచ్చి' అంటూ కె.యస్.గోపాలకృష్ణ రాసిన పాటను విని 'చెక్కిలి మీద చెయ్యిజేర్చి' పాటలో ఉన్న ఛమక్కు లేదు నేను తిరిగి రాస్తాను రెమ్యూనరేషన్ అక్కర్లేదు అంటూ బాధపడ్డారట ఉడుమలై నారాయణ కవి. ఎలాగోలా ఆయన్ని సమాధాన పరిచారు మధుసూధనరావు. అలా ఉండేవి ఆ రోజుల్లో తపన...నిజాయితీ....

**ఇటువంటి అనుభూతులను ఎన్నిటినో అందించే మిగిలిన పాటల గురించి వచ్చే సంచికలో...**

వీనులకు విందుగా, కనులకు పసందుగా

ఓజస్ ఆడియోస్ వారి గజల్ మరియు గీతాల మాలిక

'గజల్ మాస్ట్రో' గజల్ శ్రీనివాస్ సారధ్యంలో

# నేను - నా ఇల్లు

ఆడియో-వీడియో ఆల్బమ్

ఆగస్ట్ 2003
విడుదల









సంగీతం, గానం, దర్శకత్వం

## గజల్ శ్రీనివాస్

ఆడియో క్యాసెట్లు మరియు సీడిల ఆర్డర్ల కొరకు సంప్రదించండి. వి.జయప్రకాష్
ఓజస్ ఆడియోస్, 504 పాపయ్య ఎస్టేట్, చిక్కడపల్లి, హైదరాబాద్. ఫోన్. 9440065346

